# రాటము - మగ్గము

## Hand Spinning & Hand Weaving

గ్రంథకర్తలు:

యస్. వి. పంతాంబేకరు, యన్. యస్. వరదాచారి







అనువాదకుడు:

ఉన్నవ లక్ష్మీనారాయణ

# పీ ఠి క

మన దౌర్భాగ్యస్థితికి రాజకీయదాస్యముకన్నను ఆర్థిక దాస్యము మూలబీజమని సర్వత్ర తెలిసియున్నది. వర్తకమునకై ఏర్పడిన ప్రాగ్వాణిజ్యసంఘము ప్రభువైనది. ధనధాన్యవస్తు కనక వాహనములతో దులదూగుచున్న భరతవర్షమును ప్రాగ్వాణిజ్య సంఘము దరిద్రస్థితికి దెచ్చిన విధము ప్రపంచేతిహాసములందు దారుణకృత్యముగ నున్నది. చిరకాలసంవర్ధితమైన రాటముమగ్గముపరిశ్రమను వర్తకసంఘము బలవంతముగ పాడుచేసినది. హిందూదేశము ౧౭౫౭-సంవత్సరమునందు స్వదేశమునకు సరిపోయిన బట్టలను తయారుచేయుటయె కాక మూడుకోట్ల రూప్యముల బట్టల నితరదేశముల కెగుమతి చేసినది. ఆకాలపువిలువ వర్తమానకాలమునందు ముప్పదికోట్లకు మించి యుండును. ఇపుడు మన దేశమునకు సంవత్సరమునకు ౭౦ కోట్లరూప్యముల బట్టలు, నూలు దిగుమతి యగుచున్నవి. ఇతరదేశములనుండి భరతవర్షమునకు వచ్చెడి ద్రవ్యప్రవాహము నిలిచి భరతవర్షమునుండి

సంతత ద్రవ్య ప్రవాహము బ్రిటీషుద్వీపములకు బోవుచున్నది. గతించిన నూరుసంవత్సరములందు ౧౦,౦౦౦ కోట్లరూప్యములు విదేశములకు ప్రవహించియుండును. దేశము దరిద్రగ్రస్తమై ప్రజాసత్త్వముక్షీణించినది. ప్రజలకు పరిశ్రమాభ్యాసముపోయి పరాశ్రయము పరిపాటియైనది. వ్యవసాయము కూలిపనులు ప్రధానవృత్తులై వ్యర్థమైనకాలక్షేపము సహజమైనది. వ్యవసాయదారులు సంవత్సరమునందు నాలుగైదునెలలు పనిపాటులు లేక నిరర్థకముగ కాలమును గడపుచున్నారు. ప్రజలను వ్యవసాయపరాయణులను జేయుటకును, సుఖశాంతులను గలుగజేయుటకును, స్వరాజ్యమును సాధించుటకును రాటము మగ్గము పరమసాధన మని గాంధిమహాత్ముడు చాటుచున్న సందేశము సర్వత్ర తెలిసియున్నది.

ప్రజలు సంపన్నులై సుఖజీవనమును జేయునపుడు స్వరాజ్యము ననుభవించుచుందురు. స్వరాజ్యము కార్యమూలమున రాగలదుగాని మాటలమూలమున రాజాలదు. ప్రజలు కార్యపరతంత్రులై మిత్రభావము గలిగి మెలంగుటకు ఖద్దరు దివ్యసాధనముగ నున్నది. రాటము సకలానర్థములను బాపుటకు సుదర్శనచక్రముగ నున్నది.

గాంధిమహాత్ముడు నిరంతరము బోధించుచున్న ఖద్దరు-రాటము సందేశము నీగ్రంథము ప్రత్యక్షప్రమాణ

ములతో రుజువుచేయుచున్నది. శ్రీయుత యస్. యస్. వరదాచార్యులుగారును, యస్. వి. పున్తాంబెకారు గారును శ్రీయుత రేవాశంకరజగ్జీవను మెహతగారు "రాటము - మగ్గము" వ్యాసమున కేర్పాటుచేసిన ౧౦౦౦ రూప్యములబహుమతిని బడసిరి. బహుమతివ్యాసములు పుస్తకరూపమునుదాల్చినవి. శ్రీయుత శంకరలాలుబ్యాంకరుగారియాజ్ఞానుసార మీ పుస్తకము ఆంధ్రమునందు ముద్రింపబడినది. ఆంధ్రభాషానువాదకులైన శ్రీవున్నవ లక్ష్మీనారాయణ పంతులుగారికి కృతజ్ఞుడను. గ్రంథవిక్రయమువలనవచ్చెడి ద్రవ్యమంతయును గాంధిమహాత్ముని యాజ్ఞానుసారముగ అఖిలభారతతంతుకారసంఘము యొక్క-ఆంధ్రశాఖకుసమర్పింపబడును. ఆంధ్రమహాజనులు గ్రంథమును కొని చదివి భావార్థమును గ్రహించి గాంధి మహాత్మునిసందేశమును సార్థకము చేయుటకు, స్వధర్మ నిర్వాహణమును జేయుటకు భగవదనుగ్రహము గలుగు గాత!

ప్రభవ
ఆశ్వయుజ బ. ౧౩
౩నివారము

కా. నాగేశ్వరరావు.



రాటపు సందేశము

చిత్రకారుడు: శ్రీ డబ్ల్యూ. ఏ. ఆర్యదాసుగారు, చెన్నపురి.



# రాటము-మగ్గము

## ౧

### ఖద్దరుయొక్క పూర్వచరిత్రము

ఇండియాలో గ్రామజీవితము బహుశతాబ్దములనుండి యేవిధమయినమార్పులను చెందలేదని లోతుకు దిగి విచారించనివారు చెప్పుచుందురు. కాని అది సత్యము కాదు. చక్కగ పాటుబడుచు పుష్కలముగ ధనమార్జించి సుఖజీవనము చేయుచుండిన హైందవజాతి చేతిపనులయందు గొప్పప్రజ్ఞగలిగి విరివిగ వ్యాపారము చేయుచుండియును శాపముదగిలినట్లు వృత్తులన్నియు పూర్తిగ నశించుటచే సోమరితనము జెంది క్రమక్రమముగ దారిద్ర్యములోను, అప్పులలోను మునిగియుండుట ఆశ్చర్యమును గలిగింపక మానదు. పైకిచలించినట్లు కనపడక శాంతముగ నున్నట్లు తోచినను గ్రామజీవితము సంపూర్ణముగ మారిపోయి తమకుగావలసిన వస్తువులనన్నిటి నుత్పత్తి చేసికొనుచు ఇతరసహాయము నాశింపని గ్రామములకు తమ వృత్తులను, వర్తకమును గోల్పోయి ఇతరులపై ఆధారపడి

సైనికజీవితమును గడుపుకొనవలసిన దుఃస్థితి తటస్థించినది. ఇప్పుడు పల్లెటూళ్ళలో ముడిపదార్థములను ఉత్పత్తిచేసి పరదేశముల కెగుమతిచేయుటయె కాని స్వంతపరిశ్రమ లకుపయోగించుట మానివేసినారు. ఆంగ్లేయపాలనము ప్రారంభించిన తరువాత గూడ గ్రామములు పలువిధము లయిన చేతిపనులకు నిలయములైయుండెను. నూలువడ కుటయును, వస్త్రములు నేయుటయును పరిశ్రమలలో ప్రధానమయినవని చెప్పవచ్చును. రెండు శతాబ్దములకు పూర్వము పిల్లలును పెద్దలును, స్త్రీలును పురుషులును సర్వసామాన్యముగ ఈవృత్తుల నవలంబించుచుండుటచే వీటిచరిత్రను వారికి జెప్ప నవసరము లేకపోయెను. కాని పరిస్థితు లిప్పుడు మాఱిపోయినవి. మధ్యకాలములో తెంపుగలిగినది. ఇప్పుడు అతుకులు పెట్టవలసివచ్చినది. మఱచిన వృత్తులను పునరుద్ధారణచేసి తడబడుచున్న వ్రేళ్లకు నిలకడగుదిర్చి పూర్వపు చాకచక్యముతో రాట మును త్రిప్పించవలసివచ్చినది.

ఖద్దరు మిక్కిలి పురాతనమయిన చరిత్ర గలిగియు న్నది. మొదటినుండి యిప్పటివరకును వరుసగా వ్రాయుట శక్యముగాదు. వేదములు బుట్టినప్పుడే దారమును, వస్త్ర ములును పుట్టినవి. సాలెలును, వేదాంతులును హైందవ ప్రతిభకు మొదటిదృష్టాంతములుగ జెప్పవచ్చును. వేదాం

తుల బ్రహ్మసూత్రములవలన సర్వోత్కృష్టమైన బ్రహ్మ విద్యయును, తంతుకారుల కార్పాససూత్రములవలన అతి సున్నితములయిన వస్త్రములును నిర్మింపబడినవి. ఈజిప్టు మహోన్నతమయిన శవాలయములను (Pyramids), బాబి లోను ఉత్కృష్టములయిన ధర్మశాస్త్రములను నిర్మించిన కాలమునందే ఆర్యులు అనుపమేయమయిన నీమహదారం భములలో విజయముగాంచియుండిరి. తాత్త్వికులు(తత్త్వ వాయులు) తమజ్ఞానతంతువులతో ఆత్మను పరిష్కరించి అజ్ఞానతమస్సును బోగొట్టుచుండగా తంతువాయులు దే హమును తమవస్త్రములతో నలంకరించి మానమును గాపాడుచుండిరి. ఆర్యుల స్వర్ణయుగముయొక్కయు, నాగ రికతయొక్కయు ప్రతిబింబములు తాత్త్వికుడయిన వేదాంతియు, కళాప్రవీణుడయిన తంతువాయుడు నని చెప్ప వచ్చును. హైందవులవాణిజ్యమునకును, కళలకును మూ లస్థానమయిన తంతువాయుని నిర్మాణశక్తినిగూర్చి మన మిప్పుడు ముచ్చటించవలసి యున్నది.

బహుశః నడకడమునకంటె నేయడమే ముందు పుట్టియుండవచ్చును. నేతయనగా గుడ్డలు నేయుటయే కాదు. నాగరికత ప్రారంభమగునప్పటికే నేత ప్రారంభమై నది. కాని నేత ప్రారంభము నాటికే సంపూర్ణస్థితికి వచ్చి నట్లు కనబడుచున్నది.

నూలు పడుగుపోసి అడ్డముగా పేకనేయుటకు పన్నెలను పైకికిందికి పోవునట్లుచేసి పలకతట్టుపద్ధతి, వేలకొలది సంవత్సరములు గడచినను, మొదటినుండియు నిప్పటికిని ఒకేవిధముగనున్నది. ఋగ్వేదములో (౧౦-30) ఇంటియజమానులు పడుగును పేకను అమర్చి నేసినట్లు చెప్పబడియున్నది. ఋషులు పరమాత్మను, మాయను పడుగు పేకలతో పోల్చుటనుబట్టి వారి మనస్సులకు నేత యెంత నచ్చినదో గ్రహింపవచ్చును. ఋగ్వేదములో నేతను గూర్చి అనేకసార్లు ప్రస్తావించి యున్నారు. యజ్ఞమనే నేతను అహోరాత్రములనే సాలెస్త్రీలు ఒకదానితరువాత నొకటి అల్లినట్లు ఋగ్వేదములో వర్ణింపబడినది. జగత్సృష్టి నిమిత్తమై ప్రజాపతిచేసినయజ్ఞము వడుకుటనేయుటలతో పోల్చబడినది. వేదయుగములో నేత గృహస్థధర్మములలో నొకటిగా పరిగణింపబడినది. ఎలుకలు పడుగు దారములను రాత్రులుకొరుకుట సర్వసాధారణమై యుండుటచేత గాబోలు ఋగ్వేదములో (౧౦-33-3) నొకచోట "ఎలుకలు సాలెవానిదారములు కొరికినట్లు చింతలు నా మనస్సున నెఱియుచున్న"వని వ్రాయబడినది. ఆ కాలములో నేత సర్వసామాన్యముగా అందరికి తెలియుటయే కాక దానియందలి నైపుణ్యముగూడ గమనించబడినది. "నేర్పరులైన సాలీండ్రువస్త్రముల నేసినట్లు మీరు గేయ

ముల నల్లుడు"(౧౦-౧౦౬-౧)అనువాక్యమువల్లను, దివ్యు లయిన "ఋషులు ఆకాశమునను సముద్రపు టడుగుభాగ మునను నిరంతరము నేయుచు నేయున్నారు"(౧-౧౪౯-౪) అను వాక్యమువల్లను పై విషయము స్పష్టపడుచున్నది.

నూలువడుకుటనుగూర్చిన ఉపమాలంకారము వేద ములలోను, ఉపనిషత్తులలోను, ఇతర మత గ్రంథముల లోను తరుచుగ కనుపడుచునే యున్నది. మన పూర్వుల దినచర్యలో నూలువడుకుట యెంత ప్రాముఖ్యము నంద యుండెనో యీ క్రింది దృష్టాంతములవలన తెలియగలదు: వడుకుట సాధారణమయిన చేతిపనియేయైనను పవిత్రమ యినదిగా నెంచబడుచు వచ్చినది. శ్రీమహావిష్ణువునకు సుతంతువనియు, తంతువర్ధనుడనియు నామములు గలవు. కవి అగ్ని దేవుని ఆవాహనము చేసినప్పుడు పురాతన తం తువును వడుకవలసిన దని ప్రార్థించినాడు. జీవితమును, మానవజాతియు నిరంతరముగ సాగుటను బాగుగ వడికిన దారముతో పోల్చినారు. "తంత్రులు తమవంశము అంత రింపక పరంపరగా సాగుటకు సంతానమును భూమిమీద ఎడతెగక సాగునట్లు వడికినదారమువలె నిలిపినారు".(తంతు మాతత-౧౦-౫౩-౬) అని ఋగ్వేదము చెప్పుచున్నది. మఱియొక వాక్యములో ముప్పదిని పేనినదారము వర్ణింప బడినది.

అథర్వవేదములో పెండ్లికొడుకు పెండ్లి మొదటి రోజున పెండ్లికూతురు వడికి నేయించిన వస్త్రమును ధరించవలయునని నియమముండుటచేత పూర్వకాలమున ఆడుపిల్లలందరు విధిగా వడుకడము నేర్చుకొనేవారని స్పష్టపడుచున్నది. ఈయాచారము యిప్పటికిని ఓఢ్ర దేశములోని శంబలపురంజిల్లాలో నిలిచియున్నది. అస్సాము రాష్ట్రములోని కొన్ని మండలములలో పెండ్లి కూతునకు అత్తవారింటికి కాపురమునకుబోయిన మొదటి సంవత్సరములో వడికేపనితప్ప ఇతరపని పెట్టరు. ఈ కాలమున సహితము వివాహములో పెండ్లికొడుకును ఆహ్వానించునపుడు కాడి, రోకలి, కవ్వము, కదురు వెంటదీసుకొని పోవుటనుబట్టి చూడగా ఈ నాలుగును, సౌఖ్యముగా కాపురము చేయుటకు అవసరములయినవని తేలుచున్నది. ఇప్పటివలెనే వేదము లుత్పత్తియయిన కాలమున సహితము ప్రతియింటను నూలు ముఖ్యావసరముగా నెంచబడుచుండినట్లు నిశ్చయింపదగియున్నది. అప్పుడును, ఇప్పుడును బ్రాహ్మణులు తమజంధెములకు కావలసిననూలును వడుకుకొనుచునే యున్నారు. మహాపండితులు సహితము నూలువడికి తీరవలసినట్లు మన మిందు వలన గ్రహింపవచ్చును.

## వేదకాలపు దుస్తులు

వేదకాలమునను పురాణకాలమునను స్త్రీ పురుషులు సుందరముగకుట్టి దుస్తులను ధరించునేర్పును గలిగి యుండిరని మనము తెలిసికొనవచ్చును. మగవాండ్రు నీవి అనే లోపలిదుస్తున్ను, పరిధానము లేకఅధివాసస్సు అనే ఉత్తరీయమును, వస్త్రముఅనే మరియొక పంచెయును ధరించుచుండెడివారు. అధర్వవేదములో (౧౩-౨-౧౮, ౯-౧౦-౭) తలగుడ్డ ఉష్ణీషమని పిలువబడినది. తైత్తిరీయ బ్రాహ్మణములో (౩-౬-౭౮) సువర్ణ వస్త్ర ముదాహరింపబడినది. మరుత్తులు బంగారు పొదిగిన వస్త్రములు ధరించినట్లు ఋగ్వేదములో (౫-౫౫-౬)వర్ణింపబడిరి. స్వర్గ వాసులకుసహితము ఆశ్చర్యమును గొలుపువస్త్రములు ధరించినట్లు ఒకఋగ్వేదమంత్రములో వర్ణింపబడి యుండుటచేత వేదకాలమునందే సన్ననూలుతో అతి సున్నితములయిన వస్త్రములు నేయబడుచుండెనని గ్రహింపవచ్చును. భాగ్యవంతుల సన్ననిదోవతులు ప్రావారములని పిలువబడుచుండెను. వారు పైన ఉత్తరీయమును,శిరస్సున ఉష్ణీషమును ధరించుచుండిరి. స్త్రీలు మొలనుధరించుదానికి అంతరీయమనియు, పయిని మేలిముసుగుగా వేసికొను దానికి ఉత్తరీయమనియు పేర్లు. పురాణకాలమున పట్టు దుకూలములును,ఉన్నివస్త్రములును, పలువిధములయిన

ఖద్దరువస్త్రములును, వాడుకలోనుండుట తెల్లమే. వాల్మీకి రామాయణమున బాలకాండములో సీతకు ఊర్ణవస్త్రములును, విలువగల రత్నములును, దుకూలములును, వివిధవర్ణములదుస్తులును, రాజయోగ్యమైన భూషణములును, అనేకవిధము లయిన వాహనములును, రథములును కలిగి యుండినట్లు చెప్పబడినది. భారతమున సభాపర్వములో యుధిష్ఠిర చక్రవర్తి భరత ఖండములో వివిధభాగములనుండి వచ్చిన సామంతరాజులు బంగారపుసరిగంచులుగల ఉన్నివస్త్రములు కానుకలిచ్చినట్లు వ్రాయబడియున్నది. గుజరాతు దేశమునుండి ఆభీరులు అనేకరకముల శాలువలును, కర్ణాటకులు పలువిధముల ఉన్నిగుడ్డలును, దూదివల్లను, పట్టుపురుగుల వల్లను చేయబడిన వస్త్రములును, సన్నని మస్లినులును, చోళపాండ్య దేశీయులు అపరంజి జరీఅంచులుగల నూలువస్త్రములును సమర్పించిరి. ఈవిధముగ పూర్వకాలమున నేత మిక్కిలి యభివృద్ధిజెంది సంపూర్ణదశనుబొందినదనుట నిశ్చయము.

వడుకుటయును నేతయును సర్వసామాన్యముగా ప్రతి గృహమందును అవలంబింపబడుచుండెను. ప్రస్తుతము అస్సాముదేశములో వలెనే పూర్వము మనదేశమ్మందలి ప్రతి గృహిణియును వడుకుచు, నేయుచునుండెను. వడుకుటయును, నేతయును భార్యయొక్క

ధర్మములుగ విధించిన వాత్స్యాయన ఋషి ఆ కాలపు ఆచారమునుబట్టియే యట్లు వ్రాసియుండును. "కార్పాసస్య సూత్ర కారణం సూత్రస్యవానం ఆచ్ఛాదనార్థం" అని వాత్స్యాయనుడు కామసూత్రములలో భార్యాధికరణ మున జెప్పియున్నాడు. నేత ప్రతిగ్రహామునను అవలంబింపబడుచుండినను సాలీలను ప్రత్యేకజాతియును ఆకాల మందున్నట్లు దృష్టాంతములుగలవు. నేతను తమ ప్రత్యేక వృత్తిగా బెట్టుకొన్నవారు మనగ్రామజీవితములో అనాది నుండియు నున్నట్లే కనుపడుచున్నది. సంహితలును, బ్రాహ్మణములును వెలునడినకాలమునందే సాలీలును జీని గలవాండ్రును శ్రేణు లేర్పరచుకొని యున్నట్లు గన్పట్టు చున్నది. శ్రేణులనాయకులు రాజులకు మిత్రులుగను, ఆలోచనసభ్యులుగను నుండుటచేత చేతిపనులును, వాణిజ్యమును ప్రత్యేకవ్యక్తులవల్లను, కంపెనీలవల్లను గూడ నిర్వహింపబడుచుండినట్లు కేంబ్రిడ్జిలో ప్రకటించబడిన హిందూదేశచరిత్రమువలన తెలియుచున్నది. దక్షిణ హిందూదేశములో సాలీలశ్రేణులు గొప్పమోతుబరి తన మును, పరపతియును గలిగి బ్యాంకులు పరిగణింపబడి వానిలో జనులు తమ ధనమును నమ్మకముతో దాచు కొనుచుండిరి. కొన్ని బౌద్ధశాసనములను బట్టి రాజులు సహితము తమధనమును నేతకాండ్ర శ్రేణులలో నిలువ

జేయుచుండినట్లు తెలియుచున్నది. బౌద్ధజాతక కథలలో ఆకాలమున సాలెసంఘములున్నట్లును వానిలోని ఉద్యోగులు ప్రముఖుడు, జ్యేష్ఠకుడు, భాండాగారికుడు ననిపిలువ బడుచుండినట్లును చదువుచున్నాము. ఈశ్రేణులు తమ కార్యనిర్వహణమునకును, క్రొత్తవాండ్రను చేర్చుకొని పని నేర్పుటకును ప్రత్యేకనిబంధనల జేసికొనుచుండిరి. నారద స్మృతి వ్రాసిన కాలమునకే, కళాభిజ్ఞులకును వారిదగ్గర పని నేర్చుకొను వాలంటీర్లకును నిబంధన లేర్పడిఉన్నవి.

దేశములోని కోట్లకొలదిజనులకు భోజనపదార్థములును, వస్త్రములును కొనుటయే అవసరము లేకపోయెను. జీవితమునకు ప్రధానమయిన యీరెండు పదార్థములును ఆయాగృహములయందే ఉత్పత్తియగుచుండెను. రాజులును పట్టణములలో నుండు ధనవంతులు మాత్రమే వస్త్రములను సాలెలచేత నేయించుకొని కట్టుకొనుచుండిరి. వారి ప్రోత్సాహమువల్లనే సన్నని వస్త్రములు నేయబడుచుండెను. విదేశములకు వస్త్రముల నెగుమతిచేయువర్తకులు సంతలలో నూలుకొని నేయించి అమ్ముచుండిరి. రాజకుటుంబములు కొంతకామాటమేర్పరచి తమకుగావలసిన సన్నవస్త్రములను నేయించుకొనుచుండిరి. కౌటిల్యుని యొక్క అర్థశాస్త్రము (33-వ ప్రకరణము) రాజకుటుంబములలో నూలు వడికించి నేయించు

టకు సూత్రాధ్యక్షుడను ఉద్యోగిని నియమించి పని నిర్వహించవలయునని శాసించి అతనిధర్మములను నిర్వ చించుసూత్రములను గలిగియున్నది. ఈసూత్రములలో కూలిచ్చి గుడ్డలునేయించు కొన్నిపద్ధతులను జెప్పుచుండు టచే నవి ముఖ్యముగ గమనించవలసియున్నది. వడికిన దారము తూనికతక్కువయినయెడల, దూది మంచిదికాని యెడల దాన్నిక్రింద తీసివేసి శేషించినది కూలిలో దిగ గోయవలయును అని ఒకసూత్రము చెప్పుచున్నది. ఈ రకము దూదిలోనుంచి ఈ రకమునూలు ఈతూనికగలది నేసియియ్యవలయుననియు, అందుకు తబ్దీలువచ్చినయెడల కూలి తగ్గించుట మూలముగా అప రాధము వేయవలయుననియు విధించుచున్నది. న్యాయ స్థానములు నేతకాండ్రవిషయమై ఖండితముగా వర్తించి దారముయొక్క పొడుగును బట్టి జీతము నిర్ణయించుచుం డినవి. నూలు శాస్త్రీయపద్ధతుల ననుసరించి చక్కచేయ బడుచుండెను. ౫ పలముల పత్తిగాని, జనపనారగాని ఒక పలము నూలునిచ్చునని అర్థశాస్త్రములో నిర్ధారణచేయ బడినది. ఇట్టి నియమములు దేశములో సర్వసాధారణముగ నందరికిని తెలిసియుండవచ్చును. నేతవిషయమున గూడ ఇట్టినిబంధనలే కలవు. పూర్వము మనువుచెప్పిన సూత్రము చొప్పుననే అర్థశాస్త్రముగూడ నేతకాడు ౧౦ పలముల

నూలుకు పరిగంజీతో సరిచేసి నేసిన ౧౧ పలములగుడ్డ నియ్యవలయుననియు అందుకు దప్పినయెడల శిక్షింపవలయుననియు నియమ మేర్పరచినది. సమర్థుడయిన అధికారి సాలీలపనిని తనిఖీచేసి ఎక్కువ చిక్కుసగంజి పెట్టి సరిచేసిగాని, చిక్కగానేయకగాని మోసగించినయెడల శిక్షించుచుండెను. అర్థశాస్త్రమునకంటె ప్రాచీనమయిన శుక్రనీతి వస్త్రపుడను ఉద్యోగియొక్కయు, అతడు చేయవలసిన పనులయొక్కయు నిర్వచనమును దెలుపుచు అతడు ఊర్ణ వస్త్రములయొక్కయు, పట్టుపంచెలయొక్కయు, నూలు గుడ్డలయొక్కయు, ఉత్పత్తిస్థానమును బట్టియు, ముదుగు సన్నములనుబట్టియు, మనుగడను బట్టియు ధరలు నిర్ధారణ చేయవలసినదని సూచించుచున్నది. వివిధరాష్ట్రముల లోనిసరుకులు ప్రత్యేకములయిన సుగుణములుగలిగియుండెను. వంగరాష్ట్రము మృదువయిన తెల్లనిదుకూలములను నేయుచుండెను. పాండ్యదేశములో ఇంద్రనీలమణి వలె నున్నని సాఫైననల్లగుడ్డలు ఉత్పత్తియగుచుండెను. మధుర, అపరాంత, కళింగ, కాశి, కౌశాంబి, మాహిష్మతి అనుపట్టణములు నూలు వస్త్రములకు ప్రసిద్ధికెక్కియుండెనని అర్థశాస్త్రము (ప్రక. ౨-౧౧) చెప్పుచున్నది.

## వడుకుట దారిద్ర్యనివారకమైన చట్టము

రాటము సర్వత్ర వ్యాపించియుండుటచేత ఇతర వృత్తులు లేనప్పుడు జనులు నూలువడికి న్యాయముగ జీవయాత్ర గడపుచుండిరి. దారిద్ర్యపీడితులకును, నిరాధారులకును రాటమే రక్షణమైయుండెను. జాతకకథలలో నొక దానియందు మరణావస్థయందున్న తనభర్తను ఒకపతివ్రత "నేను నూలువడకగలను. తన్మూలమున మనబిడ్డలను పోషించగల"నని భర్త నోదార్చెను. నూలువడికి దారిద్ర్యమును నిర్మూలింపవచ్చును. సూత్రాధ్యక్షుడు నిరుపేదలకును, వికలాంగులకును, ఇలువెడలని బీదరాండ్రకును, పోషకులులేని బాలికలకును నూలువడుకుపని నిచ్చి జీవనముగల్పించవలసినదని అర్థశాస్త్రము చెప్పుచున్నది. నూలువడుకుటయే ఒకవిధమయిన దారిద్ర్యనిర్మూలకమగు చట్టముగానుండెను. మనుస్మృతి వ్రాయబడినకాలమందు సహితము కుల్లూకభట్టుయొక్క వ్యాఖ్యానప్రకారము ఇలువెడలని వితంతువులు మున్నగు నిరాధారులకు నూలువడుకుటయే న్యాయమైన వృత్తియని యెంచబడినది.

ఇతరదేశములలో నూలునుగూర్చి వినిమైన యుత్పత్తి ... డకపూర్వమే నూలువడకుట, నేయుట హిందూదేశములో సర్వసాధారణముగా అందరును ఎరిగియుండిరని రుజువు

చేయుటకు బలవత్తరమయిన సాక్ష్యమున్నది. క్రీస్తుపుట్టుటకు వేయిసంవత్సరములకు పూర్వమే పురాతనబాబిలోనుపట్టణములో దొరికిన యొకవస్త్రముల జాపితాలో సన్ననిమజ్లిను వస్త్రములకు సింధు అనిపేరుండుటచేత ఇండియాలో నివసించి ఆర్యభాషమాట్లాడుచుండిన జనులకును, బాబిలోనునకును సముద్ర వ్యాపారముండినట్లు స్పష్టపడుచున్నదని అస్సీరియా చరిత్ర పరిశోధకుడగు డాక్టరు సెయిస్ గారు చెప్పుచున్నారు. ఈజిప్టుశవములకు హిందూదేశవస్త్రములు చుట్టబడినవను విషయమును గూర్చి బెయినుగారు సందేహించినను హిందూదేశము నూలువర్తకము చాల పురాతనమయినదని చెప్పుటకు ఏవిధమయిన సందేహమును లేదు. నూలుగుడ్డలకు గ్రీకుభాషలో 'సిండా'నని పేరుండుటచే నామాట సింధుశబ్దమునుండి ఉత్పత్తియయినదని నిశ్చయముగా చెప్పవచ్చును. గ్రీకులు మజ్లినువస్త్రములను 'గాంగెటికా'యని పిలుచుటచేత వీనికి జన్మస్థానము గంగానదీప్రాంతమగుటచే దేశమునుబట్టి ఆపేరు వచ్చినదనియు 'కాలికో'యనుపేరు ఈవస్త్రములను విశేషముగా ఎగుమతిచేయుచున్న రేవు పట్టణమగు కల్లికోటనుండి వచ్చినదనియు చెప్పవచ్చును. హిరోడొటస్ అను సుప్రసిద్ధగ్రీకుచరిత్రకారుని కాలమునందు నయితము దూదితో చేయబడినవస్త్రములను

గ్రీకు లెరుగరని రుజువుచేయుటకు పైచరిత్రకారుఁడు 'దూది' అనగా 'గొఱ్ఱెలనెంట్రుకలకంటె మేలయిన ఒక రకము నూలని వ్రాయుటయే ప్రబలసాక్ష్యము. అలెగ్జాండరుయొక్క సేనాధిపతియును, గ్రీకుభాషాపండితుఁడును నగు అరిస్టాబలసు ప్రత్తిచెట్లు ఉన్నినిచ్చునట్టి చెట్లనియు ఒకతరహాచిన్నసంచివలె నుండి దానిలోనుంచి విత్తనములు దీసివేసి మిగిలినది దారముచేయబడుననియు వ్రాయుచున్నాడు. అలెగ్జాండరుయొక్క నౌకాసేనాధిపతి యయిన 'నియర్కుసు' ఇండియాలో ఒకవిధమయిన చెట్లున్నవనియు 'గొఱ్ఱెమందల'నే దానికొమ్మలనుండి నూలు దీసి దానితో చక్కని తెల్లవస్త్రములను హిందువులు చేయుదురనియు వ్రాయుచున్నాడు. దూది ఇండియాలో సర్వసాధారణముగా దొరికెడు సామాన్యవస్తువేయయినను పరదేశీయుల కిదియెంతయో వింతగా దోచినను అది చేతిపనులకును వర్తకమునకును మిక్కిలి యుపయోగకారియనిమాత్రము అందరు గ్రహించినారు. మనదేశములోని రాష్ట్రము లొంటొంటితో విరివిగ వర్తకము చేయుచుండెననియు, దూదివర్తక మందు ముఖ్యమయినదనియు మాత్రము స్పష్టముగా జెప్పవచ్చును. ఆకాలములో వర్తకపుసరుకులు విరివిగ కొనిపోబడుచుండిన రాజమార్గములలో ముఖ్యమయినవి మూడు: ౧. కాశీపట్టణమునుండి

పశ్చిమతీరపు ఓడరేవులకు 'భరుకచ్ఛ'లేక 'బ్రోచి'పట్టణమునకును, సౌవీరదేశములోని 'రురుక్కా'రేవునకును వ్యాపించిన రాజవీథి; ౨. ఉత్తరమున గాంధారము నుండి ఆగ్నేయముననున్న మగధదేశమునకు వ్యాపించిన రాజవీథి; దీనినే మెగాస్తనీసు పాటలీపుత్రమునుండి సింధు మాగాణమువరకు వ్యాపించియున్న రస్తాయని వ్రాసియున్నాడు. 3. ఉత్తరమున 'శ్రావస్తి'నుండి నైరృతి మూలనున్న ప్రతిష్ఠానపురమువరకు వ్యాపించిన ఆరు అంచెలుగల రాజమార్గము. ఈ మార్గములనే దేశములోని నూలువస్త్రములు కొల్లలుగ రేవుపట్టణములకు ప్రవహించి యచ్చటనుండి విదేశముల కెగుమతి చేయబడుచుండెడివి. సన్నని మజ్లినువస్త్రములును, ముతక గుడ్డలును మెట్టదారిన పడమటిఆసియాలోని సిరియాబాబిలోను, పర్షియా, చీనాదేశములకును సముద్రమార్గమున జావా పెగు మలాకా గ్రీసు రోము యీజిప్టు మున్నగు దేశములకును ఎగుమతియగుచుండెను. ఈగుడ్డలను బిడారువర్తకులు 'సమరఖండు'మార్గమునను, 'హిందూకుషు' పర్వతకనుమలమార్గమునను, 'బఖోరా' 'ఖైబరు'దేశములగుండా 'తురుష్క' 'తార్తార'దేశములకును, ఆవలనున్న 'రషియా' దేశమునకును 'ఈజిప్టు' మార్గమున 'మధ్యధరాసముద్రము' చుట్టునున్న దేశములకును

పోబడుచుండెను. చైనాఇండియాలకు విరివిగ ఓడవ్యాపారము సహితము జరుగుచుండెను. స్వర్ణభూమియగుబర్మా దేశము మొదలు చీనావరకు నుండు సముద్రతీరపు భాగమంతటను,'మలయాద్వీప' సమూహమునను,హైందవులు కుప్పతిప్పలుగవలస లేర్పరచుకొనిన ప్రదేశములుపలుమారు వచ్చుచుపోవుచునుండు హిందూదేశపుఓడలకు ఆశ్రయములై వర్తకమును, వ్యాపారమును సాగించుట కుపయుక్తములుగ నుండినవి. పూర్వకాలమున విశేషముగ విదేశవర్తకము చేయుచుండిన హిందూదేశపు రేవులను, నాటుపట్టణములను ఉదాహరించు చున్నాను: ౧. సింధునదీ సాగరసంగమముచోటనున్న బార్బరికము; ౨. అపరాంతక దేశములోని కాంబే; 3. బ్రోచిపట్టణమునకు సరుకులు పంపుచుండిన ఉజ్జయిని; ౪. మహారాష్ట్రములోని పైఠాణ దేవగిరిపట్టణములు; ౫. సూరతు, నవసారి పట్టణములు;౬.కన్యాకుమారి,మసాలియ(మచిలీపట్టణము) కావేరిపట్టణములు. ఇవిగాక దక్షిణదేశ మందలి పెక్కురేవులలో యవనులు విశేషముగ వసించి వర్తకముచేయుచుండిరి. అప్పటివర్తకపద్ధతి ప్రకారము విశేషము విలువగల వస్తువులు కొద్దిగా ఓడలలలో కొనిపోబడు చుండెను. అప్పుడు ముఖ్యముగ ఎగుమతి చేయబడుచుండినవి వస్త్రములే. ఇండియాయొక్క భాగ్యము వస్త్రముల

యెగుమతిపై నాధారపడియుండెను. ఇండియాయొక్క సుప్ర సిద్ధమయిన నేతసరుకులును, రసాయనశాస్త్రకౌశల్యమును జూపు రంగుల అద్దకములును పూర్వపశ్చిమ దేశముల వర్తకస్థానములలో అగ్రపీఠము నలంకరించి యుండెను. హిందూదేశపు రేవుస్థానములు దినదినాభివృద్ధినందుచున్న వర్తకముతో, ఆకాలమున మానవు డెరింగిన దేశము లన్నిటితోను లావాదేవీలు గల్పించుకొని విదేశయాత్రికుల కద్భుతాశ్చర్యముల గొలుపుచుండెను.

పూర్వకాలమున హిందూదేశమును జూడవచ్చిన విదేశయాత్రికు లెల్లరును రకరకముల సన్ననినూలుయొక్కయు, చిత్రముగను, శాస్త్రీయ పద్ధతుల ననుసరించియు నేయబడిన వస్త్రములయొక్కయు, ప్రాశస్త్యమును వేనోళ్ల బొగడి వానియందమునకు తమ యానందమును వెలిబుచ్చిరి. ప్రపంచముయొక్క వర్తకమునుగూర్చియు, వాణిజ్యమునుగూర్చియు వ్రాయబడిన గ్రంథము లన్నిట నతి ప్రాచీనమయిన 'ఎరిత్రియన్ సముద్రపు పెరిప్లసు' అను గ్రంథములో హిందూదేశమున పలురకముల నూలువస్త్రములు నేయబడుచున్నవనియు, కార్పాసములను సంస్కృతపదము నుపయోగించి, అవి సాధారణము, ఉత్తమమము, అత్యుత్తమము నని మూడురకములుగ ఉన్నవనియు వ్రాయబడి యున్నది. మరియు దూ ది దిం

స్త్రీకును, పురుషులకును ఉపయోగింపబడుచుండినట్లు పై గ్రంథముననే ఉదాహరించబడి యున్నది. క్రీస్తుశకము రెండవ శతాబ్దమున (క్రీ. శ. ౧౩౧-౧౩౫) హిందూదేశమును సందర్శింపవచ్చిన 'ఆరియను' అను గ్రీకుపండితుడు హిందూదేశపుదూది ప్రపంచమున అన్నిరకములదూది కంటెను తెల్లనిదనియు, అరబ్బులు 'బ్రోచి' పట్టణములో నాదూదిని కొని ఎఱ్ఱసముద్రము, అదూలి మొదలగు దూరప్రదేశములకు ఎగుమతి చేయుచున్నారనియు, మచిలీపట్టణపు కలంకారి గుడ్డలవ్యాపారము విరివిగ సాగుచున్నదనియు, హైందవులు సాధారణముగ రెండువస్త్రములను ధరింతురనియు, తరుచుగ అనేకరకముల పూలునేసిన రంగు వస్త్రములనుపయోగింతురనియు వ్రాసియున్నాడు. ప్రపంచమందంతటను హిందూదేశము వస్త్రములకు ప్రసిద్ధికెక్కి యుండెను. రోమకపట్టణమునకును, రోమక సామ్రాజ్యమునకును నూలువస్త్రములు హిందూదేశమునుండియే పోవుచుండెను. హిందూరోమక దేశములకు ఓడవ్యాపారము షుమారొక వేయిసంవత్సరములకాలము ఈజిప్టు దేశముగుండా జరుగుచుండెనుగాని కాలిఫ్ ఓమరను నతడు ఈజిప్టును జయించి వర్తకము నాపివేసెను. క్రీస్తుపుట్టుటకు పూర్వమొకశతాబ్దమునుండియు రోమకులు హిందూదేశ వస్త్ర

ముల నుపయోగించుచుండిరి. రోమకులు హిందూదేశ వస్త్రముల సౌందర్యముయొక్క వ్యామోహములోబడి యెంత వెలకయినను మజ్లినులను, దుకూలములను, బంగారు సరిగంచువస్త్రములును కొని కోట్లకొలది ధనమును ఇండియాకు బంపుచుండుటచే 'ఎల్డర్ప్లినీ' అను రోమక చరిత్రకారుడు తమ దేశమునకు గలుగుచున్న ఆర్థిక నష్టమునకు చింతించుచు తమదేశమునుండి సంవత్సరమునకు పదికోట్ల సెస్టరులు పోవుచున్నవని వ్రాసియున్నాడు.* ప్రపంచమున మరెచ్చటను దూదిదొరకకుండుటచే వస్త్రములవ్యాపారమంతయు హైందవులహస్తగతమై యుండెను. గుజరాతు దేశముయొక్కయు, చోళమండలముయొక్కయు రేవులనుండి వస్త్రప్రవాహములు విదేశములకు ప్రవహించుచుండెను. క్రీస్తుశకము ౫౩౦ వ సంవత్సరమున 'జస్టీనియను' అను రోమకచక్రవర్తి చేసిన చట్టములలో హిందూదేశమునుండివచ్చు వస్త్రముల మీద శాహారీ(పన్ను) విధించబడియున్నది.' † రెండవకా

* దుకూలములును, మజ్లినులును, దూదివస్త్రములును రోము దేశములో అమితధరల కమ్మబడుచుండెను. ఆరీలియను అను చక్రవర్తికాలములో పట్టు బంగారమునకు ఎత్తునకెత్తుగా నమ్మబడుచుండెను.

† ఒడలు పైకిగనబడునంతటి సన్ననిపట్టువస్త్రములు జనులు ధరించుచుండుటచే నీతికి భంగమని 'టైబీరియసు' చక్రవర్తి వానిని నిషేధింపుమ నొకచట్టము చేసెను.

లిపులయిన 'ఓమరు' ౧౨ చోట్ల చినిగిననూలువస్త్రమును ధరించి మతోపన్యాసము గావించెనని చెప్పుదురు. మహమ్మదుయొక్క అల్లుడయిన 'అలీ' నూలుగౌనును ధరించెను. పరిషియా, మెసాపొటేమియా, జావా మొదలగు దేశములన్నిటియందును నాగరకులందరు హిందూవస్త్రములనే ధరించుచుండెడివారు. సన్నగుడ్డలకెక్కువ ఖర్చు గలిగియుండెను. బంగాళములోని మజ్లినులు మిక్కిలి విలువగలిగియున్నను అట్టివస్త్రములే దేశముయొక్క యితర భాగములయందును ఉత్పత్తియగుచుండెను. హిందూదేశపు అద్దకములును, అంచులును ప్రపంచము నాకర్షించుచుండెను. పదమూడవశతాబ్దములో హిందూదేశమునకు వచ్చిన 'మార్కోపోలో' అనురోమకుడు తెలుగు దేశములో మజ్లినులును, సన్నని యితరవస్త్రములును నేయబడుచుండినట్లు వ్రాసియున్నాడు. అవి సాలెపురుగులు చేయు బూజునకంటె సన్నముగ నున్నవనియు, ప్రపంచములో వానిని ధరించుట కభిలషింపని రాజకుటుంబము లుండవనియు ప్రశంసించియున్నాడు. విశాఖపట్టణపు పంజామాలును బందరు, కలంకారిచీటీగుడ్డలును, నెల్లూరిసారీలును, ఆరణిమజ్లినులును విదేశములలో విరివిగ నమ్ముడు పోవుచుండెను. ౧౬వ శతాబ్దములో హిందూదేశమునకు వచ్చిన 'బార్బోసా' యనునతడు కాంబే

పట్టణములో ప్రపంచమంతటినుండియు వర్తకులు వచ్చు చుందురనియు, హాలండులోవలె అన్నిరకముల చేతిపను లును వృద్ధిబొందియున్నవనియు వర్ణించుచున్నాడు. ఆయనకాలమున వస్త్రవ్యాపారము విరివిగ సాగుచుం డెను. బార్బోజా వచ్చుటకు నూరుసంవత్సరముల క్రింద ప్రత్తియొక్క యూరోపుఖండములోని దక్షిణదేశములకు గొంపోబడెను. ఇప్పటికి షుమారు ౧౧ వందల సంవత్సర ముల క్రిందట ఇద్దరు హైందవులు ప్రత్తిపైరును జపానుదేశ మునకు తీసికొనిపోయినట్లు డాక్టరు 'తకాకాసు' అను ఆయన "ఇండియానుండి మనమేమినేర్చుకొంటిమి" అను శీర్షికగల వ్యాసములో వ్రాయుచున్నాడు. ఐరోపాలో మొదట దూది కాగితములు చేయుట కుపయోగించబడు చుండెను. ఐరోపాఖండములో ఇటలీదేశములోనే మొదట దూది నూలు చేయుట కుపయోగించబడెను. వెనీసు, మిలాను మండలములలోను, తరువాత జర్మనీలోని శాక్సని, ప్రషియాలలోను నూలువస్త్రములు నేయ బడెను గాని యవి హిందూదేశపువస్త్రములతో సరి తూగలేకపోయెను. యథాప్రకారముగ హిందూదేశపు వస్త్రములు ఎగుమతియగుచునేయుండెను. అరబ్బులు తూర్పుమధ్యధరాసముద్ర దేశములకును, ఇటాలియనులు 'లెవాంటు' దేశములకును గొంపోవుచుండిరి. పైరార్డు,

బార్బోసా, నికొలొకొంటి, లిన్‌షోటను మున్నగు యాత్రికులసాక్ష్యమువలన హిందూదేశమునకు తూర్పునను, పశ్చిమమునను ఉన్న దేశములన్నిటియందును, దక్షిణాఫ్రికా భూములలోను హిందూదేశపువస్త్రములు ఎదురులేక వ్యాపించుచుండెను; ౧౫౦౩-౧౫౦౮ వ సం॥లలో నిండియాకువచ్చిన 'వర్థిమా'యను నతడు ప్రపంచమందన్ని దేశములకంటెను బంగాళములో నెక్కువదూదిదొరకునని వ్రాసియున్నాడు. బంగెలే పట్టణమునుండి ప్రతిసంవత్సరము పట్టుగుడ్డలతో నిండిన ౫౦ ఓడలు బయలుదేరునని వ్రాసెను. తరువాత ౬౦ సంవత్సరములకు వచ్చిన సీజరుఫ్రడరికు అను వెనిసుదేశపువర్తకుడు సకతోము రేవునకును, పెగ్యూదేశమునకు మధ్య వస్త్రవ్యాపారము విరివిగ సాగుచున్నదనియు, రంగులు వెలిసిపోక కళాయిపూసినట్లు అతికి ఉతికినకొద్ది ఛాయ యినుమడించుచున్నదనియు వర్ణించుచున్నాడు. తరువాత ౧౬ వ శతాబ్దాంతమున వచ్చిన 'లిన్షోటను' అను నతడు 'సాంతోము' నాగపట్టణ, మచిలీపట్టణములలో అనేకరకముల నూలు వస్త్రములు నేయబడుచున్నవనియు, మిక్కిలి పనితనము గలిగి సున్నితముగా అవి నేయబడుటచే పట్టువస్త్రములకంటెను అందమై ఎక్కువ విలువగలిగి ఆదరించబడుచున్నవనియు చెప్పుచున్నాడు. ౧౭ వ శతాబ్దములో మనదేశ

మునకు వచ్చిన 'బర్నై'లను నతడు మన నూలుగుడ్డల సున్నితమును జూచి యాశ్చర్యపడెను. ఈతనిసమకాలికు డయిన 'టావెర్నియరు' అనునతడు మాళ్వా, బంగాళ ములలో నేయబడు కాలికోగుడ్డలుచేతితో తాకినను మెత్తగా తగిలినట్లే కనుపడవనియు, నూలు స్థూలదృష్టికి స్పష్టముగా కనుపడనంత సన్నగా నున్నదనియు ప్రశం సించియున్నాడు. ఈవిధముగా పొగడిన ప్రయాణికు లెం దరో కలరు. ఈప్రబలసాక్ష్యమంతయు పరస్పరవిరుద్ధము గాక బహుశతాబ్దములు గడచినను ఖద్దరు పనితనమునను, మార్దవమునను, సున్నితమునను రక మెంతమాత్రము ను తగ్గక జాతిలో నేర్పరితనము, సమర్థత మున్నగు సుగుణ ములను పెంపొందించినదనియు, ౧౮౨౧ వ సం. ములో మౌంటుస్టూవార్టు ఎల్ఫిన్‌స్టనుగారు ఇండియాదేశపుచేతి పనులన్నిటిలో ముఖ్యమైనది ఖద్దరుచేత యనియు, బహు కాలమునుండియు పొగడ్తగాంచిన దాని సౌందర్యమును, మార్దవమును, సున్నితమును, పనితనమును అలవర్చుకొను టకు ప్రపంచమున నింతవర కేజాతికిని సాధ్యముకాలేదని యు వ్రాసిన మాటలు సత్యముగాక వాస్తవమేయనియు రుజువు జేయుచున్నది.

ఔన్నత్యమునకు కారణములు

ఖద్దరు నిర్మాణమున ప్రపంచమందంతటను ఇండియా కగ్రపీఠమును సమకూర్చిన గొప్పకారణము లెవ్వి? ఒక కారణమందరకును తెలిసినదే. ఇచ్చటనుమాత్రమే ప్రత్తి పండుటయు, అదియు పుష్కలముగా దొరకుటయునే ముఖ్యకారణము. ఒకపూర్వయాత్రికుడు చెప్పిన విధముగా ఆహారపదార్థములతోపాటు ప్రత్తియు విరివిగ పండింపబడుచుండెను. ప్రత్తియుత్పత్తికితోడు జనులకు పారంపర్యముగావచ్చి సహజమై సంవర్ధమానమైనపనితనమే రెండవ కారణము. పెక్కు కుటుంబములేకాక అనేక కులములు వంశపారంపర్యముగా నీవృత్తి నవలంబించి మానవకోటి కచ్చెరువుగలిగించిన ఖద్దరు నుత్పత్తిచేయగలిగినవి. ఇచ్చట ప్రకృతి అత్యౌదార్యముతో హైందవజాతి కంతకును నేర్పరితనమును, కౌశల్యమును ప్రసాదించినది. ఒకరిబలవంతములేకయే ఎడతెగక పాటుబడుశక్తియు దానికి తోడు రంగులువేసి విచిత్రముగ నద్దకముచేయగల నేర్పరితనము వర్తకప్రపంచములో హైందవులకగ్రస్థాన మిప్పించగలిగినవి. హిందూదేశపు శీతోష్ణపరిస్థితులు రంగులకు చేవయు ఇంపుగొలుపు నిగనిగలును సమకూర్చి ఎన్నటికిని వెలిసిపోని గట్టితనము గలిగించుటచే మనవస్త్రములు ప్రపంచవర్తకరంగమున కన్నెకయినవి. ఈ మేలితనమే

మనఖద్దరున కెక్కువధరలు వెచ్చినది. నేతకావు హిందూ సంఘములో మిక్కిలి గణన కెక్కెను. దేహమున కలంకారము గల్పించిన తంతుకారుడు సగౌరవముగా జెప్పఁ కొనబడియెను.

మహమ్మదీయ ప్రాపకము

మహమ్మదీయ దండయాత్రలవలనను, వారి విజయములవలనను ఇండియాయొక్క ఆర్థికపరిస్థితులు మారలేదు. అంతియకాక మహమ్మదీయ చక్రవర్తులు దేశీయ వృత్తులను పెంపొందించిరనియును జెప్పవచ్చును. పూర్వపు హిందూరాజులవలెనే మహమ్మదీయప్రభువులును నూలును, నేతను పెంపుజెందించిరి. ఢిల్లీచక్రవర్తులును, ఢక్కా నవాబులును హైందవులయిన ఢక్కాసాలీలను ప్రోత్సహించి మస్లినుల నేతను పెంపొందించుటయే దీనికి తార్కాణము. భోగపరాయణులు, డాంబికులు నగుటచే నవాబులును, చక్రవర్తులును ఒండొరులతో పోటీలుపడి దేశీయవృత్తులబెంపొందించిరి. మహమ్మదీయ చక్రవర్తుల కాలమున నేమాత్రము విలువగలవస్త్రము లుత్పత్తియగుచుండెనో తెలిసికొనుటకు తగిన సాధనములు లేకుండుట విచారకరము.

మోర్లెండుగారు "అక్బరుమరణకాలమునఇండియా పరిస్థితులు" అను పేరుతో వ్రాసిన గ్రంథములో "ఆకాలపు

వస్త్రముల ఉత్పత్తియొక్క అంచనావేసియున్నారు. ఆ కాలపు జనాభా ననుసరించి తలకు ౧3 గజముల వంతున ఉత్పత్తియగునని వారిమదింపునుబట్టి తేలుచున్నది. ఈ చిన్న పుస్తకములో వారు తెల్పిన అంశములను విమర్శించుట కవకాశములేదు. కాని వారు లెక్కవేసినపద్ధతి సరియైనదికాదని మాత్రము చెప్పివిడుచుచున్నాము. విదేశములకు నెగుమతికాబడిన వస్త్రములసంఖ్య ఇంగ్లీషు, డచ్చివాండ్లుతీసికొనిపోయిన సరకులను మాత్రమే తీసికొనియుండుటచేతను, దేశములో నుపయోగింపబడు వస్త్రముల మొత్తమును అడ్డగోలుగా తగ్గించివైచుటచేతను వారిలెక్కలు లోపభూయిష్ఠమని చెప్పవచ్చును. దేశములో నుపయోగించబడు వస్త్రములన్నియు ఖద్దరే యనియు పైగా అరేబియాయును, దానిసమీపదేశములును, బర్మాయును, తూర్పుద్వీపములును, తూర్పుఆఫ్రికాయును ఇండియా వస్త్రములనే యుపయోగించుచుండెననియు, ఆయన అంగీకరించియున్నారు. ౧౬వ శతాబ్దాదిని ఇండియాకు వచ్చిన పైరార్డుఅను ఆయన కాంబె, కాలికట్టు, సూరతు, గోవాలు విరివిగ వస్త్రముల నెగుమతిచేయు రేవులనియు ఇండియానుండి వచ్చు పట్టుఖద్దరు వస్త్రములనే ఆఫ్రికాలోని గుడుహోపు అగ్రము మొదలు-చీనావరకును జనులు ఆపాదమస్తకము ధరించుచుండిరనియు ఇయ్యవి మంచువలె

త్రెల్లనై మృదువుగనుండెననియు వ్రాసియున్నాడు. అవి మిక్కిలి ఘనితనముగలిగి చౌకగా నుండెనట. అవి కాంబే సింధుశాఖనుండియు, చోళతీరమునుండియు, బంగాళసింధు ప్రాంతములనుండియు విశేషముగ నెగుమతి యగుచుండె నని అందరు నంగీకరించియున్నారు. పైరార్డు, బర్ని యరు, టావర్నియరు, మున్నగు ప్రయాణీకులెల్లరును ఖద్దరువర్తకము విస్తారముగ నుండెననియు వాక్రుచ్చిరి. కనుక ఇండియాలో ఖద్దరు నిర్మాణమే ప్రధానవృత్తి యనియు 'అక్బరు' తరువాతి చక్రవర్తులుగూడ దానిని పోషించి పెంపొందించుచుండిరనియు చెప్పవచ్చును.

మార్పు

మరియు ఉత్తర హిందూస్థానములోని బీహారు పంజాబు సంయుక్తరాష్ట్రములలో నేత చేతులుమారి చాల వరకు హిందువులను విడిచి మహమ్మదీయుల నాశ్రయించినది. ఇచ్చటి సాలీలలో విశేషసంఖ్యయిప్పటికిని మహమ్మదీయులుగనే యున్నారు. తక్కిన వృత్తులలో వలెనే మహమ్మదీయులు హిందువులతోపాటు నేతనేయుటకు బూనుకొనిరి. నేత మిక్కిలి గౌరవమయిన వృత్తిగా నెంచబడెను. దక్షిణదేశములోని 'తిరువళ్లువరు' వలెనే కబీరు నేతవృత్తి నవలంబించి సుఖజీవనము గావించెను.

దూదివర్తకములో నొకకొత్తవృత్తి బయలుదేరి నది. ఒక్కసంయుక్తరాష్ట్రములలోదప్ప ఇప్పటి పింజారీ (దూదేకులవాండ్రు) లందరు మహమ్మదీయులుగ నుండుట జూడ మహమ్మదీయుల పాలనములో దూదేకుట యొక గౌరవవృత్తిగా ప్రత్యేకింపబడెననుట నిశ్చయము. మొదట పింజారీలు, దింప్లుపరుపులు మాత్రమే చేయుచుండిరనియు, తరువాత యేకులుచేసి నూలువడకుటకు తోడ్పడుచుండి రనియు చెప్పవచ్చును. మఱియు కొన్నిభాగములలో పింజారీలు దళారివృత్తిని సహిత మవలంబించి దూది నిలువ చేసి యేకులు వడుకువాండ్లకిచ్చి నూలు జమచేసి సాలీల కిచ్చుచు వడుకు వారికిని, నేతగాండ్రకును మధ్యజరుగు లావాదేవీలలో కొంత కమిషను సంపాదించుకొనుచుం డుట మనము చూచుచున్నాము. బహుశాపూర్వకాల మున హిందువులు తమకు గావలసినయేకులను తామే చేసికొనుచుండిరి. దక్షిణదేశమునను బంగాళములోను ఇప్పటివరకును ఒకచిన్నవిల్లువంటి సాధనముతో వడుకు వాండ్రు తమయేకులను తామే తయారుచేసికొను ఆచా రము గలదు. విల్లు మారిపోయి ఏకులు చేసికొనుట ప్రత్యేకవృత్తిగ పరిణమించి పలకయును, దస్తాయును గల కమాను ఉపయోగించుట ఎపుడు సంభవించెనో చరిత్ర శోధకులు విమర్శింపవలసిన సమస్యయై యున్నది.

తెల్లవారిపోటీ

౧౭ వ శతాబ్దప్రారంభమున ఐరోపాజాతులు ఇండియాతోను, ఇతర తూర్పుదేశములతోను వర్తకము చేయు విషయమై పోటీచేయప్రారంభించిరి. ధనతృష్ణ వారిని తూర్పుదేశముల కాకర్షించెను. మొదట పోర్చుగీసు వారును, తరువాత డచ్చివారును, కడపట ఆంగ్లపరాసు జాతులును ప్రవేశించిరి. వారిప్రధానోద్దేశము వర్తకమగుటచే ఇండియాలో నుత్పత్తియగుచున్న వస్త్రములు మున్నగునవి కొని యెగుమతిచేయ ప్రారంభించిరి. తూర్పు ఇండియాకంపెనివారు మొదట సూరతు, హుగ్లి, మచిలీపట్టణము, కల్లికోట మొదలగు స్థలములలో దుకాణము లేర్పరచి చుట్టుప్రక్కల నుండు సాలీలనందరను అచ్చటికి జేర్చిరి. ఇండియాదేశపు కాలికోగుడ్డలకు ఇంగ్లండులో క్రమక్రమముగా ఆదరము హెచ్చుటచే ౧౬౮౭ వ సంవత్సరములో కంపెనీ డైరక్టర్లు ఇకమీద హిందూదేశపు కాలికోలనే విశేషముగా బంపుచుండవలసినదని యాదాస్తు బంపిరి. ఈవర్తక మీప్రకారముగా ఒకశతాబ్దమువరకును జరిగి తరువాత నెట్లు పర్యవసించినదియు మనము తెలిసికొనగలము. వర్తకమువలని ధనాశకు రాజ్యతృష్ణ తోడ్పడి కోట్లకొలది జనులకు జీవనాధారమైన నేతవృత్తిని ధ్వంసముచేసినది. జనులు వృత్తులు నశించి నిరు

పేదలై బాధపడజొచ్చిరి. శతాబ్దములనుంచి పారంపర్యముగా వచ్చిన వృత్తి ఊరకచావలేదు. ఘోరమైన పోరాటము జరిగినది. ఒకడక్కా-మస్లినుల మరణచరిత్రను పరికించినయెడల తక్కినవిషయమంతయు బోధపడగలదు.

డక్కా-మస్లినులు

బంగాళాదేశమునుండి వచ్చు మస్లినులకు "గాంగెటికము"లని గ్రీకులు పేరిడినట్లు మన మిదివరకు చదివియున్నాము. డక్కాలో నుత్పత్తియయిన చారల మస్లినులు పెరిప్లసులో, డయక్రోషియా యని పిలువబడెను. దీనికి గీరలగుడ్డలని అపలోనియసు అర్థము వ్రాసెను. రోమకరాజ్యము విస్తరించియున్న కాలములో రోమకులు హిందూదేశపు రంగుల మస్లినులనుధరింప వేడుకపడుచుండిరి. వీనిని ధరించినయెడల లోపలిశరీరము ప్రకాశించుచు బయటికి గనుపడుచుండెనని ప్లినీ వ్రాసియున్నాడు. అనేకమంది ప్రయాణికులు మస్లినుల పనితనమును మార్దవమును ప్రశంసించుచుండిరి. తొమ్మిదవశతాబ్దమున వచ్చిన నొకఅరబ్బీదేశీయుడు మస్లినులు హిందూదేశమున దక్క మరెచ్చటను దొరకవనియు, ఒకమనుష్యునకు సరిపోవు దుస్తంతయు ముద్దుటుంగరముగుండ దూరిపోవునంతటి సన్నపునూలుతో జేయబడుచున్నదనియు, దానిని దూదితోచేయగా తాను జూచితిననియు వ్రాసియున్నాడు.

ఇది ఢక్కా-మజ్లినులగూర్చి వ్రాసినదియేయని యూహింప వచ్చును. కొన్ని శతాబ్దములవరకును ఈవిద్య ఇటులే వృద్ధియగుచువచ్చినది. పైరార్డువచ్చి చూచినకాలములో నూలుగుడ్డలు కొన్నిధరించినప్పుడు శరీరముమీద గుడ్డ ఉన్నదా లేదా యనుశంక బొడమునంత సన్నముగా నున్నవట. రాల్ఫుఫిచ్చిగారు హిందూదేశములో నెల్ల సన్ననిగుడ్డ ఢక్కా-సమీపముననున్న సోనర్గోనులో చేయ బడుచున్నదని వ్రాసినాడు. ఇట్టి అద్భుతమయిన పనితనము జూపిన సాలీలకు ఢిల్లీచక్రవర్తుల ప్రాపు గలుగక పోలేదు. రాజపత్నియయిన నూర్జహాను ఆదరించుటచేత నీవృత్తి మిక్కిలి కీర్తిగాంచినది. చక్రవర్తులు తమ ఆస్థానములకు పరరాజ్యములనుండి వచ్చు రాయబారులకు సగౌరవముగ నిచ్చు మేలిబహుమతు లీమజ్లినులే. ఒకపారశీకరాయబారి తనరాజును సందర్శింపవచ్చి నిప్పుకోడిగుడ్డంత పరిమాణముగలిగి ముత్యములు తాపిన కొబ్బరిటెంకను కానుకగ సమర్పించెననియు, దానిని తెరచిచూడగా లోపల ౩౦ మూరలపొడవుగల తలగుడ్డ ఇమిడియుండెననియు సంతోషముతో నుప్పొంగుచు ట్రవెర్నియరు వర్ణించియున్నాడు. ప్రపంచములో నేసంతయందయినను మజ్లినులు మిక్కుటమయిన ధరలకమ్ముడుబోవుచుండెను. కంపెనీవర్తకు లిండియాకు వచ్చినప్పుడు

దీనిని కోరుచుండిరి. గతశతాబ్దములో నలుబదవపడివరకు మజ్లినులు విశేషముగ నెగుమతి యగుచునేయుండెను. ఢాక గానుండు అలికీగుడ్డలు దిగుమతి గాను ప్రారంభించినప్పటినుండియే మజ్లినుల ఉత్పత్తి క్రమముగ ఆగిపోయినది. ౧౮౩౬వ సంవత్సరములో 'డాక్టరు యూరి' అనునతడు ఇప్పటికిని ఢక్కాలో వడికి నేయబడుచున్న మజ్లినులతో తులదూగగల వానిని ఉత్పత్తిచేయుటకు ఐరోపియనుల బుద్ధిచతురత చాలదనియు, ఇంగ్లీషుయంత్రములపై తీయబడు అతిసన్నని నూలుకంటెను సన్నమగునూలు చేతితో రాటముల మీద నెట్లు వడుకబడునదియు, తరువాత యెట్టిపనిముట్లతో నీసన్ననూలు నేయబడునదియు, మనలో బుద్ధి సూక్ష్మతగలవారునహితము ఊహింప లేకున్నారనియు వ్రాసియున్నాడు. ౧౮౭౦వ సంవత్సరములో మజ్లినులచరిత్రను విపులీకరించి వ్రాసినడాక్టరు టెయిలరుగారు మజ్లినులు ముందుగా ఉత్తరువిచ్చిన యెడల చేయబడుననియు, ముఖ్యముగ శ్రీమంతులే వీనిని నేయించుకొందురనియు, ఇటీవల ఢిల్లీచక్రవర్తులు గతించినతరువాత వీనిఖర్చు కొంతతగ్గినను వృత్తినశించకుండ నిలువదగినంతమాత్రము యినను ఇప్పటికిని ఖర్చగుచునేయున్నదనియు వ్రాసియున్నాడు.

ఢక్కా నూలు

ఢక్కాసాలీలు యెట్టిదూది నుపయోగించినదియు, ఎట్టినూలు వడికినదియు, ఏపద్ధతులననుసరించి నూలువడికి గుడ్డనేసినదియు, నైనముగా విషయము లిప్పటికిని దొరకకు చున్నవి. వీరుపయోగించిన దూదియంతయు ఢక్కా మండలములోనే పండింపబడె ననుట నిశ్చయము. అది నాటుపత్తియే. అచ్చటి భూసారము ననుసరించి అదియొక ప్రత్యేకరకపుదూదియే. బంగాళములో నితరజిల్లాలలో బండినదానికంటె ఢక్కాదూది మిక్కిలినాజూకైన పొడుగయిన పింజలుగలిగినదైనను ఇప్పుడు అమెరికాలోను, దక్షిణద్వీపములలోను పండింపబడుచున్నదూదియే ఎక్కువపొడుగయిన పింజలను గలిగియున్నది. ఢక్కాసాలీలు ముఖ్యముగా గమనించుపరీక్షయొక్కటియే. చలువచేసి నప్పుడు నూలు ఉబికి గుడ్డచిక్కబడినయెడల మంచిరకమని వారియభిప్రాయము. ఢక్కాలో నుపయోగించు దూదిపండునట్టి ప్రతిమొక్కను పరీక్షించిన యొకపండితుడీక్రింది విషయముల గమనించియున్నాడు: (౧) కొమ్మలు సిలువుగాను,ఆకులుసన్నని కొనలుగలిగినవిగాను ఉన్నవి. (౨) చెట్టంతయు కొంచె మెఱ్ఱడాలుగలిగి, ఆకులయొక్క ఈనెలు, కాడలు మాసినరంగు గలిగియుండును. (3) పూవులయొక్క తొడిమెలు పొడవైన దళముల చుట్టు

యెఱ్ఱ గీరలుండును. (౨) పింజ పొడుగై సన్నముగను మెత్తగను ఉండును.* ఈ ప్రత్తిచెట్లు ఏటా పైరుబెట్టబడుచు ఐదడుగులవరకు పెరుగును. మస్లినువర్తకము బాగుగ సాగుచుండినపుడు ఈ ప్రత్తి విశేషముగ పండింపబడుచుండెను. ఈదూది పింజెలలో అనేకరకములుకూడ నున్నవి. డాక్టరు టెయిలరుగారు వ్రాయునప్పటికి రకము కొంత వరకు క్షీణించినది. ఆయన వ్రాసినరోజులలో పింజెలు మునుపటివలె మెత్తగను నునుపుగను సన్నగిలెను పూర్వముకంటె పొట్టివై గింజకు ఎక్కువ గట్టిగా కరుచుకొని యుండెను. పంటకూడ తగ్గినది. ఈ దూదిని వెదురు బద్దను చిన్నవిల్లువలె వంచి నరముతో గాని, పట్టుదారముతో గాని కట్టి దానితో ఏకులుజేసి నూలువడకుపద్ధతిని డాక్టరు టెయిలరుగారు వచనముగ నీక్రిందివిధమున వర్ణించియున్నారు: "నూలువడికేస్త్రీలు ప్రత్తిని చెదమేరి శుభ్రముచేసి (చర్కా, పుల్లంకాత్రి) ప్రత్తి రాటములతో పట్టి విత్తనములను దూదిని వేరుజేయుదురు. చర్కాయనగా రెండు గుండ్రనికఱ్ఱల నమర్చి చేతితో త్రిప్పబడునట్టి ప్రత్తిరాటము. కొంచెము ముదుగు

* ప్రస్తుతము గంజాములో నుపయోగింపబడు దూదియును ఆజిల్లాలో పండునదియే. పింజ విశేషము పొడుగయినది గాకున్నను పట్టువలె మెత్తగను, నునుపుగను ఉండును. జిల్లాలో విశేషవర్షముగల పర్వతసానువులమీద నిది పండింపబడుచున్నది.

నూలు దీయుదూదియంతయు నీరాటముచేతనే చేయబ డుచున్నది. పుల్లింకాతీ యనునది సన్ననినూలుదీయుట కొఱకు కొద్దిమొత్తము దూదినితీయుట కుపయోగిం చబడును. ఇది యొక చిన్నయినుపకడ్డీ. దానికి చివ రలు సన్నముగను, నడుమ లావుగను ఉండును. బల్లి కంటు కొంచెము మిగిలియుండు రెండుచివరలను రెండు చేతులతో బట్టుకొని నత్తి ఉంచినబల్లమీద నీకడ్డీని దొర్లింతురు.* యంత్రములో పట్టినదూదికి వెగినట్లు చేతి తోదీసిన ఈదూదిలో పింజలు నలిగి తెగిపోవు. విత్తులుతీ సినతరువాత దూదిని నరముగట్టిన వెదురువిల్లుతో ఏకి చెత్తరాల్చివేయుదురు. సన్నదారము చేయదలంచిన స్థలము ఏకకపూర్వము నలుసు లన్నియు ఏరివేయబడును. రెండంగుళముల వెడల్పును లోపలివైపునసన్నని పండ్లును గలిగి, యొకవిధమయిన చేపయొక్క దవడతో చేయబడి, చంద్రవంక వలె నుండు దువ్వెనతో దూది శుభ్రము చేయబడుచున్నది.† సన్ననిదూది పింజలుమాత్రమే యీదువ్వెనపండ్లసందున దూరగలవు. దూది శుభ్రము

* గంజాములో సన్ననూలుచేయు సాలీలు ఈసాధనమునే యుపయోగించుచున్నారు.

† ఆంధ్రదేశమునందును ఇట్టి సాధనమే ఉపయోగింపబడుచు న్నది. సన్ననూలు వడుకుటకు దేశమంతట నిట్టిసాధనమునే యుప యోగించియుందురు.

చేసినతరువాత వుండేలుదబ్బతో పింజలు విడదీసి మెత్తగా జేయుదురు. మెత్తగా ఏకినదూదిని సన్ననితోలుమీద పరిచి సన్ననియేకులు జేయుదురు. నూలువడుకునప్పుడీయేకు ఎడమచేతితో బట్టుకొందురు. వడుకుసామగ్రియంతయు నొకచిన్నబుట్టలోపెట్టుదురు. ఏకులు, సన్నని కదురు, దొర్లిపోకుండ బంకమట్టి కుడిటిలో నుంచబడు సొరకాయచిప్ప, వేళ్లకు కలరువచ్చుటకుగాను రాచుకొనుటకై బూడిద నిలువచేసిన చిన్నరాతితొట్టి— యివియే వడుకుసామానులు.కదురు లావుపాటిసూదికంటెమందము గానుండదు.* కదురుదూనాలు గంగుళముల పొడవు గలిగి బరువుగానుండి బాగుగా తిరుగుటకుగాను క్రిందినైపున చిన్నతడిరేగటిమట్టిఉండ గుచ్చబడును. వడుకువారు తక్లీని పటవాలుగ పెట్టుకొని క్రిందకొనను సొరకాయ చిప్పలోనుంచి బొటనవ్రేలు చూపుడువ్రేళ్లతో కదురుపట్టుకొని త్రిప్పుచు ఎడమచేతిలో పట్టుకొన్న ఏకులో నుంచి ఒంటిపింజలుగల సన్ననిదారమును కుడిచేతివ్రేళ్లతో లాగుచు పురియెక్కిన దారమును కదురుకు చుట్టుచుందురు." కొంతసేపు వడికినతరువాత కదురుమీదినూలును పంటెమీద జుట్టుదురు. గాలిలో తేమలేక వేడిగా నున్న

* ౬౧-వ నంబరుకంటె తక్కువగా నుండు ముతకనూలును రాటములమీద వడుకుదురని బెయిలరుగారు వ్రాయుచున్నారు.

యెడల పింజెలు ముడుచుకొని పొట్టివగుటచే సన్ననూలు రాదట. గాలిలో కొంచెము తేమగలిగి, ౮౦ డిగ్రీలకు మించని వేడి యున్నప్పుడే సన్నదారము వచ్చునని తెలియులకుగారు వ్రాయుచున్నారు. డక్కాలో నూలువడుకు వారిలో చాలామంది హిందూస్త్రీలే. ఉదయమున తెల్లవారినది మొదలు తొమ్మిదిగంటలవరకు, సాయంత్రము మూడునాలుగు గంటలు మొదలు గడియప్రొద్దువరకును డక్కాలో సన్ననూలు వడుకబడుచున్నది. డక్కాలో స్త్రీలందరును తమకు తీరికయినప్పుడెల్లను నూలువడకుచుండేవారు. సాధారణముగా ౧౮ మొదలు ౩౦ సంవత్సరముల లోపుగానున్న యౌవనస్త్రీలే బాగుగా వడుకగలరట.

ప్రతిదినమును ఉదయమంతయు వడికిన యెడల నెలపొడుగునను వడికినసన్ననూలు అరతులమునకు మించదట. అనగా గంటకు ౫౦ గజములు వడికినది. నూలుతులము రు.౮-౦-౦ చొప్పున వడుకుకూలి నెలకు రు. ౪-౦-౦ అగును. ఇట్లు సంవత్సరమునకు రు.౪౮-౦-౦ గిట్టును. సాధారణముగ ప్రతియొకరును సంవత్సరమునకు రు.౨౦-౦-౦ మొదలు రు.౪౦-౦-౦ వరకును సంపాదించుచుండిరి. ఈ ప్రకారముగ వడికిననూలుయొక్క సొగసునుగూర్చి చెప్పవలసినదేలేదనియు పరదేశములలో యంత్రములమీద

తీయబడు నూలు దీనిలో నెందుకును పోల్చతగదనియు నిర్ధారణచేయబడెను. ఢిల్లీలోని శ్రీమంతులకొరకు నేయబడిన మజ్లినులు ౧౨౦ హస్తములపొడవుగలవి, ఒకరతి తూగుచుండెనట. ౧౮౭౨-వసంవత్సరములో నొకఢక్కానేతగాడు డాక్టరు వెయిలరుగారియెదుట కొలువగా పౌను తూనికగల దూదినుండి౧౫౧ మైళ్లపొడవుగల సన్నదారము వచ్చినదట. అనగా ఈనూలు ౫౦౦ నంబరు దని యెంచవచ్చును. అంతకుపూర్వము వృత్తి క్షీణింపనిరోజులలో నూలు అంతకంటె ఎక్కువనంబరుదిగూడ తీయబడియుండవచ్చును. కొంచము పొట్టిపింజెలుగల ఢక్కాదూదినుండి యంత్రములమీద యింతసన్ననినూలు తీయుటకు వీలుండదు. యంత్రములమీద నేసినదానికంటె ఢక్కానూలు కొంచ మెక్కువతూగి ఎక్కువజిగివియు,బలమును గలిగియుండెను. ఫోర్బ్సువాట్సనుఅను నాతడు తన "హిందూదేశపునేతపరిశ్రమలు" అనుగ్రంథములో ఢక్కానూలును గూర్చి యిట్లభిప్రాయమిచ్చియున్నాడు: "మూడువిషయములు నిర్ధారణగా చెప్పవచ్చును. మొదటిది, యూరపులో యంత్రములమీద వడుకబడుసన్ననూలుకంటె ఢక్కానూలు మందము తక్కువ; రెండవది,ఢక్కానూలులో ఐరోపాలోచేయబడిన దారమునకంటె తక్కువపింజెలుగలవు; మూడవది, తక్కువపింజె లుండుటచేత

ఢక్కానూలు ఎక్కువసన్నగా నున్నది. పైసారాంశ ములుతీయుటకు ఆధారమయిన విషయముల నీక్రింద నుదహరించుచున్నాము.

| పేరు. | మందము (అంగుళములు) | అం. పొడుగులోనున్న పురులు. |
| --- | --- | --- |
| ఫ్రెంచిమజ్లిను (౧౮౬౭ సంవత్సరపు అంతర్జాతీయ ప్రదర్శనములో) | .౦౦౧౯ | ౬౮.౮ |
| ఇంగ్లీషుమజ్లిను (౧౮౫౧ సం॥లో - ౪౪౦నంబరు) | .౦౦[illegible]౮ | ౫౬.౬ |
| ఢక్కామజ్లిను (ఇండియన్ మ్యూజియము) | .౦౦౧౩౩౩౫ | ౧౧౦.౧ |
| ఢక్కామజ్లిను (౧౮౬౨ సంవత్సరపు అంతర్జాతీయ ప్రదర్శనములో) | .౦౦౧౫౬-౭౫ | ౮౦.౭ |

పైనుదాహరించినరీతిగా ఢక్కామజ్లిను నూలుకు ఎక్కువపురియుండుటచేతనే యంత్రములమీాద ఐరోపాలో చేయబడినదానికంటె ఇండియాలో చేతితోచేసినది ఎక్కువకాలము మనుటకు అవకాశముగలిగి మేలయినదని చెప్పుటకు కారణమయినది. ఐరోపాలోని మజ్లినులు చూచుటకేకాని ధరించుటకు నిరుపయోగములు.

ఇండియామస్లినులు ఉత్కృష్టములగుటచే బహుకాలము మన గలవని ప్రసిద్ధిని బొందినవి. నిజము చెప్పవలెనన్నయెడల ఈరోజువరకు యూరపులో నేయబడుచున్న సన్నని వస్త్రములేవియు ఢక్కాలోని "గాలిగుడ్డ"లకు బోల్పదగవు.

మస్లిను నేత

ఢక్కాలో నూలువడుకువారివలెనే నేతగాండ్రును కౌశల్యమునుజూపియున్నారు. నేతలో ౧౨౬ కంటె నెక్కువదోహదముల నుపయోగించిరి. పడుగుచేయుట, సరిచేయుట, నాన్చుట, చలువచేయుట మొదలగు పనులన్నియు వాట్సనుగారు వైనముగా వర్ణించియున్నారు. ఢక్కానేతగాండ్రందరు హిందువులు. బక్కపలుచని మెల్లెనంటి శరీరముగలిగి మిక్కిలి చురుకుదనముతోను, ఓర్పుతోను కష్టపడి పనిచేయగలవారు. అద్భుతమయిన స్పర్శజ్ఞానము గలిగియుండుటచేతను, ఏమాత్రపు బరువునయినను గమనింపగల శక్తిగలిగియుండుటచేతను వారనుకొన్న ఆకారమును, అనెయును, చిక్కదనమును గలిగియుండునట్లు నేయగలిగియుండిరి. సరిచేయుటకు వారు బియ్యపుపిండి నుపయోగించుచుండిరి. అచ్చుగట్టుటకు బియ్యపుపిండితో కొద్దిగ కరిదూపమును గలుపుదురు. వారుపనులన్నియు చెట్టునీడను, వర్షాకాలములోను విరివిగ సాగించుచుండెడివారు. ఆషాఢశ్రావణ భాద్రపదమాస

ములు వారిపనులకు మిక్కిలి అనుకూలముగ నుండెను. గాలిలో తేమయుండినయెడల దారము తెగకుండుటయే దీనికి కారణము. ఎండకాలములో నేయవలసివచ్చినప్పుడు వెడలుపైన పళ్లెములలో నీళ్లుబోసి పడుగుక్రిందబెట్టుచుండెడివారు. మల్లును తాను సాధారణముగా ఒకగజము వెడల్పును, ౨౦ గజములపొడుపును గలిగియుండెను. ఒక్కతాను నేయుటకు, రకమునుబట్టి, ౧౦ మొదలు ౩౦ రోజులువరకు పట్టుచుండెను. పక్కారకము ఒకఅరతానుసన్నగుడ్డను నూలువడకి నేయుటకు ౫,౬ నెలలు పట్టుచుండెను. మంచికమ్ములు గలిగిన చారలగుడ్డలును అమ్మకమునకు వెచ్చుచుండెడివారు. జందానిఅనురకపుమల్లును అన్నిటిలో నెక్కువ ఖరీదుగలిగినది. విచిత్రములయిన అనెలువేసి, మిక్కిలి చతురతతో అల్లి పనితనము గనపరచుచుండిరి. చెంకి పనిని దిగువతరగతుల మహమ్మదీయస్త్రీలును, చాకలివాండ్రును మిక్కిలి నిపుణతతో ఒక్కకుట్టయినను పయికి గనుపడకుండ చేయుచుండెడివారు. చినిగినమల్లినులకు మిక్కిలి జాగ్రతగా అతుకువేయుచుండిరి. తెగి చెడిపోయినదారములను లాగివేసి కొత్తదారములను గుడ్డపొడుగునను చొప్పించగలిగియుండిరి. ఇతరచోట్ల చెడకుండ ఎగుమతిచేయుటకై ఎదురుగొట్టములలో 20 గజములమల్లినుతానుల నిమిడ్చి పంపుచువచ్చిరి. పక్కామల్లు

మస్లినులను ఢిల్లీకి ఎగుమతి చేయునప్పుడు వెదురు గొట్టములకు బచ్చెనపూసి కళాయిజేసి పంపుచుండెడివారు. మస్లినులు రు.౧౦౦-౦-౦ మొదలు రు.౪౦౦-౦-౦ వరకు ఖరీదుపెట్టికొనుచుండిరి. మస్లినులు సన్నముగను, మృదువుగను, లలితముగను నుండుటచేత వానికి 'సాయంప్రాలేయము', 'వాయువస్త్రము', 'అబ్‌రవాణము' అను శృంగారపుపేర్లు పెట్టుచుండిరి. సాయంప్రాలేయము మంచు వర్ణముగలిగి సాలెపట్టువలె నుండుటచే 'షబ్న'మని పేరు వహించెను. ఇది మస్లినులలో మూడవరకమే. ఒకటి రెండురకములు మస్లినులకు 'మల్‌మల్‌ఖాస్' లేక 'మస్లిన్‌రాజ'మనియు, 'అబ్‌రవాన్' లేక 'ప్రవాహజల'మనియు రసికనామములు. ఒక హిందూనేతకాడు ఒకచక్కని మస్లినువస్త్రమును అజాగ్రత్తగ నేలపైనుంచుటచే నొక ఆవు గడ్డిపోచని భ్రమసి దానినిమేసినందున అంతటి చక్కని వస్త్రమును నిరుపయోగము జేసినందుకు నవాబు అలివర్ధిఖాను సాలెవానిని శిక్షించి ప్రవాసమంపెనని కథ చెప్పెదురు. ఔరంగజేబు తనకొమార్తెలు దిగంబరలై రాజస్థానమునకు వచ్చిరని భ్రమపడి వారిని మందలించగా వారు ఒకదానిపై నొకటి ఏడుమస్లినువస్త్రములు ధరించితిమని రుజువుచేసి కోపము చల్లార్చిరట. మొగలాయి ఆదరణక్రింద అత్యుచ్ఛదశకు వచ్చిన మస్లినువ్యాపారము

చౌకరకపు అలికీమజ్లినులు విదేశములనుండి నిరాటంకముగ మన దేశమునకు వచ్చుటచేతను, మనవి ఇంగ్లండునకు బోవునెడల వాటిపైన ౧౦౦-కి ౭౫ మొదలు ౮౦ వరకును సుంకములు విధించుటచేతను సంపూర్ణముగ నశించెను. ౧౫౦౩లో వర్తిమాయను బాటసారియు, ౧౫౯౮లో ఫిచ్చిఅను ఆయనయు, ౧౬౬౬లో టవెర్నియరు అనునతడును, అరేబియా, పరిషియా, ఈజిప్టు, పెగు, మలాకా, సుమత్రా దేశములతోను, మధ్యధరాసముద్రతీరప్రదేశములతోను విరివిగ మజ్లినువర్తకము సాగుచుండినట్లు సాక్ష్యమిచ్చియున్నారు. నవాబు అలివర్దిఖాను బంగాళమును పాలించుచుండగా ఒక్కొ-కపర్యాయము ప్రముఖుడైయిన నేతగాడు ౮౦౦ తానులు సహితము అమ్మకమునకు తెచ్చుచుండినట్లు ౧౭౭౨ సంవత్సరములో బోల్ట్సు అను ఆయన వ్రాసియున్నాడు.

౧౭౮౭-వ సం.ములో ఢక్కా-జిల్లాకు కలెక్టరుగా నున్న 'డే'(Day) అనుఆయన ఢక్కా-నుండి ఒకకోటిరూపాయిల విలువగలవస్త్రము ఎగుమతియగుచుండెననియు, వానిలో షుమారు 30 లేక ౪౦ లక్షలరూపాయిల సరుకులు ఐరోపాకు బోవుచుండెననియు మదింపుచేసినాడు. ఇంగ్లండులో మొట్టమొదట మజ్లినువస్త్రముల నేత ౧౭౮౫ సంవత్సరములో ప్రారంభింపబడినదికాని అవి ఇండియాకు

వచ్చునప్పటికి కొంతకాలము పట్టినది. అప్పటికే ఢక్కాయొక్క ఎగుమతివర్తకముయొక్క కంఠమునకు సుంకములనే ఉచ్చుబిగించుటచే అది ఉక్కిరిబిక్కిరియైనది. విదేశినూలు ఇండియాకు మొదటిసారి ౧౮౨౧లో వచ్చి ఢక్కాయొక్క నాటునూలును తుడిచిపెట్టినది. క్రమక్రమముగా ఢక్కావర్తకము క్షీణించినది. మనవస్త్రములు ఇంగ్లండుకు బోయినయెడల సుంకములు విధించుటయు, ఇంగ్లండునుంచి మనదేశమునకు దిగుమతియగు సరకులను ఊరక రానిచ్చుటయు మూలముగా అనాదినుంచి వచ్చిన వ్యాపారము సమూలముగ నశించినది. ౧౮౪౦వ సంవత్సరము వర్తకముపూర్తిగ నిలిపివేయబడినది. చచ్చిపోయిన వర్తకము మఱియెన్ని ప్రయత్నములు చేసినను పునర్జీవింప సాధ్యమయినదిగాదు. వర్తక మేవిధముగ నశించినదియు స్క్రిందిఅంకెలవలన తెలియగలదు.

| సంవత్సరము | ఎగుమతుల ఖరీదు |
|---|---|
| ౧౮౦౭ | రు. ౮, ౬౧,౮౧౦ - ౮ - ౫ |
| ౧౮౧౦ | ,, ౫, ౫౬,౯౯౬ - ౦ - ౦ |
| ౧౮౧౩ | ,, ౩, ౩౮,౧౧౪ - ౧౨ - ౮ |
| ౧౮౧౭_౧౮ | ,, ౧౫, ౭౪,౯౭౪ - ౧ - ౯ |
| ౧౮౨౧_౨౨ | ,, ౧౨, ౧౬,౨౫౨ - ౦ - ౫ |
| ౧౮౨౫_౨౬ | ,, ౬, ౨౯,౧౮౩ - ౪ - ౩ |
| ౧౮౨౯_౩౦ | ,, ౫, ౦౪,౮౧౨ - ౧౧ - ౦ |
| ౧౮౩౧_౩౨ | ,, ౩, ౬౨,౭౪౭ - ౫ - ౦ |
| ౧౮౩౪_౩౫ | ,, ౩, ౮౭,౧౨౨ - ౦ - ౦ |

౧౮౪౦వ సంవత్సరముతరువాత ఈవర్తకముపూర్తిగా నిలిచిపోయినది. మనదేశములోగూడ ఖర్చు తగ్గిపోయినది. ఎవరయిన ముందుగా ఉత్తరువిచ్చి నేయించుకొనిననే తప్ప వ్యాపారమునకై నేయుట మానివేసిరి. పూర్వము సాలీలు తమంతటనే మస్లీనులు నేసి నిలువజేసి లాభమునకు అమ్ముకొనుపద్ధతిమారిపోయి ౧౮౫౦ నుండి కావలసినవారు ముందుగా బయానా యిచ్చి నేయించుకొనిన యెడల నేయుట తటస్థించినది.

నాటుసరకులకును విలాతిసరకులకునుగల ఖరీదులో తేడా చాలా యెక్కువగనుండెను. ౧౦౦ నంబరుకులోబడి స్వదేశిగుడ్డలఖరీదు నాలుగయిదురెట్లెక్కువగానుండెను. ౧౮౪౦ లోనున్న ధరలతేడాలు ఈ క్రిందిపట్టిక వలన తెలియగలవు.

| నంబరు | తూనికె | | | 1½ లడ్డీ ఖరీదు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | ఇంగ్లీషు | | | ఇండియాను | | |
| | రు | అ | కాడీలు | రు | అ | కాడీలు | రు | అ | కాడీలు |
| ౨౦౦ | ౧ | ౦ | ౦ | ౦ | ౩ | ౦ | ౦ | ౧౩ | ౦ |
| ౧౯౦ | ౧ | ౦ | ౧౮ | ౦ | ౨ | ౧౫ | ౦ | ౧౧ | ౦ |
| ౧౮౦ | ౧ | ౧ | ౧౫ | ౦ | ౨ | ౧౫ | ౦ | ౬ | ౦ |
| ౧౭౦ | ౧ | ౨ | ౧౬ | ౦ | ౨ | ౧౦ | ౦ | ౫ | ౦ |
| ౧౬౦ | ౧ | ౪ | ౦ | ౦ | ౨ | ౧౦ | ౧ | ౪ | ౦ |
| ౧౫౦ | ౧ | ౨ | ౧౬ | ౦ | ౨ | ౧౦ | ౦ | ౩ | ౧౦ |

౧౮౩౦ సంవత్సరము తర్వాత 30-వ నెంబరు మొదలు ౨౦౦ నంబరువరకు ఢక్కా బజారులలో ఇంగ్లీషునూలుకుదప్ప నాటునూలుకుస్థానములేకుండెను. 30వ నంబరుకు తక్కువనంబరు నూలుమాత్రమే కొంతవరకు నాటునూలు అమ్ముడుపోవుచుండెను. ఈవిధముగా 30 సంవత్సరములలో ఢక్కాకు, ఇంగ్లండుకు జరుగుచున్న కొన్నిలక్షలవిలువగలవర్తకము నశించుటయేకాక దేశములోఖర్చుకుకూడ ఇంగ్లీషుసరకేవచ్చుటచేత నూలువడకడమే మానివేయబడి జనులు నిరుద్యోగులై దారిద్ర్యమునకు వశులైరి. కోట్లకొలది దేశీయులకు జీవనము గలిగించుచున్న ఖద్దరుపరిశ్రమ నశించి మన మొగుమతి చేయుచున్న దేశములకును మనకునుకూడ పరదేశీయులే గుడ్డలుపంపుట తటస్థించినది. పశ్చిమఖండపుచౌకమగ్గ్గములు దేశీయపరిశ్రమలను నశింపజేయుచుండగా వాటిని రక్షించుటకు ప్రయత్నమైనను జరుపబడలేదు. జనులు వ్యామోహములోబడి పుత్తడికిని, బంగారమునకును భేదము కనుగొనలేకపోవుటచే ఢక్కాయొక్క విభవము వీగిపోయినది. ౧౮౦౧ సంవత్సరములో ౨లక్షలున్న ఢక్కాయొక్కజనాభా౧౮౩౦సంవత్సరములో౮౦,౦౦౦కు తగ్గిపోయినది. సాలీలును, ఇతరులును వ్యవసాయము మొదల

యిన యితరవృత్తులలో ప్రవేశించిరి. ట్రెవెలియను అను ఆయనపార్లమెంటు ఎదుట నీదుఃఖకరమైన విషయము నుగూర్చి సాక్ష్యమిచ్చినప్పుడు అనుపమేయమైన యీపరిశ్రమను, ఢక్కా-మస్లినులకు సంబంధించిన విజ్ఞానమును, హృదయమార్దవమును పునర్జీవింపజేయుటకు సాధ్యము కాకపోయెను. అంతయు గతించినఅంధకారమున విస్మృతమై కాలప్రవాహములో అంతర్ధాన మయ్యెను.

---

# రాట్నము - మగ్గము

—————:*:—————

## ౧

### క్షీ ణ ద శ

ఆంగ్లేయులు ఇండియాకు రాకపూర్వమును, వచ్చిన తరువాతను, ౧౮ శతాబ్దమువరకు, ప్రపంచ మంతటికిని నూలు వస్త్రముల బంపుచున్న భారత దేశము విదేశీయుల దోపిడిచేత దేశీయుల ప్రధానజీవన సాధనమయిన వృత్తిని బోగొట్టుకొనుటయే కాక, తాను కూడ సంపూర్ణముగ విదేశవస్త్రముల నుపయోగించు దుస్థితికి వచ్చినది. ప్రపంచములో నెల్ల విదేశవస్త్రములను ఎక్కువగా దెప్పించుకొను దేశము మనదే. వస్త్రముల నెగుమతి చేయగలస్థితినుండి దిగుమతి చేసికొను దుస్థితికి ఎట్లు మారితిమో యిప్పుడు వివరింపబడుచున్నది. ఇండియాలో అత్యంతముగ నుత్పత్తియగుచున్న వస్త్రములను కొని విదేశములలో వ్యాపారము చేసికొనుటకై మొదట ఐరోపాజాతులు మన దేశమునకువచ్చియుండినవని

ముదివరకు చెప్పియుంటిమి. అప్పటికి యూరోపుగాని, యింగ్లండుగాని ఇండియాకు వస్త్రముల బంపగలస్థితిలో లేవు. తూర్పు ద్వీపములలో బంపు సువాసన సంభారములను, ఇండియాలో నుత్పత్తియగు వస్త్రములను తీసుకొని పోయి అమ్ముకొనినయెడల మిక్కిలి లాభము వచ్చుచుండుటచేత ఐరోపానుండి ఒకజాతి తరువాత మఱియొక జాతి—అనగా పోర్చుగీసులును,ఉలాందావారును,ఫరాసులును, చివరకు ఆంగ్లేయులును—బొబ్బటిల్లుచున్న వర్తక ప్రవాహములో కొట్టుకొనివచ్చిరి. వర్తకపుపోటీ అధికమై ఒకరికి లేకుండజేయవలయునని మఱియొకరు ఘోరమయిన యుద్ధములు చేసిరి. వానిలో నింగ్లాండు విజయమును గాంచి, తక్కిన ఐరోపీయుల నెల్ల ఇండియానుండి వెడలనడిచి వర్తకమునకు దోడు దేశపాలనమును గూడ సంపాదించుకొన గలిగినది. ఈవిజయచరిత్రమే తూర్పు ఇండియాకంపెనీ యొక్క చరిత్రము. ఎలిజబెత్తు రాణివలన సనదునుబొంది ౧౬౦౦ వ సంవత్సరములో నీకంపెనీ స్థాపింపబడెను. తరువాత చాలకాలమువరకు భరతఖండములో వీరికి స్థావరము గుదురలేదు. ౧౬౧౦ వ సంవత్సరములో బందరులోను, ౧౬౧౨లో సూరతులోను, ౧౬౩౯ లో మదరాసులోను, ౧౬౪౧ లో హుగ్లీలోను వర్తకశాల లేర్పరచబడెను. ఈకొట్లు స్థాపించిన

తరువాత ఇంగ్లీషువారు స్వయముగా మనదగ్గర గుడ్డలు కొని తీసుకొనిపోవుట ప్రారంభమయినది గాని తత్పూర్వము యూరోపులోని యితర దేశములవారు మన దేశము నుండి దిగుమతి చేసికొని అక్కడనుంచి యింగ్లాండునకు బంపుచుండిరి. మనగుడ్డలు ఇంగ్లీషువారికి బాగుగా నచ్చినందున విశేషముగ వీనినే యుపయోగించుటచే వ్యాపారము క్రమముగా వృద్ధియయ్యెను. ఇండియాలో వర్తకమునిమిత్తమయి అడితి లేర్పరచుకొను పద్ధతికి మొదట ఉలాందావారు దారిచూపి చోళమండలతీరమునను, సూరతులోను వర్తకశాలలుగట్టిరి. ఉలాందావారు ఇండియా నుండి బటేవియాకు తీసుకొనిపోయిన గుడ్డల బేళ్ల లెక్కలు విమర్శించిన యెడల వర్తక మెట్లభివృద్ధి యయినది తేటపడగలదు.

| సంవత్సరము. | చోళమండలము. | బంగాళము. | గుజరాతు. | మొత్తము. |
|---|---|---|---|---|
| ౧౬౨౫ | ౧౪౦౦ బేళ్లు | ... | ౮౧౦ | ౨౫౦౦ |
| ౧౬౮౧-౮౪ (సరాసరి) | ౨౫౦౦ | ... | ౧౦౦౦ | ౩౫౦౦ |
| ౧౬౫౪-౬౧ (సంవత్సరమునకు) | ౮౦౦౦ | ౫౦౦ | ౧౨౦౦ | ౫౪౦౦ |

సూరతునుండి జావాకు బోయినఓడలోని సరకుల పట్టీలో ౩౦ గుడ్డలపద్దు లున్నవి. ఫారస్టరుగారు రచిం

చిన 'ఇంగ్లీషు వర్తకశాలలు' అను గ్రంథసంపుటములలో ౧౫౦ రకముల గుడ్డలు ఎగుమతి చేయబడుచుండినట్లు కన్పట్టుచున్నది. దీనివలన మనదేశపు ఎన్నిరకములగుడ్డలు పరదేశీయులకు నచ్చినవో గ్రహింపనగును. మొదట ఆంగ్లేయులు ఇండియాకు బంగారునుపంపుట కిచ్చగింపలేదు. సర్ తామస్‌రోగారు ఇండియాదేశపు గుడ్డలు నచ్చలేదని వ్రాసినారుగాని ఈ అభిప్రాయము సరికాదని తరువాతి వర్తకపరిస్థితులనుబట్టి గ్రహింపనచ్చును. గుజరాతులోను, తూర్పుతీరమునను, బంగాళములోను వర్తకము బాగుగసాగినది. తూర్పుతీరమున విశేషముగ సరుకులు దొరకుచుండుటచేత ఉలాందావారివలెనే ఆంగ్లేయులును చాలకాలము తూర్పు తీరముననే వ్యాపారము సలుపుచుండిరి. సూరతునుండియు కాలికోల ఎగుమతి వృద్ధియగుచుండెను. అచ్చటినుండి౧౬౧౮లో ౧౨,౫౦౦ తానులును, ౧౬౨౫లో ౧౬౫,౦౦౦ తానులును ఎగుమతి యయ్యెను. ౧౬౧౭ లో ప్రయాణమైన 'రాయల్ ఆన్' అను ఓడ ౧౮౦౦౦ తానులను తీసికొనిపోయెను. మఱి ఆరు సంవత్సరములలో నీయెగుమతులు ఆరురెట్లు పెరిగెను. ౧౬౧౮ లో ౫౦౦ శౌరీల విలువగల నూలు మాత్ర మెగుమతి యయ్యెను. కాని క్రమముగ దీనికై అభిలాష మెక్కువగుటచే నేసినగుడ్డలు దొరకనియెడల

విడినూలుగాని, పడుగులుగాని యెగుమతి చేయవలసినదని కంపెనివారు తమ ఏజంట్లకుత్తరవులొసగిరి. ౧౬౨౮ వ సంవత్సరములో ౫౨౮ బేళ్లనూలు ఇంగ్లాండున కెగుమతి చేయబడెను. విశేషముగ నూలు ఇండియానుండి ఎగుమతి చేసినయెడల ఇంగ్లాండులో నిలువయుండునని భయపడ నవసరము లేదనియు, ఇదివరకు ఎగుమతిచేసిన దానికంటె నెంతయెక్కువ యెగుమతి చేసినను ఖర్చగునని యు డైరెక్టర్లు వ్రాసిరి. నూలు ఎగుమతి పెరిగిపోవుటచేత ధరలు ఎక్కువై సాలీలకు నష్టము గలుగుచున్నందున నూలు ఎగుమతి మాననిది గుడ్డ లమ్మమని సాలీలు కట్టుగట్టిరి. ౧౬౨౭-౯౦ సంవత్సరములలో సంవత్సరమునకు ౫౦,౦౦౦ తానులకు తక్కువలేకుండా ఎగుమతియగుచుండెను. వారు ఇండియాలో తాను ౧కి ౭ షిల్లింగుల వంతునకొని ఇంగ్లాండులో ౨౦ షిల్లింగుల కమ్ముచుండిరి. మంచిలాభములు వచ్చుచుండెను. ఇండియాతో వర్తకము విషయమై కొన్ని యాక్షేపణలు రాగా కంపెనివారు ఇదివరకు ఫ్రాన్సు మొదలయిన దేశములనుండి ౫ లక్షల శౌరీల విలువగల కేముకేరులు మొదలయినవి తెప్పించుకొనుచుంటిమనియు, ఇప్పు డది యంతయు నిలిచిపోయి తామే అంతవిలువగల వస్త్రములను ఆ దేశముల కెగుమతి చేయుచుంటిమనియు, ఇండి

యావర్తకము చాల లాభకారియనియు తీవ్రముగా వాదించిరి. తరువాత 3౦ సంవత్సరముల వరకును లాభకరముగనే యుండెను. ౧౭౫౦ వ సంవత్సరములో డైరక్టరులు ఇండియానుంచివచ్చు సరుకులన్నిటిలో కాలి కట్టుగుడ్డలు కాంక్షింపబడుచున్నవనియు నివేదించిరి.

ఇంగ్లండులో జనులరుచులు మారిపోయి ఇండియా గుడ్డలపై వ్యామోహ మెక్కువయ్యెను. జను లెడతెగక ఈ గుడ్డలనే కాంక్షించుచుండుటచే గుడ్డలయెగుమతి అమితముగా పెరిగిపోయెను. విశేషముగా లాభములు వచ్చుచుండుటచే కంపెనీవారే కాక ఇతరులును ప్రత్యేకముగా వర్తకముచేసి మిక్కిలి లాభములు పొందుచుండిరి. రెస్టొరేషనుకు పూర్వము లండనునుండి ఒక్క ఓడయయినను గంగాముఖద్వారమునకు ప్రయాణము కాలేదనియు, తరువాత యెనిమిది సంవత్సరములలో గంగాముఖద్వారము నుండి ఎగుమతి ౮౦౦౦ పౌనులనుండి 3 లక్షలకు పెరిగిపోయెననియు చరిత్రకారుడు వ్రాయుచున్నాడు. కంపెనికి లాభము లమితమయ్యెను. ౧౬౭౬ లో భాగస్వాములందరికి షేరుమొత్తములు బోనసుగా ఇచ్చుటకు తీర్మానించబడి యామొత్తములలో భాగము లినుమడించబడెను. తరువాతిసంవత్సరములలో రెట్టింపుషేర్లమీద ౧౦౦ కి ౨౦ వంతున లాభములు పంచిపెట్టబడెను. ఈ

లాభములు చూచి జనులు ధనాశాపీడితులై, క్రొత్తకంపెనీలు స్థాపించి, దండయాత్రలు బయలుదేరి, కంపెనీవారొక్కరికే అనుభవించుచున్న లాభము నపహరింపజూచిరి. అసహాసమువల్ల గలిగిన యీ పోరాటములచరిత్ర మనకిప్పు డవసరములేదు. చివరకు ౧౭ వ శతాబ్దమునాటికి ఈ పోరాటములన్నియు సమసి అన్నికంపెనీలకు రాజీ కుదిరి ఏకమై పూర్వపు తూర్పుఇండియా కంపెనీపేరుతోనే వర్తకముచేయుట కంగీకరించిరి. ఈరోజులలో హిందూదేశపు వస్త్రములమీద ఆంగ్లేయులకు వ్యామోహ మమితమయ్యెను. ౧౬౭౭ లో వేసిన లెక్కలప్రకారము సంవత్సరమునకు ౧౬౦,౦౦౦ పౌనుల ఖరీదుగల సరుకులు దిగుమతియయ్యెను. ౧౬౮౧ లో సంవత్సరమునకు 3 లక్షల పౌనులు ఖర్చుచేసి ఇండియానుంచి వచ్చు పరుపులు, అద్దకపుగుడ్డలు, దుప్పట్లు, తెరలు కొనుచున్నట్లుపార్లమెంటులో ప్రకటింపబడెను. ౧౬౭౩ మొదలు ౭౭ వరకుగల అయిదుసంవత్సరములలో దిగుమతి యయిన సరకుల మొత్తమును ౧౬౮౦ మొదలు ౧౬౮౪ వరకుగల ఐదుసంవత్సరములలోను దిగుమతియయిన సరకుల మొత్తముతో బోల్చిచూచినయెడల వర్తక మెంతవడిగా వృద్ధియయినదో తెలిసికొనగలము.

| సంవత్సరము | తానులు |
| --- | --- |
| ౧౮౭౩-౭౫ | ౩౯,౦౩,౫౦౦ |
| ౧౮౮౦-౮౩ | ౮౫,౬౪,౦౦౦ |

పై లెక్కలను బట్టి సగటున సంవత్సరమునకు ౨ లక్షల తాను లింగ్లండునకు దిగుమతి యగుచున్నట్లు తేలుచున్నది. తానుకు ౯ పెన్నీలు మొదలు ౨ షిల్లింగులవరకు సుంకమువేసినను ఇన్నిగుడ్డలు దిగుమతియగుట ఆశ్చర్యము. ఇంగ్లండులో వూలునేతగాండ్లకు జీవనము పడిపోవ ప్రారంభించెను. పరిస్థితులు దుర్భరమై మొఱ్ఱ లెక్కువయ్యెను. హిందూదేశపు పట్టువస్త్రములను ధరించకూడదని నిషేధపుచట్టము చేయుటకై పార్లమెంటులో పిటిషను దాఖలుచేయబడెను. హిందూదేశపు నూలు గుడ్డలమీదను, పీతాంబరములమీదను అత్యంతమయిన సుంకము వేయబడెను. ౧౮౮౫ వ సంవత్సరములో ఇండియానుంచివచ్చు నూలుగుడ్డలమీదను, పట్టుగుడ్డలమీదను, నారగుడ్డలమీదను ౧౦౦-కి పదివంతున సుంకములు విధించబడెను. అది చాలక ౧౮౯౦ లో పన్ను రెట్టింపు చేయబడెను. ఈపన్నులన్నియు భరించుకొనియు ఇంగ్లండులో ఇండియానుండివచ్చు నూలుపట్టువస్త్రములే సర్వసామాన్యముగ ధరింపబడుచుండెను. ౧౮౮౮-వ సంవత్స

రములో విప్లవము జరిగినతరువాత మేరీరాణి భర్తతో సహా ఇంగ్లండునకువచ్చి ఇండియాదేశపు అద్దకపుగుడ్డల మీద వ్యామోహమును పెంపొందింపజేయుటచే శ్రీమంతులందరును వానినే ధరించుచుండిరని లెక్కీలను చరిత్రకారుడు వ్రాయుచున్నాడు. యార్కుషైరు, విల్టుషైరు, నార్విచ్, స్పిటఫీల్డు జిల్లాలలోని వృలువర్తకులు గోలచేయుట కారంభించి గొప్పయాందోళనము గలిగించిరి. మెకాలే తనఆంగ్లేయచరిత్రములో ఈవర్తకులయాందోళనము నిట్లు సంక్షేపముగా జెప్పియున్నాడు: "పూర్వము వ్యవసాయముచేసి జీవించు మనగ్రామములలోను, పరిశ్రమలచే జీవించుపట్టణములలోను నివసించుజనులు మన గొఱ్ఱెమందల వులును దెచ్చి, మనవారలే వడికి, మనమగ్గములమీదనే నేసిన గౌనులు, చొక్కాలు, పరుపులే ఉపయోగించుచుండిరి. వారే ధన్యులు. ఆరోజులే సుఖావహములు. ఎలిజబెతురాణీకాలమునాటి రాజభవనముల కలంకారభూతములయిన ఆరాస్ శాలువ లిప్పు డేమయినవి? ఇంగ్లీషుఉన్నితో ఇంగ్లీషుచేతులు చేసిన వస్త్రములనే ధరించుచు విదేశవస్త్రముల ముట్టియెరుంగని శ్రీమంతుల సంతానమయ్యును మూర్షిదాబాదునుంచి వచ్చు విదేశ వస్త్రములను, స్టాకింగులను ధరించి త్రైతక్కలాడుటసిగ్గుల చేటుగాదా?" ౧౬౯౭ వ సంవత్సరమున 'ఉన్నవాస్తవ'

మను పేరుతో ప్రకటింపబడిన ఒకకరపత్రమునందు తూర్పు ఇండియాకంపెనీవల్ల విదేశపుమస్లినులును, కాలికోలును దిగుమతిచేయుటతప్ప మరేమియు లాభములేదని వ్రాయ బడియున్నది. మస్లినులగూర్చి నిరసనభావమును వెలి బుచ్చుకోపవాక్యము లందు పెక్కులుగలవు: 'ఫాషననునది Fashion) యొకరాకుసి. ఒకవస్తువు ప్రియమయినకొద్దీ ప్రియ మెక్కువవుతుంది. ముప్పది షిల్లింగులు పెట్టి ఒక గజము మస్లిను కొంటే చేతులలోపట్టుకొన్నట్లేవుండదు.' ఈకరపత్రము ప్రకటింపబడుటకు కొన్ని సంవత్సరములు ముందే పార్లమెంటువారు శవములమీద ఊలుగుడ్డలే కప్పవలసినదని చట్టముచేసిరి. జీవించియున్న శరీరముల విషయమునను ఇట్టిచట్టమేచేసిన బాగుండునని కొందరు తలంచుచుండిరి. ఈస్వదేశవర్తకుల ఆందోళనమును బల పరచుభారము డీఫో అను గ్రంథకర్తపాలబడినది. అతడు మిక్కిలి భాషావైచిత్ర్యమును గనపరచుచు వాదించి యున్నాడు: 'జనులు ఇండియాదేశపుగుడ్డల షోకులో బడి పోయినారు. దిండ్లకు, తివాసులకు పూర్వము ఉపయోగ పడుచుండునట్టియు, పిల్లలును, అలకాజనమును వాడు కొనుచుండునట్టియు,ఇండియాదేశపు ముతకచీటీగుడ్డలును, కలంకారి కాలికోలును మనలో గొప్పయింటిస్త్రీలు షోకనే భ్రమతో ధరించుకొనుచున్నారు. నౌకరులు తృణీక

రించే గుడ్డలు దొరసానులకు ధారణయోగ్య మయినవి. కాలు మట్టిగాకుండ నుండుటకై క్రింద పరచదగిన చీటీ గుడ్డలు ఇప్పుడు పైన వేసుకొనుచున్నారు. అధోభాగమున ధరింపదగినవి రవికలకుపయోగపడుచున్నవి. రాణీగారు సహితము చీనాజపానుదేశీయులవలె పట్టుకాలికోలు ధరింపగోరుచున్నారు. ఇంతేకాదు. ఇండియాగుడ్డలు మన రహస్యపుగదులలోను, పడకటిండ్లలోను ప్రవేశించినవి. దిండ్లకు, తెరలకు, కుర్చీలకు నవియే శరణ్యమయినవి. చివరకు మనపరుపులుగూడ వానితో కుట్టించుకొనుగతియే పట్టినది. ఇంతయేల? పూర్వము మనము ఊలుపెట్టి నేయించుకొను ప్రతివస్తువును, స్త్రీలదుస్తులును, గుడ్డసామానులును ఇండియాదేశపు కాలికోలుగ మారిపోయినవి. భారతదేశపుగుడ్డలవెల మనదేశపుగుడ్డల ఖరీదులో ఆరింటనయిదుపాళ్లుగా నుండుటచేత దూరమునుండి దిగుమతి చేయబడియు, అన్నిలాభములుపోను మనవాటికంటె చౌకగా అమ్మబడుచున్నవి.' చౌకధరలకు దొరికి ఎక్కువకాలము మనుచుండుటచేతనే హిందూదేశపు సరకులు మనబజారులను సులభముగ స్వాధీనపరచుకోగలిగినవి. కోల్చెస్టరుపట్టణములోని కూలీలందరు దొమ్మిచేసి ఇండియను దుస్తులను ధరించినస్త్రీలను ముట్టడించి అవమానపరచిరి. ఆందోళనము కొంచెము బలమయ్యిన

వెంటనే పార్లమెంటువారు జనులకష్టముల నివృత్తిచేయుటకు బూనుకొని, ౧౭౦౦ వ సంవత్సరమునకు తరువాత అనేకచట్టములుచేసి ఇండియావస్త్రముల నిషేధించిరి.

౧౭౦౦ వ సంవత్సరములో ఇండియానుంచి అద్దకపు కాలికోలు ఇంగ్లండుకు రాకూడదని యొకచట్టము చేయబడెను. అటుమీాదట అద్దకము వేయకుండా తెల్ల కాలికోలు దిగుమతిచేయబడి ఇంగ్లండులో రంగువేయబడుచుండెను. ౧౭౨౧ వ సంవత్సరములో తెల్లకాలికోలుగూడ దిగుమతి చేయగూడదని నిషేధించి, వాని నమ్మినవానికి ౨౦ పౌనుల జుల్మానాయు, కొన్నవానికి ౫ పౌనుల జుల్మానాయు విధించబడెను. తరువాత ౧౬ సంవత్సరములకు పూర్తిగా నూలుతో చేయబడిన వస్త్రములే ధరించకూడదని చట్టముచేసి, కొంత ఊలు కొంత నూలు కలిపినగుడ్డలుకూడ ధరింపగూడదని అదివర కములులో నున్న చట్టము రద్దుచేయబడెను. ఇన్నిచట్టములు చేసినను స్త్రీలయొక్క వికటబుద్ధిచేతను, షోకుమీాదగల వ్యామోహముచేతను కాలికోలు ధరించబడుచునేయుండెను. ౧౭౩౭-న సంవత్సరములో ఇంగ్లండులోనే నూలువడికి నేసినయెడల దూదితోచేయబడిన వస్త్రములు ధరింపవచ్చునని కొత్తచట్టము చేయబడెను. ఇంగ్లండులో నుపయోగించుటకు గాక ఇతరదేశముల

కెగుమతిచేయు నిమిత్తము ఇండియావస్త్రములు దిగుమతి చేయవచ్చునని మఱియొకశాసనము పుట్టినది. ఇంత పెద్ద అపరాధముల విధించు చట్టములయుద్దేశ మేదో మనము సులభముగ గ్రహించవచ్చును. ఇండియాలో వృత్తులు నశింపజేసినగాని ఇంగ్లండులో పరిశ్రమలు అభివృద్ధికావనే భావమే ముఖ్యకారణము. చట్టముల క్రిందికిరాని మజ్లినులు, తెల్లకాలికోలు మొదలగు వానిమీద అమిత మయిన సుంకములు విధించబడెను. వీనిని గూర్చి తరువాత విచారింతము.

సుంకములగూర్చి విచారించుటకు పూర్వము ౧౮ వ శతాబ్దములో ఇండియాలోని బ్రిటీషువారియొక్క పాలనాపద్ధతులును, వర్తకపద్ధతులును తెలిసికొనవలసియున్నది. శతాబ్దప్రారంభమున కాలికో వర్తకముయొక్క పరిస్థితులీక్రిందివిధముగ నున్నవి:—

| సంవత్సరము | దిగుమతిచేయబడిన కాలికోలు | |
|---|---|---|
| ౧౬౯౯ | ౮౬౩,౦౩౮ | తానులు |
| ౧౭౦౦ | ౯౫౧,౧౦౯ | తానులు |
| ౧౭౦౧ | ౮,౨౮,౧౦౧ | తానులు |

ఈవర్తకము ఇంగ్లండునకు చాలా లాభించినది. సంవత్సరములు గడచినకొలదియు అనవసరమయిన నిషే-

ధములు గావింపబడెను. నిషేధచట్టములు గావింపబడిన కాలములో, ననగా ౧౭౦౮-౧౭౮౮ మధ్య, ఈస్టిండియా కంపెనీవారు ౪,౪౨,౩౮౦ పౌనుల బంగారమును, ౯౨,౨౨౮ పౌనుల విలువగల వస్త్రములును ఎగుమతి చేసి ౭,౫౮,౦౪౨ పౌనుల ఖరీదుగల కాలికోలు పట్టు దిగుమతి చేయుచుండెను. కంపెనీవారు ఇండియాలో తమ సరుకు లెవ్వియు అమ్మజాలకపోయినను హిందూదేశపు వస్త్రములను ఇతరదేశములకు దీసికొనిపోయి అమ్ముకొనుచుండిరి. ౧౭౭౪-౧౭౯౨ సంవత్సరములమధ్య బంగాళము సూరతు మదరాసులనుండి దిగుమతి అయిన గుడ్డలవివరము తెలిసికొనదగినది. (చూడు పట్టిక)

ఆంగ్లేయవర్తకము మిక్కిలి వడిగా వృద్ధిపొందినది గాని వారి రాజ్యతృష్ణ అంతకంటె వడిగా పెరిగినది. ౧౭౪౫ వ సంవత్సరమువరకు విశేషముగ భూముల నాక్రమించుకొనలేదు. అప్పటికది కేవల వర్తకసంఘము గనే యున్నను రాజ్యతృష్ణగలసభ్యులు వర్తకయుద్ధము లలో దింపుటచేత ౧౭౯౦-వ సంవత్సరములో గవర్నరు షైల్డుగారి ఆధిపత్యమున వారి కదివరకున్న వర్తకపు హక్కులుగూడ పోవుటకు తయారైనవి. కంపెనీవర్తక శాలలలోని ఉద్యోగస్థుల పేర్లనుబట్టియే కంపెనీ మొదట మెందు కేర్పడినది తెలిసికొనవచ్చును. కంపెనీయొక్క

జ్యేష్ఠసభ్యుడును గవర్నరునగు ఘనతవహించిన యేజంటు గారికి సంవత్సరజీతము పౌ 300 మాత్రమే. ఆయనకు తరువాతి దర్జాగల ఉద్యోగస్థులు వ్రాయసకాడు, కొట్టు పెత్తనదారి, బేరగాడు అని పిలువబడిరి. కంపెనీసభ్యులందరకు పెద్దసెట్లని (సీనియరు వర్తకులు)యు తక్కినవారికి గుమాస్తాలనియు ఉమేజువారీలనియు పేర్లు. వీరందరు కంపెనీ సేవకులేయయినను ధనాశచేత స్వంతఖాతానకూడ వర్తకము జేయుచుసుంకములుతగులకుండుటకై కంపెనీపేరుతో సరకులను చాటవేయుచుండెడువారు. కంపెనీ తరఫున ఇంగ్లండులోను ఇండియాలోను పనిచేయుచుండెడు వారిలో గౌరవనీయులును పరశ్రేయోభిలాషులును, అరుదుగా నుండిరి. ఏదో ఒకవిధముగ ధనాకర్షణ చేయవలెననితప్ప మఱొకఉద్దేశము వారికి లేకుండెను.కలకత్తాలో కంపెనీయొక్క న్యాయాధికారిగ పనిచేసినచో బోల్టుసె గారు కంపెనీయొక్క పాలకుల నిట్లు తీవ్రముగ ఖండించి యున్నాడు. "ఇండియాలోను, ఇంగ్లండులోను కంపెనీ క్రింద పనిచేయువారందరిలోను పరోపకారవాంఛ లేదనియే స్పష్టముగా జెప్పవచ్చును. ఉద్యోగములుగాని ధనముగాని లాట్లుగొట్టుట దప్ప మఱియొక భావమే వారికి లేదు. దౌర్భాగ్యులయిన పాలితులను నష్టపరచి ఎందరు చుట్టాలకు ఉద్యోగముల సంపాదించుదము. లేక ఎన్ని

లక్షలు కూడ పెట్టుదము అనుయోచన దప్ప మఱియొక ఆలోచనయే లేకుండెను. రోమను సామ్రాజ్యముయొక్క అంత్యదినములలో దూరపు రాష్ట్రములు ధనాశాపీడి తుల కెట్లు చూరవిడువబడెనో అటులనే ఇండియాలో పాలనాధికారము వహించిన ఉద్యోగులు ప్రపంచమున నెక్కడను కనివినియుండని ఘోరదురంతములకు హిందు వులను లోనుజేసి సంపాదించిన ధనరాసులతో నింగ్లండుకు వచ్చి తమ ధనముయొక్కయు కంపెనీయొక్కయు పరపతి నుపయోగించి న్యాయమును వికలపరచి స్వదేశమునకును అమాయకులయిన పాలితజనులకును మహోపకారము గావించియున్నారు".

ఎక్కడజూచినను ప్రజాపీడయే; ఎక్కడబోయి నను దుష్పరిపాలనమే. కంపెనీయొక్క చిన్న నౌకరులు పెద్ద ఉద్యోగస్థుల యొక్కయు, పెద్ద ఉద్యోగస్థులు కం పెనీయొక్కయు అధికారబలమును స్వలాభమునకై యుప యోగించుకొనుచుండిరి. ఇండియాలోని పనివాండ్లు కం పెనివారి వస్తువులను తాము ప్రియముగా కొనుటకును తమ వస్తువులను వారికి చౌకగా అమ్ముటకును నిర్బంధిం పబడి అంగీకరించనివారికి కఠినమయిన అక్రమశిక్షలు విధింపబడుచుండెను. కంపెనీనౌకరులు చిన్న దగ్గరనుంచి పెద్ద వరకును నిరంకుశాధికారముతో దేశములోని

E 8 A



౧. ప్రత్తిని గింజలనుండి విడదీయుట
పట్టుసాలిపద్ధతి (మలియపట్టి)



౨. ప్రత్తిని విడదీసి చేపదవడతో శుభ్రము చేయుట

పట్టుసాలి పద్ధతి (మలియపట్టి)

సుంకపు చట్టములను భిన్నముగావించి అక్రమలాభమును పొందుచుండిరి. ఆకాలపు కంపెనీపాలనమును గూర్చి ప్రాయుచు మెకాలేయను సుప్రసిద్ధ ఆంగ్లచరిత్రకారు డిట్లు వ్రాసియున్నాడు. "ఆకాలమున కంపెనీ నౌకరుల పని యేమనగా దేశస్థుల చెవులను వడియవేసి ఒకటిరెండు లక్షల పౌనులను పోగుచేయుట; ఎండ వేడిమికి శరీరారోగ్యము చెడకముందే సీమకు వెళ్లిపోవుట; అక్కడకు బోయి కారణ్వాలు జిల్లాలో దివాలాదీసిన ఏ సంస్థానమునో కొని ఒకజమీందారు బిడ్డను వివాహమాడుట; జేమ్సు స్క్వేరుతోటలో విందులిచ్చుట" యై యున్నది. వారి భీతిలేని వ్యవహారము విజృంభించి సాగుచుండెను. లంచములు నజరానాలు సర్వసాధారణముగా బలవంతముగా తీసికొనబడుచుండెను. ౧౭౫౭ వ సంవత్సరములో మీర్జాఫరును నవాబుగా అంగీకరించినందుకు కంపెనీ ఉద్యోగస్థులును, సభ్యులును సహా కలిసి [illegible] పౌనులు తమకు బహుమానములుగనిర్ణయించుకొని అంత మొత్తమునకు నాణెములు నవాబుదగ్గర లేనందున. రెండు వంతులు నాణెములుగను తక్కిన. మూడవవంతు క్రింద నగలును, వెండిబంగారు సామానులును కట్టుకొనిరి. బంగాళములో జరిగిన యిట్టిచర్యలే కర్ణాటకమునందును జరిగినది. అమాయకుడైన ఆర్కాటునవాబు తలమీద

అక్రమమయిన బాకీలన్నియు కట్టబడినవి. పాల్ బెన్ఫీల్డు అను కంపెనీనౌకరు తంజావూరు మండలపు రాబడి యంతయు నవాబు తనకు ట్రాన్సుఫరుచేసినాడని తెచ్చిన దావా అందరికిని తెలిసినదే. ప్రజలను పీడించుట, హింసించుట సర్వసాధారణముగా సాగుచుండెను. ఇట్టి దుష్కాలములో నేత, నూలువడుకుట మొదలయిన వృత్తుల వారెట్టి యిక్కట్టులపాలయిరో మనమిప్పుడు విచారించెదము.

వర్తకమంతయు ఏకముగా స్వాధీనపరచుకొని పాలనముచేయుటవలన దేశమునకు ఘోరమయిన నష్టము వాటిల్లినది. కంపెనీవారియొక్కయు, వారి నౌకరులయొక్కయు వర్తకము వృద్ధియయినకొలదిని హిందూనేతగాండ్రయొక్కయు, వర్తకులయొక్కయు బాధ లెక్కువయ్యెను. వీరివర్తకమునకును, వీరు ఇంగ్లండులో మూలధనము నిలువజేసి అక్కడ వర్తకము సాగించుటకును, ఇండియాలో సరకులుకొని ఎగుమతి చేసి లాభమునకమ్ముకొనుటకును, వర్తకములో ఉద్యోగస్థులకు జీతమిచ్చుటకును, భాగములమీదలాభములుపంచియిచ్చుటకును, వర్తకమునిమిత్తమును, వర్తకమును రాజ్యమును విస్తరింపజేయుటకు చేసినయుద్ధములనిమిత్తమును, చేయబడిన బాకీలన్నిటికివడ్డీయిచ్చుటకును ఇండియాదేశపు పన్నులనుండివచ్చుధనమే ఉప

యోగించబడుచుండెను. కొన్ని రకములు కాలికోగుడ్డలు ఇంగ్లండుకు ఎగుమతిచేయగూడదని నిషేధమున్నను మస్లినులు, రంగువేయనిచేతిగుడ్డలు, బంగాళా దేశపు వస్త్రములు విరివిగ ఎగుమతి యగుచునే యుండెను. ఇంగ్లండుయొక్క ఉపయోగమునకు గాకపోయినను అక్కడనుండి ఇతరదేశముల కెగుమతిచేసికొనుటకు కాలికోలను కంపెనీవారు ఎగుమతి చేయుచునే యుండిరి. ఈవర్తకమంతయు కంపెనీవారు తమచేతియందేయుంచుకొనిరి. వర్తకమంతయు ఒకరే గుత్తకుతీసికొనుటవలని నష్టములు ప్రత్యేకముగ విచారించ నవసరములేదు. [illegible] వ సం॥ములో కంపెనీనౌకరులు సర్వసాధారణముగా అవలంబించుచువచ్చిన మార్గములు [illegible]లో రిచ్చర్డ్సు అనుఆయన విశదముగవర్ణించి యున్నారు. "సూరతుమండలములో వర్తకము నిర్బంధముపయోగించి సాగించబడెను. సాలెలు తమకు నష్టమయినను కంపెనీవారి కమ్మవలెను. అట్లు అమ్ముట కంగీకరించనియెడల దానికిబదులు కంపెనీవారికి జుల్మానాగా కొంత మొత్తము నియ్యవచ్చును. దేశములోని డచ్చి, ఫ్రెంచి, పోర్చుగీసు, అరబ్బీవర్తకులు తక్కువరకపు వస్తువులకుగూడ ఎక్కువధరలనుపెట్టుటకు సిద్ధముగ నున్నను, మొదటిరకపు వస్తువులకు సహితము అంతకంటె తక్కువ ధరలిచ్చినను సరుకులను కంపెనీవారికే అమ్మవలెను.

అందువల్ల ఇతరదేశపు వర్తకులకును కంపెనీవారికిని పలుమారు తగాదాలు కలుగుచుండెను. నేతగాండ్రు రహస్యముగా ఇతరదేశపు వర్తకుల కమ్మినయెడల అట్టివనులు మఱియెన్నడును చేయకుండునట్లు వారలకఠినముగ శిక్షింపబడుచుండిరి. కంపెనీవారి వర్తకపు ఏజంటు తాను ఇతరదేశీయులు వర్తకమును అంతమొందించి కంపెనీవర్తకమును స్థిరపరచుటకు నియమింపబడితినని స్పష్టముగ జెప్పుచుండెను. ఈయుద్దేశము నెరవేరుటకై కావింపబడిననిర్బంధములు, విధింపబడిన శిక్షలు దుస్సహమగుటచే సాలీలనేకులువృత్తినివిడిచిపెట్టి పారిపోవుచుండిరి. వారు పారిపోకుండ జేయుటకుగాను ఆకంపెనీ అధికారినుండి లైసెన్సులేనిది సాలీలు పట్టణము విడిచి వెళ్లకూడదని చట్టములు గావింపబడెను. నవాబు జనులను పాలించుచున్నంతకాలము కంపెనీవారు తమచేతులలోనున్న నవాబుకు దరఖాస్తు పెట్టి సాలీలు తిరుగబాటు చేసినందుకు శిక్షింపజేయుచుండిరి. ఈశిక్షలు జనులకు ఘోరముగా గన్పడునని తోచి నప్పుడు కంపెనీనౌకరులపై ద్వేషము గలుగకుండులాగున ఈశిక్షలన్నియు నవాబుగారే స్వయముగా జేయుచుండిరనియు. కంపెనీవారికి సంబంధము లేదనియు ఆయనచే జెప్పించుచుండెడివారు. సాలీలితరదేశపు వర్తకుల కమ్మకుండులాగున వారిచేత ఒడంబడికలు వ్రాయించు

కొనుచుండెడివారు. సమీపములనుండు సామం
తరాజులందరిచేత తమ దేశములోనుండు సాలీలందరను
కంపెనీవర్తకులు (Preference) వస్తువులు కొనే సమయం
యితరుల కమ్మకూడదనియు, గుడ్డల శాల్తీలు యితరుల
కమ్మకూడదనియు ఉత్తరువుల జేయించుచుండువారు.
సూరతు మండలము నవాబు స్వాధీనము తప్పి కంపెనీపర
మయిన తరువాత కంపెనీవారియొక్క అదాలతు కోర్టుల
నుపయోగించి శిక్షల విధించుచుండెడివారు." కంపెనీ
వారి యితర రాష్ట్రములలోనూ ఈవిధముగనే పరిపాలన
జరుగుచూవచ్చినది. ఇందుమూలమున అన్ని రాష్ట్రముల
కంటె బంగాళ మెక్కువ బాధపడినది. నిర్బంధపద్ధతి
ఫలమును ప్రతిసాలెవాడును అనుభవించెనని బోల్ట్సుగా
రు వ్రాయుచున్నారు. క్రయవిక్రయములలో నవలంబింప
బడిన వర్తకసూత్రములు దుర్మార్గమున కెడమిచ్చినవి.
కంపెనివారి తరఫున ఏజంట్లుగా నియమింపబడిన బని
యాలు వారిగుమాస్తాలతోసహా వస్త్రముల గొనుటకు
ను, ఇతర వ్యాపారములు చేయుటకును గ్రామములలోనికి
వెళ్లినప్పుడు ఆయారాష్ట్రముల గవర్నర్లు తమయిలాకా
జమీందారులకు ఏజంట్లకు సహాయము చేయవలసినదని
ఫర్మానాలు పంపుచుండెడివారు. ఫర్మానాలు తీసుకొని
గుమాస్తాలు గ్రామములకు బోయి కచేరీ చేసి తమజవా

నుల బంపి దళారులను, వర్తకులను, పాయకారులను నేత గాండ్రను కచేరీలకు తెప్పించి అడసర కివ్వవలసిన బాకీలుం చెయిచ్చివేసి వారిచేత ఇన్ని గుడ్డలను, ఈధరకు, ఫలానా తేదినాటికి కిస్తామని ఒడంబడికలు వ్రాయించుకొని సంతకములు పెట్టించి కొంత పైకము బయానాగా యిస్తుండేవారు. సాలె లెవ్వరును బుద్ధిపూర్వకముగ బేరము లిచ్చుట లేదు. గుమాస్తాలు కోరినవాని కన్నిటికిని సాలీలు సంతకములు పెట్టవలసివచ్చెను. సాలీలపేర్లయొక్క జాబితాను గుమాస్తాలు తయారుచేసి యుంచుకొని యితరుల కెవ్వరికిని పని చేయనీయక పాతగుమాస్తాలు కొత్తగుమాస్తాలకు వాని సొంతముగ ఒప్పజెప్పి పోవుచుండిరి. సరుకుల గిడ్డంగులలో జరుగు దుర్మార్గమున కంతము లేదు. సాలీలను మోసము చేయుటయే ప్రధానమయినపని. సాలీలు నిర్బంధములే కుండ బజారులలో అమ్ముకొనేయెడల వచ్చుధరలకంటె సాధారణముగ ౧౦౦ కి ౧౫వంతునను, కొన్నిసార్లు ౧౦౦ కి 40 వరకును తగ్గించి విలువ యియ్యబడుచుండెను. ఈ విధముగా కంపెనీవారికే సరుకు లియ్యవలసియుండుట చేత సాలీలకు మితిలేనినష్టము గలుగుచుండెను. బంగాళములో నుపయోగింపబడిన పద్ధతులే దక్షిణహిందూ స్థానమునను అవలంబింపబడెను. మదరాసు గవర్నమెంటువారి రికార్డులనుంచి ఒకభాగమును ఎత్తిచూపెదను.

దానివలన కంపెనీవారి రవంబంచిన వక్రగతులన్నియు తేటతెల్లము కాగలవు. ఆర్కాటు నవాబుగారితో రాయ బారములు జరిపి ఒత్తిడి కలిగించినపిదప ఆయన ఈ క్రింది ఫర్మానాను 1763 సంవత్సరములో పంపవలసివచ్చినది. "మంద్రాసు గవర్నరుగారు మీప్రాంతములకు వస్త్రము కొనుటకు వచ్చు సందర్భమున యీఫర్మానా మూలముగా నాయొక్క అభిప్రాయమును మీకు వెల్లడించుచున్నా ను. మాప్రాంతము నుండువర్తకులందరకు గవర్నరు గారికిని, వారి యేజంట్లకుమాత్రమే మంచిసరకులు విక్ర యించవలసినదనియు, ఇప్పుడు హాజరులో నున్న సరకం తయు వెంటనే వారికి స్వాధీనపరచవలసినదనియు వారు తమకు వలదన్న సరకులుమాత్రమే యితరులు కమ్ముకో నియ్యవలసినదనియు, వారికితప్ప మరెవ్వరికిని మనవర్త కులు సరకు లమ్మకుండునట్లు జాగ్రత్తచేయవలెనని యు ఖండితమయిన ఉత్తరువులు పంపవలసినది. మీ యిలాకా వర్తకులందరును తమరిచ్చు ఒడంబడికను తప్పక నిర్వహిం చునిమిత్తము వారివల్ల అపరాధపు జామీనులు పుచ్చు కొనవలసినది. ఇది మాయొక్క ఖండితమయిన ఉత్త రువు." కంపెనీవారీవిధముగా దేశమును దోచుకొనుటకు నవాబుగారు తోడ్పడుచు పలుమారిట్టి ఫర్మానాలనే పం పుచుండిరి.

మదరాసుప్రాంతమున కొంతరాజ్యము సంపాదించినతరువాత సహితము మామూలు నిరంకుశపద్ధతులే అవలంబింపబడినవి. కొంతకాల మయినతరువాత ఇండియాలో ఉన్నతోద్యోగము వహించిన వెల్లస్లీ ప్రభువు ౧౯-౭-౧౮౦౪ తేదిన మదరాసు గవర్నమెంటువారికి వ్రాసిన సుప్రసిద్ధలేఖలో కంపెనీవారు తమవర్తకమును విస్తరింపజేసికొనుటకును, అచ్చట వర్తకము చేసికొనుటకు న్యాయమైన హక్కుగల స్వదేశవర్తకుల క్షేమమునకు ప్రతిబంధకముల గలిగించుటకును మిక్కిలి నిరంకుశమార్గము లవలంబింపబడినవని వ్రాసియున్నాడు. తమ యిచ్ఛ వచ్చినట్లు ధరలను, వాయిదాలను నిర్ణయించు చుండెడువారు. బలవంతముగా వస్త్రములు దీసికొని పైకిమ్మని యడిగినప్పుడు సాలీలు ఖరీదును తీసికొననియెడల వారిని కట్టివేసి కొరడాదెబ్బలు కొట్టి పంపిరని తెలియుచున్నది. తగిన ధర లియ్యకపోగా ఇచ్చినమటుకే తీసికొనవలసినదనిబలాత్కారం తపెట్టుచుండెడివారు. ౧౭౭౧వ సంవత్సరమున దేశమును వినాశమొనర్చిన మహాక్షామకాలములోగూడ కంపెనీవారు తమదురంతముల మానలేదు. తరువాత రెండు సంవత్సరములకు ప్రజల స్థితిగతుల గూర్చివారన్ హేస్టింగ్సు దేశములో కంపెనీవారు పీడించుచున్నారని జనులు మొరపెట్టుచున్నారనియు, దృఢమయిన సాక్ష్యమే యియ్యబడి

నది గాని నేరములు స్థాపించుటకు తగినంత సాక్ష్యము లేదనియు, కారణములు చెప్పకుండానే ఏ యుద్యోగినయి నను బదలాయించుటకు గవర్నరుకు అధికారమియ్యవల సినదనియు వ్రాసియున్నాడు. కంపెనీవారి రాష్ట్రము లన్నిటియందు లంచములును, బలవంతముగా ధన మాక ర్షించుటయు సర్వసాధారణము లయినవి. ఈ దోపిడిని బలపరచుటకోయన సాలీల నిట్టిఅక్రమచర్యలకు లోబర చుట న్యాయవిరుద్ధముకాదని చట్టములు గావింపబడినవి. కంపెనీదగ్గరనుండి బయానాతీసికొన్న సాలీ లెవ్వరును ఇతర తెల్ల వర్తకులకుగాని, నల్ల వర్తకులకుగాని సరకులమ్మ గూడదనియు వాయిదానాటికి వస్త్రముల నీయనియెడల స్థానికాధికారి వానిపైన బంట్రౌతుల నియమించి వేగ ముగ వసూలుచేసికొనవచ్చుననియు నిబంధన లేర్పరచ బడినవి. ఒకజవానును దస్తకు మేర్పాటు చేసినయెడల సాలెవాడు రోజుకు ౧ అణావంతున వానికి ఖర్చుల కిచ్చు కొనవలయును. ఈవిధముగా సాలీలు ఏడతెగని దాస్య ములో నుండిరి. ఇతరులకు సాలీలు వస్త్రము లమ్మిన యెడల అదాలతుకోర్టులో నతనిమీద కేసుపెట్టవచ్చును. రెండుమూడుమగ్గములు గలిగి నౌకరులచే నేయించుసాలె వానికి ఒడంబడికలోని వాయిదాగుజస్తు అయిన ప్రతి శాల్తీమీదను మూడవవంతు ఖరీదు మొత్తము వరకు

జుల్మానా విధించవచ్చును. సాలీలు కంపెనీవారితో ఒడంబడి కెలు చేసికొనకుండుటకును వీలుగాదు. వర్తకోద్యోగులు సాలీలతో వ్యాపారము చేయుటకు ఏవిధమయిన ప్రతిబంధకములు కలిగించగూడదని జమీందారుల కుత్తరువు లీయబడినవి. దేశీయపరిశ్రమల కంఠములనులిపివానిని విదేశశక్తులస్వాధీనపరచుటకేయీనిబంధనలన్నియు గావింపబడినవి. సాలీలబాధలన్నియు గుర్తెరిగిన తామసుమన్రోగారు ౧౮౧౩వసంవత్సరములో పార్లమెంటుఎదుట సాక్ష్యమిచ్చుచు "కంపెనీవారి నౌకరులు సాలీలనందరిని గుంపుచేయించి 'వస్త్రములను కంపెనీవారికమ్ముదు'మని ఒడంబడికలు వ్రాసియిచ్చువరకును జవానులు స్వాధీనమందుంచు మామూలే" యనిచెప్పియున్నాడు. ఈవిధముగ సాలీలు బానిసలైపోయిరి. ఒకపర్యాయము ఈసాలీలను దచ్చివారును, ఇంగ్లీషువారును పంచుకొనవలసినదని సూచింపబడెను; గాని డైరక్టర్లు ఈ యమానుషకృత్యమున కంగీకరించ లేదు. నమ్మదగిన సాక్ష్యమునుబట్టి బహుకాలము సాలీలు తరుచుగా జుల్మానాలు విధించబడి కొరడాదెబ్బలకు లోపరుపబడిరని తెలియుచున్నది. అప్పుడప్పుడు బందిఖానా చేయబడియు, అరదండాలతో వీధులలో నూరేగింపుచేయబడియు నవమానపరచబడుచుండిరట. ఇతరులకు సరకులమ్మినందుకును, వాయిదా లివ్వనందుకును

[illegible] జుల్మానాలు విధింపబడి అపరాధముక్రింద [illegible] చెంబుబొక్కెలు ఏలము వేయబడుచుండినవట. బోల్ట్సు అను ఆయన ఘోష పెట్టుచు కంపెనీవర్తకులును, గుమాస్తాలును అంతులేని నిరంకుశచర్య లవలంబించి జనులను బాధించి ఒడంబడికెలు వ్రాయించుకొని అపరాధములు విధించి ఖయిదులో వేయించి కొరడా దెబ్బలు కొట్టించుచుండిరనియు, అందువలన సాలీలసంఖ్య తగ్గిపోయినదనియు వ్రాసియున్నాడు.

సాలీలస్థితి యిటులుండగా దేశీయవర్తకుల పరిస్థితు లింతకంటె మెరుగుగా లేవు. ఐరోపానుండి గుడ్డలు దిగుమతిచేసి అవి దేశములో నమ్ముడు పోకపోయినను కంపెనీవారు నిర్ణయించిన ధరలకు వారు కొని అంగడులలో వ్యాపారం జేయవలసినదని వర్తకులను నిర్బంధించుచుండిరి. వీలరు అను ఆయన "పూర్వపుమదరాసు" అను గ్రంథములో ఎట్లు కంపెనీవారు దేశీయవర్తకులను పిలిపించి జుల్మానాలు విధింపబడునని బెదరించి నిర్వహింప సాధ్యముగాని ఒడంబడికలమీద వారిచే సంతకముల బెట్టించుచుండెడివారో వివరించియున్నారు.*" కంపెనీవారి లాభ

* బంగాళా దేశపు నవాబు [illegible] వ్రాసిన [illegible] కంపెనీవారి ఏజంట్లు వర్తకులవద్ద [illegible] [illegible] రు. ౧ విలువగల [illegible] రు. 5 లు వారిచే [illegible] కొనుచున్నారు.

ముల పెంపొందించుకొనుటకయి వివిధములయిన నిర్బం
ధచర్యలు ఉపయోగించబడుచుండెడివి.

పైన వివరింపబడినవానివలన కంపెనీవారు విదేశ
వర్తకమును, స్వదేశవర్తకమును స్వాధీనపరచుకొనుటకై
యెట్టిమార్గము లవలంబింపబడినవో దిక్ప్రదర్శన మాత్ర
ముగ చూపింపబడినవి. వాటినిమరల నీవిధమున క్లుప్తీక
రించుచున్నాను:

౧. దేశీయవర్తకులు కంపెనీవారివలన లైసెన్సు
పొందనిది వస్త్రముల కొనుటకు గాని, అమ్ముటకు గాని
గుమాస్తాలను పంపగూడదని నిషేధింపబడిరి; కాని కంపెనీ
వారిగుమాస్తాలు మాత్రము విచ్చలవిడిగా దేశముమీాద
పరవంజి మితిలేని దురంతముల గావించుట కధికారము
గలిగియుండిరి.

౨. కంపెనీగుమాస్తాలు వ్రాయించి తెచ్చిన ఒడంబ
డికలవల్ల సాలీలు తమవస్త్రముల నితరుల కమ్ముకొనుట
కవకాశములేక కంపెనీవారు నిర్ణయించినధరలకు వారికే
విక్రయించవలసివచ్చినది.

3. జుల్మానాలు, కొరడాదెబ్బలు, ఇతర నిర్బంధ
ములు సాలీలపరమయినవి.

౪. వర్తకులనుండియు, సాలీల నుండియు వస్త్రములు బలవంతముగా ఎత్తుకొనిపోవుట కధికారముగలదు.

౫. దేశీయవర్తకులు దేశములో లావాదేవీలు సలుపుకొనినయెడల అమితములయిన సుంకములు విధింపబడినవి.

పై కారణములవల్ల దేశీయపరిశ్రమల యభివృద్ధికి ప్రతిబంధకములుగలిగి స్వల్పవేతనములకు సాలీలుకంపెనీ వారికిగుడ్డలు నేసియియ్యవలసి వచ్చినది. అందుచేత పలువురు సాలీలు నేతవలన జీవనము సాగక దానినివిడిచి యితర వృత్తుల నవలంబించి యల్లాడవలసియున్నది. దీనికి తార్కాణముగా బోల్ట్సుగారి సాక్ష్యము నిందుపొందుపరచెదము. "జంగులు కరిప్రాంతములనుండు పల్లాల సాలీలందరును ౭౦౦ కుటుంబములవారు ఈబాధలు పడజాలక వృత్తిని, దేశమును త్యజించి పారిపోయిరట. నాగోపుల యను పట్టుసాలీలు కంపెనీవారు నేతనేయుమని తమను నిర్బంధించకుండుటకుగాను తమ బొటనవ్రేళ్లను తెగగొట్టుకొనిరని ఆయనయే వ్రాయుచున్నాడు. బంగాళములో కంపెనీవారివర్తకము విరివిగను, మిక్కిలి లాభకరముగను నున్నందున అచ్చటి దురంతము లతిఘోరములయ్యెను. బంగాళాగవర్నరుగ నున్న హారి వెరిలెస్టు అనునాయన ౧౭-౩-౧౭౬౭ వ తేదిన వ్రాసిన ఉత్తరములో

ఎన్నడు లేనిది సాలీలంత ధ్యానమయినారనియు, ఇది ఇటీవల దేశమునకు వాటిల్లిన ముప్పులవల్ల వాటిల్లినదియో, లేక దేశమొత్తమున వర్తకము సర్వసామాన్యముగా క్షీణించుటవలన గలిగినదియో, చెప్ప వీలులేదనియు, కాని నేత పరిశ్రమల నవలంబించుచువచ్చిన పలువురు తమవృత్తిని బరిత్యజించి యెక్కువ నిలుకడగల యితరవృత్తులలో ప్రవేశించినది నిశ్చయమనియు వ్రాసియున్నాడు. నిర్బంధ మధికమయి వర్తకము నశించెను. జనులు భయభ్రాంతు లగుటచే పరిశ్రమలు చిందరవందరయైనవి.

అయినను దేశములో నింకను నూలువడుకుటయు, వస్త్రములు నేయుటయు ప్రధాన జీవనాధారములుగ నుండెను. ఇతరభాగములలో నది నశింపక యథాప్రకారముగ పెంపొందుచుండెను. ఆరము అను నాయన ౧౭౮౭-వ సంవత్సరములో నిట్లు వ్రాసి యున్నాడు: తూర్పుతీరమునను, బంగాళములోను, పట్టణములకును రోడ్లకును దూరముగా నున్న గ్రామములలో పురుషులును, స్త్రీలును, బిడ్డలును వస్త్రపరిశ్రమ చేయని వారు లేరనియు, ప్రస్తుతము ఉత్తరసర్కారులలో నిదియే ప్రధానవృత్తియనియు, ఒకొకరకముగుడ్డ ఒకొక జిల్లాలో వందలకొలది సంవత్సరములనుండి వంశ పారంపర్యముగా నేయబడుచుండుటచేత మిక్కిలి నాణెముగ

తయారుచేయబడుచున్నదనియు వ్రాయుచున్నాడు. చేత పరిశ్రమ హిందూస్థానములోని సగముమందికి జీవనాధారమును గల్పించుచుండెనదట. వడకుటయును నేయుటయును మిక్కిలి తేలికపనులు. ఇతరపని చేయలేనివారందరును దీనినే అవలంబించుచుండిరి. స్త్రీలు తమపనినంతను ఇంటి ఆవరణములో ముగించుకొనగలుగుచుండిరి. భార్యయును, పిల్లలును బయటికి పోనక్కరలేకయే చేతపనికి భర్తకు తోడ్పడుట కవకాశమున్నందున అన్ని వృత్తులకంటె నిది యెక్కువ వీలుగా నుండెను. సాలెలుహిందూ సంఘములో హీనజాతులలో చేరినవారు గారు. కాపును నల్లి జీవించువృత్తికి తరువాత నిదియే గౌరవింపబడుచుండెను. తక్కినచాకిరీవృత్తులగు కష్టజీవనము లన్నిటికంటెను నది యెక్కువగౌరవము గలిగియుండెను. తన వృత్తికి సంబంధించని గ్రామపాచకవృత్తులలో నేదయిన నతడవలంబించినయెడల కులస్థులతనిని బహిష్కరించుచుండిరి." నూలువడకుపనియు అందరును అవలంబించుటచేత నేత తోపాటు గౌరవింపబడుచుండెను.

అదృష్టవశమున డాక్టరు బుకాననుగారు ౧౮౦౭ మొదలు ౧౮౧౦ వరకు దక్షిణయిండియాలో మైసూరు, కన్నడ, మలబారురాష్ట్రములలోను బంగాళ, బీహారు రాష్ట్రములలోను జనులయొక్క ఆర్థికపరిస్థితులు చక్కగ

దక్షిణయిండియాను గురించి డాక్టరుగా రంత తప్పీలుగా వ్రాయలేదు. వ్రాసిన కొంచెమునుబట్టి చూచినను దేశము నూలువడుకు వాండ్రతోను, నేతగాండ్రతోను నిండియున్నట్లు గన్పట్టుచున్నది. దక్షిణయిండియాలోని పరిస్థితులనుగూర్చి యాలోచించుటకు పూర్వము డాక్టరుగారిచ్చిన అంకెలనుబట్టి దేశపరిస్థితులను గమనించుటమంచిది.

పై లెక్కలనుబట్టి స్త్రీలు, పురుషులు, బిడ్డలు కలిసి ప్రతిపదిమందికి అధమము ఒక్కొక రాటమున్నట్లు తెలుచున్నది. పిల్లలను లెక్కలోనికి తీసుకొననియెడల సంఖ్య యింకను హెచ్చుకాగలదు. కుటుంబము లన్నిటియందును పనిలేనప్పుడు నూలువడుకబడుచు కొంతసంపాదించి కుటుంబాదాయమునకు తోడుచేయుచుండినవి. కుటుంబమున కిది యెంతయో సహాయముగానుండెను. అప్పటి లెక్కలనుబట్టి కదుగుకు రు. ౨-౧-౦ మొదలు రు. ౪-౦-౦ ఆదాయము వచ్చుచున్నందున ఇప్పటి ఖరీదునుబట్టి కదురుకు రు. ౧౦-౦-౦ మొదలు రు. ౨౧-౦-౦ వరకు ఆదాయమయినట్లు లెక్కవేయవచ్చును.[1]

---

1. ప్రస్తుతము నూలువడుకువారికి ఆదాయము ఇంతయే వచ్చుచున్నది.

పూర్వము పొద్దుగూకులు నూలువడుకువా రరుదు. దినాజ్ పురము, రంగపురము జిల్లాలలో దిన మంతయు వడుకువారు నెలకు రు ౦-౧౨-౦ వంతున సంవత్సరము నకు ౫౯ లు సంపాదింప గలిగిరి. ఈ రు ౯ ల ఆదాయము ఇప్పటి రు ౨౫ లు సమానము. స్త్రీలుతమ కితర పని లేనప్పుడే నూలువడుకుచుండుట మామూలు. స్త్రీలు ప్రత్తిని తమ పొలములలో పండించుకొనియో, లేక సారపుసంతలలోకొనియో ధాన్యము మొదలయిన పెట్టుబడిపెట్టి దూదేకులవాండ్రచే ఏకించుకొనుచుండిరి. దూదేకులవాడు రోజుకు ౪¼ పౌనుల దూది యేకి ౬¼ శేరుల ధాన్యము సంపాదించుకొను చుండెను. సన్ననూలు వడుకుస్త్రీలు తామే ఉండేలుబద్దతో ఇప్పటి విధముగనే ఏకుకొను చుండిరి.[1] దూదేకులవాండ్రు సాధారణముగ తురకలు. కొందరు దిగువజాతి హిందువులును ఈ పని చేయుచుండిరి. వడుకువాండ్రును, దూదేకుల వాండ్రును ప్రత్తిపట్టువాండ్రును జనాభాలో ఏడవవంతు దాకా ఉండురు. సాలీలు కుటుంబములతో సహా ఇంతకు తగ్గరు. వీరుగాక అనేకులు గుడ్డలవర్తకమువలన జీవించుచుండిరి. ఈనేతవృత్తికి సంబంధించిన చెంకీ, అద్దకము మొదలయిన

---

1. పూర్ణియాజిల్లాలో స్త్రీలు సన్ననూలును తక్లీమీద వడుకు చుండిరి.

వానివలన జనాభాలో అష్టమము ౧౦౦ కి ఒకరయినను జీవించుచుండురని బుకాననుగారు లెక్కవేసి యున్నారు. నేతగాడు దినమంతయు పనిచేసినయెడల సంవత్సరమునకు రు ౧౦౮-౮-౦ సంపాదించగలుగుచుండెను. ఇప్పటి ఖరీదునుబట్టి వాని ఆదాయము సంవత్సరమునకు ౫౫౦ రూ.లకు మించుచున్నది. సాలీలు కొందరు వ్యవసాయము నయితము చేసికొనుచుండిరి. కొందరు వ్యవసాయకులు పనిలేనికాలములో నేతయును సాగించి ఆదాయమునకు తోడుచేసికొనుచుండిరి. బుకాననుగారు దినాజపూరు జిల్లాలో వ్యవసాయకు లనేకులు తమ యిండ్లలో మగ్గముల నుంచుకొని పనిలేని రోజులలో నేత నేయుచుండిరని వ్రాసియున్నాడు. నేతగాండ్లకు బాగుగా కూలి కిట్టి అన్నవస్త్రములకు లోపములేక జీవించుచుండిరి. కంపెనీ ఏజంట్లు మెల్లగా వీరిని సమీపించి వారిని ఒడంబడిక పద్ధతులకు దింపసాగిరి. ఇందువలన ఎట్టి యపాయము వీరికి తటస్థించినదో బుకాననువంటి విమర్శకుడు గ్రహింపక పోలేదు. ప్రతిచోటను స్వంతముగా పనిచేసికొనుచుండిన సాలీలకంటె కంపెనీవారి ఒడంబడికలలో చిక్కి, చిక్కిపోయినసాలీలు క్రమముగ హీనస్థితికి వచ్చినట్లు ఆయన గమనించియున్నాడు. ముబాదలాగా పైకము పుచ్చుకొని కంపెనీతరపున పనిచేసినవారికంటె స్వయముగా పని

చేసికొని అమ్ముకొనినవారే బాగుపడుచున్నట్లు ప్రతి రాష్ట్రములోను ఋజువుచేయవచ్చును. ఈ అడ్వాన్సుల పద్ధతి రయితులకును, పనివాండ్రకును నష్టమే కలిగించినది. దీనివల్ల దేశములోని ధనము ఏకొందరిదగ్గరనో చేరి నిలువయ్యె యుండును. మూలధనము కొందరిచేతులలో చేరిపోవునను సామాన్యనష్టమే కాకుండ పనివాండ్రు అడ్వాన్సులు తెచ్చి, అవివేకులై అధికవ్యయముల చేయుచు,మితవ్యయపద్ధతులు మరచిపోవుదురు. ఇటుగాక వాయిదాలప్రకారము సరుకులిచ్చుట కష్టము. కంపెనీవారు కోరినధరలప్రకారమమ్ముట నష్టము. దీనికి దృష్టాంతముగా మాల్టా సాలీలసంగతి చెప్పవచ్చును. అచ్చటి సాలీలందరు కంపెనీవారిదగ్గర అడ్వాన్సులు పుచ్చుకొని పనిచేయుచుండిరి. త్వరలో వారిసంఖ్య క్షీణించినది. అడ్వాన్సులు పుచ్చుకొనువారు అప్పులపాలయి వాటిని తీర్చలేకపోయిరి. ఇన్ని చిక్కులున్నను ఎక్కడనేసిన గుడ్డలు ఆచుట్టుపట్లనే ఖర్చగుచుండుటచేత వృత్తి నశించక తక్కిన వృత్తులకంటె మంచి స్థితియందే యుండెను. ఎగుమతులు పూర్తిగ ఆగిపోయినను సాలీలు విశేషము నష్టపడియుండరు. దేశమునకు అవసరమయిన రకములనే తయారుచేసికొనుచుండెడివారు. వారపుసంతలలో గుడ్డలు సర్వసాధారణముగ

రొక్కమునకు అమ్ముడుపోవుచుండుటచేత సాలీలకు తీయకుండా పనియుండెడిది.

ఆకాలమునందు ఆయాఅంతస్తులనుండు కుటుంబములకు అన్నవస్త్రముల కగువ్యయములను గూర్చి బుకాననుగారు వ్రాసినవిషయములు గమనింపదగియున్నవి. దినాజ్‌పూరు జిల్లాలోని పరిస్థితులే దక్షిణమండలములయందును ఉన్నవని అంగీకరించవచ్చును. దర్జాను బట్టి ఆకాలపుకుటుంబములు ఆరుఅంతస్తులుగా విభజింపబడినవి. బుకాననుగారి పరీక్షాఫలితము లీక్రింద నుదాహరింపబడినవి.

| 5గురుగలకుటుంబము | ఆహారపు ఖర్చు. | వస్త్రముల ఖర్చు |
|---|---|---|
| ౧వ అంతస్తు | రు ౩౩౪-౧౩-౦ | రు ౨౧౦-౦-౦ |
| ౨ ,, | ౧౭౪- ౦-౦ | ౭౨-౦-౦ |
| ౩ ,, | ౧౨౫- ౦-౦ | ౩౭-౮-౦ |
| ౪ ,, | ౬౬- ౦-౦ | ౧౭-౧౨-౦ |
| ౫ ,, | ౩౦- ౦-౦ | ౩-౬-౦ |
| ౬ ,, | ౨౦-౧౦-౦ | ౨-౬-౦ |

కడపటి రెండుతరగతులు కూలీలును గ్రామచాకరివాండ్రు అనిచెప్పవచ్చును. మధ్యరకమువారును పైతరగతుల పనివాండ్రును చాలినంత ఆహారమును వస్త్రము

లును గలిగియుండిరి. వారికి వస్త్రములకు ఆహారమున కయినదానిలో మూడవవంతు ఖర్చగుచుండెను. బీద కుటుంబములు స్వయముగా నూలువడుకుకొని తమయూరి లోనే నేయించుకొనుచుండుటచేత వారివస్త్రములకు అతిస్వల్పముగ ఖర్చగుచుండెను.

దక్షిణ హిందూస్థానపు పరిస్థితులయందును విశేషము మార్పుగన్పట్టదు. కొంచెమించుమించుగా ఉత్తర హిందూస్థానమును బోలియుండెను. దక్షిణజిల్లాలో నే విశేషముగ నేతగాండ్రుండి పత్తికము విరివిగ సాగుచుండెనని చెప్పవచ్చును. మైసూరురాష్ట్రములో బ్రాహ్మణస్త్రీలు తప్ప తక్కిన కుటుంబములవారందరును తీరి నప్పుడు నూలు వడుకుచుండిరి. కోయంబుత్తూరు జిల్లాలో ఎగువతరగతుల వారందరును చక్కగ నూలువడుకుచుండిరనియు మాలనూలు అన్నిటికంటె శ్రేష్ఠమనియు బుకానను గారు చెప్పుచున్నారు. వారపుసంతలన్నిటిలో నూలు వస్త్రములే ప్రధానవస్తువులుగ నుండెను. ఇరుగుపొరుగుమండలముల నుండియు, ఇంకను దూరప్రదేశములనుండియు వర్తకులు మైసూరుకువచ్చి, దూదితెచ్చి, వస్త్రముల గొనుచుండిరి. చోళదేశము, ఉత్తరసర్కారులు, మధ్యజిల్లాలు గుడ్డల వర్తకమునకు పేరుమోసియుండెను. ఎక్కడచూచిన నను కంపెనీ ఏజంట్లు అడ్వాన్సులిచ్చి మస్లినులు, కాలికోలు, సరకారీగుడ్డలు విశేషముగ గొని, ఓడలకెత్తి యూరపునకు బంపుచుండిరి. సేలము, కోయంబుత్తూరు

జిల్లాలకలెక్టర్లకు వస్త్రములు జమచేసి పంపుటయే మొదటిపనిగనుండెను. స్వల్పభేదములతో బంగాళా, బీహారు ములలోను, దక్షిణఇండియాలోను పరిస్థితు లొకేవిధముగ నుండెను. దక్షిణఇండియా బ్రాహ్మణులలో మగవాండ్రు నాగలిపట్టుటయును, ఆడువాండ్రు రాటము ద్రిప్పుటయును తప్పని భావించుచుండిరిగాని ఉత్తరదేశములో రాటము త్రిప్పుట న్యూనతగ భావించుజాతు లెవ్వియును లేకుండెను. రాటపుపరిశ్రమవలన ఆదాయవిషయమునను దక్షిణ ఉత్తరహిందూస్థానములకు భేదములేదు. నూలుయొక్క సన్నదనమునుబట్టి గంటకు ౧౦౦ గజములు మొదలు ౬౦౦ గజములవరకును వడుకుచుండిరి. నూరవనంబరుకు పైబడ్డ నూలును రోజుకు ౮౪౦ గజముల పొడవుగల ఒక్కపుంజమును మాత్రమే వడుకగలిగి యుండిరి. ముతకనూలు ముప్పాతికసేరువడికి రోజుకు ౧౪ పెన్నీ సంపాదించుచుండిరి. ముతకనూలు గంటకు ౬౦౦ గజములవరకును తీయుచుండిరి. వడుకుటకు ముందుజరిగేపనులు, అనగా పత్తిబట్టుట, ఏకుట, శుభ్రముచేయుట మొదలగుపనులు, దక్షిణహిందూస్థానములో స్త్రీలుతమకవసరమయినంత తామే చేసికొనుచుండిరి. దక్షిణఇండియాలో ఏకుట అంత లాభకరముగ నుండకపోవుటచేత గాలాలు, వడుకువారే యేకుకొనుచుండిరి. సాధారణపుగుడ్డలధరలు అంతటను ఒకేవిధముగ నుండెనుగాని మస్లిను మొదలయిన సన్నగుడ్డలు దక్షిణదేశములో నెక్కువచౌకగా దొరకుచుం

మదరాసు ప్రపంచముతో చేయుచున్న నూలు దూది వస్త్రములయొక్క ఎగుమతి దిగుమతు లీక్రిందివిధముగ నుండెను:—

| వస్తువు | దిగుమతి | ఎగుమతి |
|---|---|---|
| ౧ దూది | రు ౨,౫౧,౪౫౮ | రు ౧,౭౫,౪౧౬ |
| ౨ నూలు | ,, ౫౫,౧౧౪ | ,, ౯,౬౬౫ |
| ౩ గుడ్డలు | ,, ౨౧,౪౪,౫౮౨ | ,, ౫౩,౬౬,౧౭౧ |

పై నుదాహరించిన దిగుమతులు విదేశములనుండి వచ్చినవిగావు. ఇండియాలోని ఇతరభాగములనుండి దిగుమతియైనవి.

డాక్టరు బుకాననుగారి సాక్ష్యమునుబట్టి అన్నివర్గగతులజనులును తీరినప్పుడు కాలము వ్యర్థపరచక లాభకరమగుపనులు చేయుచుండిరనియు, అందువలన తమ జీవనమునకై కేవలము భూమిమీదనే ఆధారపడియుండు లేదనియు తేలుచున్నది. స్వదేశవస్త్రములు చాల నాగసుగ నుండెననియు, అందువలననే ఐరోపాదేశపువస్త్రములు దేశీయులకు నచ్చలేదనియు, అందువల్ల నవి ఇండియాలో ఖర్చుకావనియు వారక్ హేస్టింగ్సు గారు ౧౮౧౩ వ సంవత్సరములో పార్లమెంటుసభకు సాక్ష్యమిచ్చియున్నారు. దేశమునకు కావలసిన వస్త్రము

లన్నియు ఇచ్చటనే నేయబడి ఖర్చగుచుండెను. ఇవి మిక్కిలి చౌకగా నుండుటచే విదేశవస్త్రములు వీనితో పోటీచేయలేకపోయెను. ౧౮౦౦ మొదలు ౧౮౧౩ వరకు ఇంగ్లాండునుండి ఇండియామొదలగు తూర్పు దేశముల కెగుమతియయిన సరకులనుబట్టి విచారించిన యెడల దేశములో విదేశవస్త్రములను ఖాతరీచేయలేదని స్పష్టముగ జెప్పవచ్చును.

| సంవత్సరము | ఇంగ్లీషు వస్త్రముల ఎగుమతి విలువ. |
|---|---|
| ౧౮౦౦ | పౌ. ౧౯,౫౭౫ |
| ౧౮౦౧ | ,, ౨౧,౨౦౦ |
| ౧౮౦౨ | ,, ౧౬,౧౯౧ |
| ౧౮౦౩ | ,, ౨౭,౮౭౬ |
| ౧౮౦౪ | ,, ౫,౯౩౬ |
| ౧౮౦౫ | ,, ౩౧,౯౪౩ |
| ౧౮౦౬ | ,, ౪౮,౫౨౫ |
| ౧౮౦౭ | ,, ౬౯,౦౪౧ |
| ౧౮౦౮ | ,, ౧,౧౮,౪౦౮ |
| ౧౮౦౯ | ,, ౭౪,౬౯౫ |
| ౧౮౧౦ | ,, ౧,౦౭,౬౪౯ |
| ౧౮౧౧ | ,, ౧,౦౭,౩౦౬ |
| ౧౮౧౨ | ,, ౧,౦౮,౮౨౪ |

మొట్టమొదటిసారి ౧౮౧౧ లో ఇండియాకు ఇంగ్లీషువారి గుడ్డల దిగుమతి ఒక లక్షపౌనులవరకు పెరిగినది. వస్త్రముల ఎగుమతి చాలవరకు క్రమముగా తగ్గినది. ౧౮౨౬ వసంవత్సరములో ఇండియానుండి ఎగుమతియైనగుడ్డ ౨౦౦౦ బేళ్లకు మించలేదు. ఇండియాదేశపు గుడ్డలమీద సుంకము అధికముగా విధింపబడుటచే ఎగుమతులు క్రమముగా క్షీణించినవి. ఎగుమతులు తగ్గినను దేశీయులచేత విదేశవస్త్రముల ధరింపజేయుటకు విశ్వప్రయత్నములు చేసియు ఆంగ్లేయులు విఫలులయిరి. విదేశీనూలుకు అసలే ఖర్చు లేకుండెను. 'హారిః ఓం'అని ఇంగ్లీషునూలు ఇండియాకు ౧౮౨౩ వ సంవత్సరమున దిగుమతియైనది.

ఈ రోజులలోనే ఇంగ్లండులో గుడ్డలనేత దాట్లతో పెరిగిపోవుచుండెను. ౧౭౬౦ న సంవత్సరమున మరమగ్గము కనుగొనబడినది. ౧౭౬౪ లో వడుకు జెన్నియును, ౧౭౮౫ లో యంత్రపుమగ్గమును, ౧౭౮౯ లో ఆవిరియంత్రమును నిర్మింపబడుటచే నేతపరిశ్రమ సంపూర్ణముదశకు వచ్చినది. ఇండియానుండి ఇంగ్లండుకు ప్రవాహముగట్టి వచ్చిన బంగారునాణెములు ఈయంత్రముల కద్భుతశక్తి నిచ్చినవి. ఇండియానుండి వచ్చిన అంతులేని ధనముయొక్క సాయమే లేనియెడల నెన్నియం

త్రములు గనిపెట్టినను కొన్నితరములవరకును ఇంగ్లీషు నేతపరిశ్రమలు పైకి రాలేకపోయేవే యని స్పష్టముగా జెప్పవచ్చును. ఇండియాయొక్క దుర్గతి ఇంగ్లండుకు సుగతి. ఇండియాలో వరహాలచెట్లు దులుపుకొని తీసికొనిపోయిన పాపపుసొమ్ము ఇంగ్లీషు వర్తకులకు ప్రపంచములో పరపతి యెక్కువగుటకును, పరిశ్రమల యభివృద్ధికిని తోడ్పడినది. ఇంగ్లీషు వస్త్రములను ఇండియాలో ఖర్చుపెట్టుటకు విశ్వప్రయత్నములు గావింపబడినవి. నెపోలియన్ చక్రవర్తి ఇంగ్లండును యూరోపాలోని దేశములలో సరుకు బెట్టనీయనందున ఇంగ్లీషువస్త్రములకు ఇండియాబజారు ఆతారకమయ్యెను. ౧౮౧3 లో ఇంగ్లీషువారి పరిశ్రమల వృద్ధిపరచు మార్గముల నరయుటకు పార్లమెంటువారు విచారణ గావించిరి. వారన్ హేస్టింగ్సు మొదలు మన్రో వరకును ఇండియాలో పనిచేసిన పెద్దఉద్యోగుల నందరిని ఇండియాలో ఇంగ్లీషు గుడ్డల నమ్ముటకు మార్గముల సూచించవలసినదని సలహాలడిగిరి. ఇంగ్లీషువారి గుడ్డల కంటె ఇండియాగుడ్డలు మిక్కిలి చౌకయైనందున, ఇంగ్లీషువారు ఇండియాలో గుడ్డలమ్ముట సాధ్యపడ దని పలువురు సాక్ష్యమిచ్చిరి. ధరల తేడాయే ముఖ్యమైన ప్రతిబంధకమని మన్రోగా రనిరి. ప్రభుసంఘమువారి యెదుట సాక్ష్యమిచ్చుచు రాబర్టుబ్రౌనుగారు ఇండియానుండి సన్న

గుడ్డలను సుంకములు విధించకుండ రానిచ్చినయెడల ఇంగ్లీషువారిగుడ్డలు పోటీకి నిలువవలెననియు, ఇండియానుంచి వచ్చు ముతకగుడ్డలు అతిచౌకయగుటచేత ఇంగ్లండులో ముతకగుడ్డలనేత బొత్తిగా పడిపోవుననియు చెప్పియున్నాడు. కంపెనీవారియొక్క గతమార్చినెల అమ్మకములలో ఇంగ్లీషువారి తెల్లకాలికోలకును, ఇండియాదేశపు తెల్లకాలికోలకును ఒకేరకపువాటికి ధరలతేడా లేమాత్రముండెనని పార్లమెంటుకమిటీవారు బ్రౌనుగారిని ప్రశ్నించగా ఏకపరిమాణము, గుణముగల గుడ్డలలో ౧౦౦కి ౩౦ మొదలు ౬౦ వరకు ఇండియాగుడ్డలు చౌకగా నుండెనని జవాబిచ్చెను. ఇండియా గుడ్డలను సుంకములు లేకుండ రానిచ్చిన యెడల ఇంగ్లీషు వస్త్ర పరిశ్రమకు ముప్పువాటిల్లునని భయముగలిగెను. ఇంగ్లీషుపరిశ్రమలకు నష్టమగునను కారణముచేత ఇండియాగుడ్డలమీద సుంకముల తీసివేయుటకు ఒక్కరును అంగీకరించరయిరి. వెల్లస్లీ ప్రభువు ౧౮౧౨ వ సంవత్సరములో ఇండియా సరుకులను ఇంగ్లండుకు సుంకములు వేయకుండ నిచ్చిన యెడల ఇంగ్లీషుపరిశ్రమ లంతమొందుటయేకాక ఇంగ్లీషు గృహములలో స్వోపయోగమునకుగూడ ఇంగ్లీషువస్త్రముల గొనరని చెప్పియున్నాడు. ఇండియాగుడ్డలు ఇంగ్లీషుగుడ్డలకన్న ౧౦౦ కి ౫౦-౬౦ వంతున తక్కువధర

లకు గిట్టుచుండెను. ఇండియాగుడ్డలను ఇంగ్లండులోనికి రాకుండ జేయుటకు ౧౦౦ కి ౭౦ మొదలు ౮౦ వరకు సుంకములు విధింపబడెను. ఎవరికి నష్టములేకుండ నలుగురము బాగుండవలయునను సిద్ధాంత మప్పటి కింగ్లండులో ననుసరించలేదు. ఇంగ్లీషుపరిశ్రమలకు బాగుగ కాలు కుదిరి మనతో పోటీచేయగలవా రెవరును లేరను దృఢ నమ్మకము గలిగినతరువాత నాసిద్ధాంతము బయలుదేరినది. ఇంగ్లాండులో ఇండియాగుడ్డలపై నిట్లు సుంకములు వేయుచు అదేసమయమున ఇంగ్లీషుగుడ్డలను ఇండియాలోనికి ఏసుంకములు లేక నిరాఘాటముగ తెచ్చుకొనుటనుబట్టి ధనాశాపీడితులెట్టి కుమార్గము లవలంబింతురో తెలిసికొనవచ్చును. ఒకవైపున మాత్రమె సుంకములు విధించి రెండవపక్షమును కొల్లవిడిచిన నీయాంగ్ల రాజనీతికి గినిసి 'విల్సన'ను చరిత్రకారు డీతీక్ష్ణ వాక్యములను నుడివినాడు:

"స్వదేశములో నెక్కువధరకు తయారగు వస్తువులను రక్షించుటకై పరదేశములనుండి చౌకగావచ్చువస్తువులమీద రక్షణసుంకములను విధింపగూడదను స్వేచ్ఛావర్తకసిద్ధాంతమెల్లప్పుడును, అన్ని పరిస్థితులకనువర్తింపజేయ వీలులేదని రుజువుచేయుటకు ఇండియాదేశపువస్త్రవ్యాపారపు చరిత్రయే బలమయినసాక్ష్యము. ఒకదేశము

మరియొక దేశమునకు లోబడిపోయినపుడు ఎట్టి యపకారము జరుగునో చూపుటకిది యొక విచారకరమయిన వృత్తాంతము. ౧౮౧౩వ సంవత్సరములో ఇండియా దేశపు వస్త్రములు ఇంగ్లండునకు దెచ్చి ఇంగ్లండుయొక్క స్వదేశి వస్త్రములకంటె ౧౦౦ కి ౫౦ లేక ౬౦ వంతులు చౌకగా అమ్మబడుచుండినట్లు సాక్ష్య మియ్యబడినది. అందువలన ఇండియా వస్త్రముల ఖరీదుమీద ౧౦౦ కి ౭౦ లేక ౮౦ వంతుల నిషేధ సుంకములు విధించబడినవి. ఇట్టి నిషేధసుంకములే విధించియుండనియెడల పయిస్లీ, మాంచెస్టరు పట్టణములలోని యంత్రశాలలు మొదటనే నిలిచిపోయేవి. ఆవిరియంత్రములుగూడ వానిని కదిలించలేకపోయేవి. ఇండియా దేశపు పరిశ్రమలను ఇంగ్లీషు యంత్ర దేవతలకు బలియిచ్చి ఇంగ్లీషుపరిశ్రమలు ప్రారంభింపబడినవి. ఇండియాకు స్వాతంత్ర్యమే యున్న యెడల తిరిగి ప్రతిక్రియగావించి ఇంగ్లీషువస్త్రములమీద నిషేధ సుంకముల విధించి తనపరిశ్రమలు వినాశము నొందకుండ రక్షించుకొని యుండేది. ఆత్మరక్షణ గావించుకొనుటకై ఇండియా నిట్టిపనిని జేసికొననియ్యలేదు. ఆమె పరుల దయకు పాత్రమైయున్నది గదా!" 'చేతనయితే తీసికొనండి, చేవగలవాండ్రు ఉంచుకొనండి' అను రాబ్ రాయి సిద్ధాంతమే అవలంబింపబడినది. అసమాన సుంక



3. ప్రత్తివిడదీయుట-ఏకుట
పట్టుసాలిపద్ధతి (మాకివలస గ్రామము)

६६-B



౮. ఏకుట

పట్టుసాలిపద్ధతి (మలియపట్టి)



3. ప్రత్తివిడదీయుట-ఏకుట
పట్టుసాలిపద్ధతి (మాకివలస గ్రామము)



౪. ఏకుట

పట్టుసాలిపద్ధతి (మలియపట్టి)

ముల విధించిన వర్తకరాజుల ధర్మములను ఇండియా ప్రతి ఘటింపలేకపోయినది. ౧౮౧౩ వ సంవత్సరమునకు తరువాత కంపెనీవారి కిచ్చిన వర్తకస్వామ్యము తీసివేయబడి ఆంగ్లేయులందరును వర్తకము చేసికొనుట కనుజ్ఞ ఈయబడినది. ఇంగ్లీషువస్తువులు ఇండియాకు దిగుమతి యగుటకు అనేక సదుపాయములు చూపబడినవి. దిగుమతుల మీాద ౧౦౦ కి ౨౺ వంతున మాత్రమే సుంకములు విధింపబడినవి. ప్రధానవస్తువు లనేకములు ఊరకే రానియ్యబడినవి. అదివరకున్న సుంకములు కొన్ని తొలగించి మరికొన్ని తగ్గించబడినవి. ఇండియాలో దూదిమీాద రహదారిపన్నులు తీసివేయబడినవి. ఇంగ్లండున కెగుమతి యగు దూదిమీాద ఏవిధమయిన సుంకముల బరువుకు మోపగూడదు. ఇండియాగుడ్డలు ఇండియాలోనే అమ్ముడుపోకుండ నుండుటకై అనేకప్రతిబంధములు గల్పింపబడినవి. ఇట్టి అసమయుద్ధములో బలవంతునికి సులభముగా విజయము చేకూరినది. ఇంగ్లీషు సాహసికుల గెలుపునకు కారణము చేతిపనులలో వారికున్న నేర్పరితనము గాదు; వారిధనమునుగాదు. అసమమైన సుంకములే కారణము; ఇంగ్లండుమీాద కొద్దిపన్ను; ఇండియామీాద గొప్ప సుంకములు. ఈసుంకములు నహితము ఒకపక్షము పాతాళమునకు అణగిపోయి రెండవది పైకిలేచులాగున అతి జాగ్ర

త్తగా యోచించి విధించబడినవి. కంపెనీవారి యొక్క ప్రాపకులలో నొకరయిన రిచర్డ్సు అనుఆయన ఇండియా దిగుమతులమీద విధింపబడిన అన్యాయపు సుంకములను గూర్చి వ్రాసియున్నాడు: "ఆంగ్లేయులును హైందవులును ఒక్కసామ్రాజ్యములోనివారే యయినను ఇండియానుండి ఇంగ్లండుకుబోవు వస్తువులమీాద సుంకములువిధించుటయు, ఇంగ్లండునుండి ఇండియాకువచ్చువానిమీాద సుంకములు లేకుండుటయు, భోజనపదార్థముల మీాద ౧౦౦ మీాద ౧౦౦ మొదలు ౬౦౦ వరకును, అందున ఒకవస్తువుమీాద ౧౦౦కి ౩౦౦౦ సుంకము విధించుటయు సరిగాలేదు." ఈసుంకము లప్పుడప్పుడు మార్చబడుచుండెను.'ఇండియాలో నేత చచ్చి శవమయినది; ఇక మఱి లేవదు' అను దృఢ నమ్మకము గలుగువరకును ఈసుంకములు తీసివేయబడ లేదు. ఏసంవత్సరములలో ఎంతపన్నులు విధింపబడుచున్నది ఎదుటి పుటలోని పట్టికవలన* తెలియగలదు.

ఆయా సంవత్సరములలో ఇండియానుండి ఇంగ్లండుకు ఎగుమతియయిన వస్త్రములు, వాటిమీాద ఇంగ్లండులో వేయబడిన సుంకములు, ఇండియాకు ఇంగ్లండునుంచి వచ్చినదిగుమతులుగలపట్టిక నిచ్చినయెడల ఆంగ్లేయులు ఇండియాపరిశ్రమల నేవిధముగా సమయజేసినది తెల్లమగును.

## * సుంకముల పట్టిక

| సంవత్సరము | ౧౧౧ పౌనుల విలువగల | | అద్దకము | ఇతర సుద్దులు |
|---|---|---|---|---|
| | తెల్ల కాలికోలు | మజ్జినులు | | |
| | పౌ-షి-పె | పౌ-షి-పె | | |
| ౧౭౯౭ | ౧౮- ౩-౦ | ౧౯-౧౬-౦ | పూర్తి | ... |
| ౧౭౯౮ | ౨౧- ౩-౦ | ౨౨-౧౬-౦ | గానిపే | ... |
| ౧౭౯౯ | ౨౬- ౯-౧ | ౩౦- ౩-౯ | ధము | ... |
| ౧౮౦౨ | ౨౭- ౧-౧ | ౩౦-౧౫-౯ | ,, | ... |
| ౧౮౦౩ | ౫౯- ౧-౩ | ౩౦-౧౮-౯ | ,, | ... |
| ౧౮౦౪ | ౬౫-౧౨-౬ | ౩౪- ౭-౬ | ,, | ... |
| ౧౮౦౫ | ౬౬-౧౮-౯ | ౩౫- ౧-౩ | ,, | ... |
| ౧౮౦౬ | ౭౧- ౬-౩ | ౩౭- ౭-౧ | ,, | ... |
| ౧౮౦౯ | ౭౧-౧౩-౪ | ౩౭- ౬-౮ | ,, | ౨౭-౬-౮ |
| ౧౮౧౨ | ౭౩- ౦-౦ | ౩౭- ౬-౮ | ,, | ,, |
| ౧౮౧౩ | ౮౫- ౨-౧ | ౪౪- ౬-౮ | ,, | ౩౨- ౯-౨ |
| ౧౮౧౪ | ౬౭-౧౦-౧ | ౩౭-౧౦-౦ | ,, | ౩౨-౧౦-౦ |

౧౮౨౫ మొ ౩౧న నూటికి ౧౦ వంతున ఒక సుంకము, ౧౦౦ కి ౩½ వంతున మఱియొక సుంకము, అద్దనయెడల ౨౦-౦-౦.

౧౮౪౬ పదిపౌనుల సుంకము తీసివేయబడినది.

| సంవత్సరము | ఇండియానుండి ఎగుమతియైన శాల్తీలు | సుంకములు | ఇంగ్లండునుండి దిగుమతి చేయబడిన గుడ్డ-గజములు |
|---|---|---|---|
| ౧౮౧౪ | ౧౨,౬౬,౬౦౮ | పౌ ౩౭ మజ్లినులమీద<br>,, ౬౭ కాలికోలమీద<br>,, ౨౭⅓ ఇతరగుడ్డలమీద | ౮,౧౮,౨౦౮ |
| ౧౮౨౧ | ౫,౩౪,౪౯౫ | ,, ౩౭½ మజ్లినులమీద<br>,, ౬౭½ కాలికోలమీద<br>,, ౫౦ ఇతరవాటిమీద | ౧,౯౧,౩౮,౭౨౬ |
| ౧౮౨౮ | ౪,౨౨,౮౦౪ | ,, ౧౦ | ౪,౨౮,౨౨,౦౭౭½ |
| ౧౮౩౫ | ౩,౦౬,౦౮౬ | ,, ,, | ౫,౧౭,౭౭,౨౭౭ |

ఇండియాలో ౧౦౦ కి ౨½ వంతున మాత్రమే పన్ను విధింపబడినది.

ఇండియాలో స్వేచ్ఛావర్తకము మంచిదను ధర్మము ననుసరించుటచేత ఇంగ్లీషువస్తువులు వరదపొల్లుగా ఇండియా అంగళ్లకువచ్చినవి. స్వదేశపరిశ్రమలను పోషించుటకై రక్షణసుంకములను విధించవచ్చునను సిద్ధాంతప్రకారము అధికసుంకములను విధించి ఇండియా వస్త్రములు ఇంగ్లండుకురాకుండ తరిమివేయబడినవి. ఇండియాలో పరిశ్రమలు నశించి ఇంగ్లీషువస్తువులు కొంత చౌకగా అమ్ముటకు వీలయినతరువాత ఇంగ్లండులో సుంకములు తీసివేయబడినవి. బ్రిటిషువర్తకము ఇంగ్లండులో సుంకములచే రక్షించబడి ఇండియాలో నిరాటంకముగా స్వేచ్ఛావిహారము సలుపుటచేత ౧౮౧౩ సంవత్సరము నుండి పెంపొందుట కారంభించినది. అసమసుంకము లమలులోనున్న ౧౮౧౩ వ సం. మొదలు ౧౮౩౩ వరకు ఇండియానుండి యెగుమతియైన వస్త్రములయొక్కయు దిగుమతియైన వస్త్రములయొక్కయు, విలువనుజూచిన యెడల ఏవిధముగా ఎగుమతులు క్షీణించి దిగుమతులు ఎక్కువయినవో తెలియగలదు.

| సంవత్సరము | ఇండియానుండి ఎగుమతియైన గుడ్డల ఖరీదు | దిగుమతియైన గుడ్డల ఖరీదు | దిగుమతియైన నూలు |
|---|---|---|---|
| | రు | రు | రూ |
| ౧౮౧౩-౧౪ | ౫౨,౯౧,౪౫౮ | ౯౨,౦౭౦ | |
| ౧౮౧౪-౧౫ | ౮౪,౯౦,౭౦౦ | ౪౫,౦౦౦ | |
| ౧౮౧౫-౧౬ | ౧,౩౧,౫౧,౪౨౭ | ౨,౬౮,౩౦౦ | |
| ౧౮౧౬-౧౭ | ౧,౬౫,౯౪,౩౮౦ | ౩,౧౭,౬౦౨ | |
| ౧౮౧౭-౧౮ | ౧,౩౨,౭౨,౧౫౪ | ౧౧,౨౨,౩౭౨ | |
| ౧౮౧౮-౧౯ | ౧,౧౫,౨౭,౩౮౫ | ౨౬,౫౮,౯౪౦ | |
| ౧౮౧౯-౨౦ | ౯౦,౩౦,౭౯౬ | ౧౫,౮౨,౩౫౩ | |
| ౧౮౨౦-౨౧ | ౮౫,౪౦,౭౬౩ | ౨౫,౫౯,౬౪౨ | |
| ౧౮౨౧-౨౨ | ౭౬,౬౪,౮౨౦ | ౪౬,౭౮,౬౫౦ | |
| ౧౮౨౨-౨౩ | ౮౦,౦౯,౪౩౨ | ౬౫,౮౨,౩౫౧ | |
| ౧౮౨౩-౨౪ | ౫౮,౭౦,౫౨౩ | ౩౭,౨౦,౫౪౦ | |
| ౧౮౨౪-౨౫ | ౬౦,౧౭,౫౫౯ | ౫౨,౯౬,౮౧౬ | |
| ౧౮౨౫-౨౬ | ౫౮,౩౪,౬౩౮ | ౪౧,౨౪,౧౫౯ | ౧,౨౩,౧౪౬ |
| ౧౮౨౬-౨౭ | ౩౯,౪౮,౪౪౨ | ౪౩,౪౬,౦౫౪ | ౭౫,౨౭౬ |
| ౧౮౨౭-౨౮ | ౨౮,౭౬,౩౧౩ | ౫౨,౫౨,౭౯౩ | ౮,౯౨,౭౪౩ |
| ౧౮౨౮-౨౯ | ౨౨,౨౩,౧౬౩ | ౭౯,౯౬,౩౮౩ | ౧౯,౧౧,౨౦౫ |
| ౧౮౨౯-౩౦ | ౧,౩౨,౪౨౩ | ౫౨,౧౬,౨౨౬ | ౩౫,౨౨,౬౪౦ |
| ౧౮౩౦-౩౧ | ౮,౫౭,౨౮౦ | ౬౦,౧౨,౭౨౯ | ౧౫,౫౫,౩౨౧ |
| ౧౮౩౧-౩౨ | ౮,౪౯,౮౮౭ | ౪౫,౬౪,౦౪౭ | ౩౧,౧౨,౧౩౮ |
| ౧౮౩౨-౩౩ | ౮,౨౨,౮౯౧ | ౪౨,౬౪,౭౦౭ | ౪౨,౮౫,౫౧౭ |

౧౮౩౩ వ సంవత్సరమునకు ఇండియాయొక్క ఎగుమతు లొకలెక్కలోవి గావు. ఆంగ్లేయ వస్త్రములు, నూలు ఇండియాఅంగళ్లలో చొరబడి శాశ్వతమయిన స్థాన మేర్పరచుకొన్నవి.

ఇండియాయొక్క యెగుమతి వర్తకము అక్రమ సాధనముల వల్ల చంపివేయబడుటయే కాక స్వదేశములో గూడ పరిశ్రమలమీద రహాదారి పన్నులు మొదలయిన బాధకరమయిన పన్నులు విధించ బడినవి. నవాబులు మొదలగు స్వదేశప్రభువుల కాలమున సుంకము లున్నవిగాని అవినట్టి టోలుగేట్లపన్నులు. వస్తువులఖరీదు గట్టక భర్తీబదలింతియనియు, ఎద్దుమోత కింతయనియు, గుఱ్ఱపుమోత కింతయనియు విధింపబడేవి. సుంకము చాల తేలికగా నుండుటచేత రహస్యముగా పంపుటకు ప్రయత్నములు జరిగేవిగావు. ప్యాసు అవసరము లేక పోవుటచే వస్తువులు సోదాచేయ నవసరము లేక పోయేది. దూరమునుబట్టి సుంకములు విధింపబడుచుండుటచేత వర్తకుడు వాయిదాలుగా పన్నులు చెల్లించుచు వచ్చెను. కాని ఆంగ్లేయు లీపద్ధతి పూర్తిగ మార్చివైచిరి. వర్తకుడు సరకులను దూరముపంపినను, పంపకున్నను పన్నంతయు ఒక్క మారియ్యవలసియున్నాడు. ఏకసుంకమను సిద్ధాంతము ననుసరించి సుంకముల మూలమున

అమితమయిన ఆదాయము సంపాదింపబడుచున్నది. పార్లమెంటు సంఘము నెదుట ౧౮౪౩ లో సాక్ష్య మిచ్చిన రాంకింగుగారి సాక్ష్యమునుబట్టి ఇండియాలో కొన్ని భాగములయందు ౧౦౦ కి ౧౨౫ వంతున రహ దారీపన్నులు విధింపబడిన వనియు మరికొన్ని రాష్ట్రము లలో ప్రత్తిమీాద ౧౦౦ కి ౫ వంతునను, నూలుమీాద ౭౫ వంతునను, గుడ్డమీాద ౩౫ వంతునను, అద్దకపుగుడ్డ లకు సాదాగుడ్డలని పర్వానా పుచ్చుకొన్నయెడల మఱి ౩౫ యును సుంకములు వసూలుచేయబడుచుండెను. విస్తారమున వ్యవహారము సాగించువారు వస్తువులు చాల దూరమునుండి కొద్దిమొత్తములుగ చేర్పవలసియుండుట చేత ఈపన్నులన్నియు ఇయ్యవలసివచ్చుటచే మిక్కిలి బాధకముగ నుండెను. దూది గుడ్డఅయ్యేలోపల నాలు గురకములపన్ను లియ్యవలసివచ్చెను. ముడివస్తువులకు తీసికొన్న టికట్టుకును తయారయిన వస్తువునకును భేద మున్నయెడల మరికొన్ని పన్ను లియ్యవలసివచ్చెను. టోలు గేటుదగ్గర వర్తకునకు టికట్టు దొరకేవరకు ధరలు తేలక ప్రళయమయ్యేది. ప్యాసు కొద్దిరోజులే అమలులో ఉండేది. గడువు దాటేయెడల తిరిగి ప్యాసు పొంద వలసి యుండెను. సరకులు మొదట ప్యాసు తీసుకొనిన వే అని రుజువుచేయలేక పోయినయెడల తిరిగి పన్నుగట్ట



వలయును. ఈచిక్కులు పడలేక జనులు సరకులను ప్రత్యక్షముగా పంపుచుండేవారు. దీనినాపుటకు సోదాలవసరమయినవి. ఈతనిఖీ కొరకు కొంతకాలము మాట మవసరమయినది. సుంకపుశాలకు నాలుగుమైళ్లలోపలనే సోదాలు జరుపవలసిన దని చట్టమున్నను ఆచరణములో భిన్నముగా నుండేది. సోదాగృహములు దేశమంతటను వ్యాపించి సుంకశాలకు ౭౦, ౨౦ మైళ్ల దూరములోగూడ నుంటూ వచ్చినవి. సుంకరులు చౌకిదార్లు పెట్టేబాధలకు తాళలేక కొందరు వర్తకమే మానుకొనుచువచ్చిరి. నిర్బంధించి డబ్బుతీయుట సర్వసాధారణమయినది. సుంకశాలలను, సోదాగృహములను, చౌకీలను దాటివచ్చువరకు బహుకాలము పట్టుచువచ్చెను. బ్రిటిషుఇండియాలోని సుంకశాలలయందనుభవముగలవారు రష్యా, కాబూలు, పెషావరు, బొఖారా మున్నగుదేశములలోని సుంకశాలలే ఎక్కువ సదుపాయముగ నున్నవని చెప్పను వచ్చిరి. జనులు బాధలు సహింపలేక శోషిల్లుచున్నను నివారించువారు లేరయిరి. నీచులయిన సుంకరులకు లోబడలేక మర్యాదగల వర్తకులు స్వంతముగ వ్యాపారముచేయుట దుర్భరమును, నీచమునని భావించుచువచ్చిరి. పార్లమెంటుకు పలుమారు తెలుపుకొన్నను సుంకశాల బాధలు నివృత్తి కాలేదు. స్వల్పపన్ను నిమిత్తమై దుర్భర

మయిన బాధలకు జనులు లోనుగావలసి వచ్చినది. ఈ సుంకములవలని యన్యాయమునుగూర్చి ౧౮౨౫వ సంవత్సరములో మెకంజీగారును, తరువాత ట్రెవెలియన్ ఎలెంబరో గార్లును కంపెనివారికి సవిస్తరముగ వెల్లడించిరి. చివరకు ౧౮౩౬ లో బంగాళములోను, ౧౮౩౮ లో బొంబాయిలోను, ౧౮౪౪ లో మదరాసులోను, ౧౮౪౭ లో తక్కినచోట్లను ఈసుంకములు కొట్టివేయబడినవి. సాలీలు, వడ్రంగులు, లోహకారులు మొదలయిన వారికి సంబంధించిన అన్నివృత్తులమీదను, అంగళ్లలోగాని, లేక రోడ్డుప్రక్కనగాని అమ్ముకొనే అందరు వర్తకుల మీదను విధింపబడిన ముతార్ఫా అను పన్ను ౧౮౬౩ లో తీసివేయబడెను. మదరాసులో ముతార్ఫా పన్నును వసూలు చేసినట్టియు, రివిన్యూ ఉద్యోగిగను న్యాయాధికారిగనుపనిజేసినట్టియుడైక్సుగారుదానినిగూర్చి యిట్లు చెప్పియున్నాడు: "ఈపన్ను వ్యవసాయముచేయని ప్రతివానికిని తగిలినదనియే చెప్పవచ్చును. ఒక ముసలిది బజారుకు కూరలు దీసికొనిపోయి వీథిలో నొకమూల నమ్ముకొనినయెడల దానికి పన్నియ్యవలసివచ్చెను. ఎవడయిన గుడ్డలమ్ముకొనినయెడల పన్నియ్యవలెను. తెల్లవా రమ్మితేమాత్ర మవసరములేదు."

"నాలుగుడబ్బులు సంపాదించే నల్లవాడు పన్ని య్యక తప్పదుగాని వానిసరసన వందలుసంపాదించే తెల్లవానిమీాద పన్ను లేదు." అసూయా జనకమయిన యీ అక్రమభేదములవలన దేశములో పరిశ్రమల సన్నాహమంతయు క్రమక్రమముగా క్షీణించినది. ఈ ముత్తఫా పన్ను చిన్నది పెద్దది యనుభేదము లేక అమ్మేప్రతివస్తువుమీాదను ప్రతి పనిముట్టుమీాదను విధింపబడినది. రాటముమీాద సహితము పన్ను వేయబడినది. ఇండియా నేత పరిశ్రమలనుగూర్చి విచారించుటకై ౧౮౪౮ లో నియమింపబడిన కమిటీవారి విచారణలో ఈవిషయమే ముఖ్యముగా విమర్శింపబడినది. ఈవిధముగనే మగ్గములమీాదను పన్ను విధింపబడినది. బుకాననుగారు దక్షిణహిందూస్థానచరిత్రలో మగ్గములమీాద పన్ను విధింపబడిన దనియు దానివిషయమై సత్యమంగళము, ధర్మపురి, మొదలగు స్థలములలోని సాలీలు గోల ఎత్తుచున్నారనియు వ్రాసియున్నాడు. అన్నిరకముల చాకిరివాండ్రమీాదను శిల్పములమీాదను, కళలమీాదను విధింపబడిన యీముత్తఫా పన్ను సోదాలకును, లంచములకును, నిర్బంధములకును చోటిచ్చినది. ఈ విషయమే ౧౮౫౩ లో మదరాసునుండి పార్లమెంటుకు పంపబడిన అర్జీలో నుదహరింపబడినది.

౧౯ వ శతాబ్దము ఇండియాకు దాస్యయుగము. ఇంగ్లండు ఇండియాలో అవలంబించిన వర్తకరాజనీతి మూడువిధములు. ఇండియానుండి ఇంగ్లండుకుబోవు వస్తువులను నిషేధించడముగా ప్రారంభింపబడినది. తరువాత ఇండియాలోని వృత్తులను నశింపజేయ నిది ప్రయోజనము లేదని సిద్ధాంతము తేలినది. అందు నిమిత్తమయి ఇండియాలో నిర్బంధచర్య లవలంబించుట మూడవ మెట్టు. దానితో ఇండియాలోని కళాకౌశలము రూపుమాసినది. ఇంగ్లండు ఇండియాలో రాజకీయాధికారము సంపాదించినది మొదలుకొని కావలెనని బుద్ధిపూర్వకముగ మనవర్తకమును, పరిశ్రమలను నాశన మొందించినది. అందునిమిత్తమయి ఇంగ్లండవలంబించిన సాధనము లీక్రింద పొందుపరుపబడినవి.

౧. స్వేచ్ఛావర్తక సిద్ధాంతము నిండియాలో మాత్ర మవలంబించుట.

౨. ఇండియానుండి ఇంగ్లండుకు బోవు సరకుల మీద రక్షణసుంకముల విధించుట.

3. ఇండియాలో స్వదేశపరిశ్రమలమీద ముతర్ఫాపన్నులు విధించుట.

౪. ఇండియానుండి ముడిపదార్థములను విదేశముల కెగుమతి జేయుటకు ప్రోత్సాహపరచుట!

౫. ఇండియా దేశపు పనివాండ్రను నిర్బంధములకు లోబరచుట.

౬. కంపెనివారికి దేశములో వచ్చుఆదాయము నుపయోగించుపద్ధతి. *

౭. ఇండియాలోని పనివాండ్రను నిర్బంధించి వారి వృత్తి రహస్యముల గ్రహించుట.

ఇంగ్లండులో సుంకములు విధించియు, ఇండియాలో నిర్బంధచర్య లవలంబించియు ఇండియాలోని పరిశ్రమలు కంఠమునలిపి చంపివేయ బడినవి. ఇండియానుండి వస్త్రముల ఎగుమతి నశించి దూది యెగుమతి ఎక్కువయినది. బ్రిటీషువస్తువులు మెల్లగా స్వదేశవస్తువులస్థానము నాక్రమించినవి. సాలీలు జీవనాధారములేక పలు ఇక్కట్టులకు పాల్పడిరి. ౧౮౩౦ వ సంవత్సరములో ఇండియా పరిశ్రమల నాశముచేసిన పన్నులను తీసివేయుటనుగూర్చి విచారించుట కేర్పడినసంఘము వారియెదుట పలువురుసాక్షులు ఇండియానుండి ఇంగ్లండునకుబోవువస్తువులమీద ౧౦౦ కి ౧౦ వంతున పన్ను విధించి, ఇంగ్లండునుండి ఇండియాకు వచ్చువానిమీద ౧౦౦ కి ౩౪ మాత్రమే విధించుట అన్యాయమని చెప్పిరి. పై పరిస్థితులనుబట్టి ఇండియా పరి

* ౧౭౯౩-౧౮౧౨ సంవత్సరములమధ్య ౧౯ సంవత్సరములలో ఇండియాకు ప్రతిఫలము లేకుండా ౩౭౪ కోట్ల రూపాయలు ఇండియానుండి వస్తువులు కొనిపంపుట కుపయోగింపబడినవి.

శ్రమలు మరల తలయెత్తకుండ సర్వనాశనమగుట నిశ్చయమని తేలినది.

౧౮౧౩ నకు తరువాత ఆంగ్లేయపరిశ్రమలు అతిశీఘ్రముగ పెంపొందినవి. ౧౮౩౩ లో యంత్రపు మగ్గములు ౨ వేలనుండి లక్షవరకు పెరిగినవి. గుడ్డలు చాల చౌకగా తయారుచేయుటకు వీలయినది. ౧౮౧౨-౩౩ సంవత్సరములమధ్య నూలు యొక్కయు, వస్త్రముల యొక్కయు ధరలు ౧౦౦ కి ౨౫ మొదలు ౮౦ వరకు తగ్గినవి. ఉత్పత్తి యెక్కువయినకొలదిని ఇండియాలోని అంగడులన్నియు బాహాటముగ తెరువబడినవి. ౧౮౩౩ వ సంవత్సరములో ఇండియా యొక్కయు, ఇంగ్లండు యొక్కయు నూలుధరలుపరీక్షించినయెడల ౨౦సంవత్సరములలో పరిస్థితులుమారి అటువిఇటుగా తలక్రిందయినవి.

| నూలు నంబరు | పౌను నూలు ఖరీదు | | | |
|---|---|---|---|---|
| | ఇంగ్లండు | | ఇండియాది | |
| | షి. | పె. | షి. | పె. |
| ౪౦ | ౧ | ౨౺ | ౩ | ౭ |
| ౬౦ | ౧ | ౧౦౺ | ౬ | ౦ |
| ౮౦ | ౨ | ౬౻ | ౯ | ౩ |
| ౧౦౦ | ౩ | ౪౹ | ౧౨ | ౪ |
| ౧౨౦ | ౪ | ౧ | ౧౬ | ౫ |
| ౧౫౦ | ౬ | ౭ | ౨౫ | ౬ |
| ౨౦౦ | ౧౪ | ౬ | ౪౫ | ౧ |

డాక్టరు ఐయిలరుగారు దక్షిణయిండియాలోని స్వదేశ విదేశనూలుల ధరలు పోల్చి ౩౦వ నంబరుకు పైబడ్డనూలుధరలకు గల తేడాలు పైవిధముగనే చూపియున్నాడు. క్రమముగా సన్ననంబర్లనూలు వడుకు అలవాటే తప్పిపోయి ముతకనూలు మాత్రము వడుకబడుచుండెను. ౧౮౩౫లో ఢక్కా-ప్రాంతములందు ఉపయోగపడుచున్న ముతకనూలులో ౩ పీసములు స్వదేశమున వడుకబడునదే. సన్ననూలు మిక్కిలి చౌకగా దొరకుటచేతను దానికి దోడు రైళ్లు మారుమూల ప్రదేశములకుగూడ వ్యాపించి విదేశపునూలు సులభముగా వ్యాపింపజేయుటకు అనువగుటచేతను స్వదేశపునూలు అతిశీఘ్రముగ అంత మొంది

| సంవత్సరము | వస్త్రముల దిగుమతి (మిల్లియనుల పౌనులు) (మిల్లియను=౧౦లక్షలు) | నూలు దిగుమతి మిల్లియను పౌనులు |
|---|---|---|
| ౧౮౪౦-౪౪ | ౩. ౧౯ | ౨. ౩౪ |
| ౧౮౪౫-౪౯ | ౩. ౭౫ | ౧. ౬౮ |
| ౧౮౫౦-౫౪ | ౫. ౧౫ | ౩. ౧౪ |
| ౧౮౫౫-౫౯ | ౬. ౯౪ | ౩. ౧౧ |
| ౧౮౬౦-౬౪ | ౧౦. ౯౨ | ౧౫. ౯౬ |
| ౧౮౬౫-౬౯ | ౧౫. ౭౪ | ౨౫. ౯౮ |
| ౧౮౭౦-౭౪ | ౧౭. ౫౬ | ౧౭. ౪౧ |
| ౧౮౭౫-౭౯ | ౧౯. ౨౧ | ౧౧. ౨౧ |

నది. ౧౮౪౦-౭౯ మధ్య సంవత్సరములలోని ఎగుమతి దిగుమతుల పరీక్షించినయెడల స్వదేశపరిశ్రమ లెట్లు పోటీకి నిలువలేక నశించినదియు,ఇండియావిదేశవస్త్రముల మీాద నెట్లు ఆధారపడవలసివచ్చినదియు విశదముగా తెలిసికొనవచ్చును.

ఇండియాకు క్రమక్రమముగా దూది యెగుమతి చేసి వస్త్రముల దిగుమతిచేసికొను స్థితి వచ్చినది. సమర్థులయిన నేతగాండ్రుగలిగి సుప్రసిద్ధమయిన సన్నవస్త్రముల నెగుమతిచేయుటకు కీర్తిగాంచిన హిందూదేశము ఇప్పుడు ఇంగ్లండుయొక్క ప్రత్తిచేనుగ మారి ఇంగ్లండు కవసరమగు దూదిని బంపి దానికి బదులు, వారు పంపినన్ని గుడ్డలు తీసికొనవలసినస్థితి వచ్చినది. దేశపరిశ్రమను రక్షించుప్రయత్నములే చేయబడలేదు. దిగుమతి వస్త్రముల మీాద సుంకములు ఎక్కువ జేసి స్వదేశపరిశ్రమల రక్షింపవలసిన దని ౧౮౫౭ వ సంవత్సరములో కానింగుప్రభువు సూచించినప్పుడు అది పనికిరాదని యింగ్లండులో పెద్ద గందరగోళము జరిగినది. ఇండియాప్రభుత్వము కంపెని వారి చేతులలోనుండి విక్టోరియారాణిగారిచేతులలోనికి మారిన తరువాతగూడ ఇండియాను ప్రప్రథమమున జూడవచ్చిన ఆంగ్లేయ ఆర్థికమంత్రి ఇండియాయొక్క దిగుమతి సుంక

ములను ఆంగ్లేయవర్తకుల కనుకూలముగ మార్చవలయు
నను సూచనలతో బయలుదేరెను. అందుపై అదివరకు
గుడ్డలదిగుమతులపై విధింపబడుచున్న సుంకములు సగ
మునకును, నూలుమీాద విధింపబడునవి ౫ నుండి ౩౪
వరకును తగ్గింపబడినవి. పాపము, వారి నిజోద్దేశమును
మాత్రము దాచుపద్ధతిలేదు. బొంబాయి గవర్నరుగ పని
చేసి స్త్రీరి అనుఆయన ౧౮౭౧ వ సంవత్సరములోపార్ల
మెంటుయెదుట సాక్ష్యమిచ్చుచు ఇండియాలో దిగుమతి
సుంకముల వృద్ధిచేసినయెడల ఇంగ్లండు దిగుమతులు తగ్గ
ఇండియాలో నేతపరిశ్రమ అభివృద్ధి చెందునని చెప్పి
యున్నాడు.

తరువాతి సంవత్సరములలో బొంబాయిలో వృద్ధి
యగుచున్న నూలుయంత్రము లెట్లు ఆంగ్లేయ వర్తకుల
కసూయాజనకము లయ్యెనో అందుచేత ఎట్లు లంకా
షైరువర్తకులు ౧౮౯౬ వ సంవత్సరములో బొంబాయి
యంత్రములపై అన్యాయసుంకముల విధింపజేసిరో వివ
రించుట కిక్కడ ప్రసక్తిలేదు. ఇండియా కనుకూల మయి
నది ఇంగ్లండుకు ప్రతికూల మనియు, ఇంగ్లండుయొక్క
క్షేమముమాత్రమే గమనింప బడినదనియు మాత్రము
చెప్పి విరమించెదము.

౧౮౭౯ వ సంవత్సరములో ౪౭ లక్షల పౌను లకు లోపుగనున్న దిగుమతులు ౫౦ సంవత్సరములలో ౧౦ రెట్లు పెరిగినవి. దిగుమతులిట్లు పెరిగిపోవుటకు కారణ మొక చిత్రచరిత్ర చెప్పవలసి యున్నది. ఇండియా దేశపు గుడ్డలబజారులను ఆంగ్లేయవర్తకులు తమ వస్తువులతో కొల్లలుగ నింపుట కవకాశ మియ్యబడినది. ఇండియాదేశపు వస్త్రపరిశ్రమయొక్క నేర్పరి తనమును సంగ్రహించవలయు ననుకోరికతో ఇండియా బజారుయొక్క పరిస్థితులన్నియు పరిశీలించబడెను. హైందవుల రుచి ననుసరించి లంకాషైరువస్త్రములు తయారు చేయుటకు ప్రయత్నములు గావించిరి. ఇండియాలోని ఉద్యోగులెల్లరును వారికి ఏజంట్లయియీపనికి దోడ్పడిరి. ౧౮౫౧ వ సంవత్సరములో అంతర్జాతీయప్రదర్శనము జరిగినతరువాత ఇండియాయొక్కఖర్చుతో ఇండియాలో నుపయోగించువస్త్రముల మాదిరులను ప్రోగుచేసి లండను లోని వస్తుప్రదర్శనశాలలో నుంచుటకు డాక్టరురాయిలు అను ఆయన నియమింపబడెను. లంకాషైరువస్త్రములను ఇండియాలో విశేషముగ నుపయోగించులాగున జేయుటకై ప్రారంభింపబడిన విచారణను, ఇండియాపరిశ్రమలను గూర్చి ఇండియామంత్రిగారికి తెలుపుటకని నియమింపబడిన వాట్సను అను ఆయన సాగించి "హైందవుల

వస్త్రపరిశ్రమలు-వారిదుస్తులు" అను గ్రంథమును తయారు చేసెను. ఈగ్రంథమునుగూర్చియే కాబోలు కీత్ అను ఆంగ్లేయ ఉద్యోగి ౭-౯-౧౮౯౧ తేదీగల పయొనీరు పత్రికలో నిట్లు వ్రాసియున్నాడు:—

"వర్తకరహస్యము లెంతజాగ్రత్తతో దాచుకొందురో అందరికి తెలిసినవిషయమే. ఉక్కునను కుంభకార పరిశ్రమలను నీవు చూడబోవునెడల నీ కిక్కడ ఆహ్వాన విసర్జనము లుండవు. అయినను ఇండియాదేశపు పనివాండ్రను నిర్బంధపరచి వస్త్రములను చలువజేయుట మొదలగు రహస్యములన్నియు మాంచెస్టరుయొక్క లాభము నకై సంగ్రహించబడెను. ఇండియాదేశపు బీదలనుండి సంవత్సరమునకు ౪౪ కోట్ల రూపాయలవంతున తీసికొని పోవుటకుగాను ఇండియాఖర్చుతో అమితముగ వ్యయపరిచి యొకగ్రంథము ప్రకటింపబడినది. ఆంగ్లేయవర్తక సంఘముల కన్నిటికిని ఈగ్రంథములప్రతులు ఉచితముగ పంచిపెట్టబడినవి. ఈ ఖర్చునంతయు ఇండియాదేశపు రహితు భరించుకొనవలయును. ఇది రాజకీయార్థికనీతి కావచ్చునేమో కాని ఘోరమయిన అవినీతిమాత్రమగును."

ఆంగ్లేయుల పరిశ్రమాభివృద్ధికై హిందువులదుస్తుల ఆకారము, రంగు చాయ మొదలయినవన్నియు పైనముగా

వర్ణింపబడినది. వాట్సనుగారు జమచేసిన ౭౦౦ రకము లలో ధోవతులు, తలగుడ్డలు, సారీలు, మజ్లీనులు, ఛద్ద రులు, చీటీగుడ్డలు,నూలుపట్టుకలిసిన వస్త్రములు, తక్కిన అన్నిరకముల వస్త్రములు చేరియున్నవి. ఇవి యన్నియు గలిసి ఒకవర్తకప్రదర్శనశాల యని చెప్పవచ్చును. వీనిని బోలినవానిని ఆంగ్లేయవర్తకులు తయారుచేసిరి. హైందవ వులరుచి కెట్టిదుస్తులు సరిపడునో దానివల్ల స్పష్టమగును. ఆనమోనాల ప్రకారము తయారుచేయుటయే పని. ఇండి యాలో నేవస్తువు లమ్ముడుపోవునో, ఏవి పోవో కచ్చిత ముగా చెప్పబడినది. ఈపనియంతయు తగు జాగ్రతతోను సమగ్రముగ నిర్వహించ బడినది. ఖగోళ శాస్త్రజ్ఞులు సూర్యమండలములోని మచ్చలెంత జాగ్రతగ లెక్కింప బడెనో చీరెలమీది చుక్కలును అంతజాగ్రతగలెక్కింప బడినవి. స్వల్పవిషయములుకూడ వదలిపెట్టకుండ వర్ణింప బడినవి.తలగుడ్డల చాయలు,పొడుగు, అల్లికచిక్కదనము ధోవతుల అంచులు, మజ్లినులసున్నితపుపని, కలంకారి అద్దకముల తేలికచాయలు, గట్టిచాయలు, పలుకుటకు నోరుదిరుగనిపేర్లు, సమస్తమును ఆగ్రంథములో నిమిడి యున్నది. స్వల్ప సంఖ్యాకులగు పైతరగతులవారి విష యమై యెక్కువశ్రమపడి తయారుచేయించ నవసరము లేదనియు అసంఖ్యాకులగు సామాన్యజనులకు గావలసి

నవి చౌకగా తయారుచేయవలసినదనియు సూచింపబడి నది. జనుల యభిరుచికి సరిపడుటయు, చౌకగనుండుటయు నను రెండువిషయములను ముఖ్యముగ గమనించినయెడల అమ్ముడుపోవుటకు లోటుండదని తెలుపబడినది. వాట్సను గారు మరియు నిట్లు చెప్పుచున్నారు.

"ఈరోజులలో ఇండియా మనకు ముడిపదార్థములు సిద్ధముచేయు దేశమని మన మెరుగుదుము. దానిఖరీదు కొంత రొక్కరూపమునను కొంత వస్తురూపమునను పం పుచున్నాము. మనమిండియాలో కొనువస్తువులకు సమా నమైన ఖరీదుగలపదార్థముల నెప్పుడును తీసికొనము. అం దుచేత కొంతవరకు వస్తువులుపంపినను శేషించినది. వెం డిబంగారురూపమున ఇయ్యవలసివచ్చుచున్నది.లోహరూ పమునబంపునదెప్పుడును తిరిగిరాదు. అదియంతయుసము ద్రములో పారవేసినట్లే. మనమిండియానుండి నీలిమందు,కాఫి,వాసనద్రవ్యములు కొని దానికి బదులు వారికి కావలసిన వస్త్రములు ఇతరపనిముట్లు పంపుచుందుము. పూర్వ మిండియా మనకు విశేషముగ వస్త్రముల బంపు చుండెనని మనము మరవగూడదు. ఇండియాలో నేత యంత్రములు విశేషముగ వృద్ధియయి యేమికొంపముం చునో చెప్పలేముగాని సాధారణముగ మనల వస్త్రముల నెగుమతి చేయుస్థితికి ఇండియా యెన్నడును రాదనియే

చెప్పవచ్చును. అయినను ఆమె క్షేమముగోరువారు తమ కిష్టము లేకున్నను అవి వృద్ధిగాకుండునట్లు ప్రతిబంధక ముల గల్పింపవలయును. ఇండియాలోని బీదలగు దిగువ తరగతులకు చౌకగా గుడ్డలు ఇప్పించగలిగినయెడల అది వారికి లాభకరము. ఇది చేయగలవారు చేయండి. ఇంగ్లండు లుంగీలు, దోవతులు, చీరెలు, కాలికోలు ఇండియాలో చేయబడువానికంటె చౌకగా నియ్యగలిగినయెడల అది ఉభయ దేశములకును లాభకరమే. ఇండియా విశేష ముగ ముడిపదార్థముల నుత్పత్తి చేయగల దేశము గనుక మన మింగ్లండునుండి తయారుచేసిన వస్తువులను పంప గలిగినయెడల ఇండియాలోని కూలీలకు తీరికగలిగి తమ కాలమును లాభకరమయిన ఇతరపనుల కుపయోగించు కొందురు." మన అనుభవమును బట్టి వాట్సనుగారి జ్యోతిషము అబద్ధమని స్పష్టపడినది. వీరికి దురుద్దేశ మారోపింపక దూరపు చూపులేనివారనిమాత్రము చెప్పవచ్చును. రాటమును మగ్గమును చంపివేయుటవల్ల దేశ మెట్టి దుర్గతిపాలగునో ఆయన ఊహించ లేక పోయెను. కోట్లకొలది స్త్రీలు రాటములను మూలద్రోసి గౌరవము గల వృత్తిని బోగొట్టుకొని సోమరులై కూరుచుండుటయో, దారిద్ర్యమునకు తాళజాలక ఇండ్లువిడిచి దొరికినయెడల కూలికి బోవలసివచ్చుటయో సంభవించినది.

వేలకొలది నేతగాండ్రు మగ్గములను కట్టిపెట్టి పరాయి దేశపు యంత్రశాలాధికారులయొక్కయు, ఇండియాలోని షాహుకారులయొక్కయు చలువచేత అనిత్యములయిన వ్యవసాయపుకూలి మొదలగు వానిపై నాధారపడవలసి వచ్చినది. గ్రామముయొక్క ఆర్థికజీవితము సమూలముగ గుభేలునకూలిపోయినది. ఇంగ్లండు ఇండియాకు లుంగీలు, దోవతులు, చీరెలు, కాలికోలు పంపవచ్చునన్న జ్యోతిషముమాత్రము సత్యమయినది. తమ ఉద్దేశమును దాచవలయు నను ప్రయత్నముగూడ లేదు; మాటలలో మరుగుపరచి చెప్పుటయు లేదు. వాట్సనుగారు మరియొకచోట నిట్లు స్పష్టముగ వ్రాసిరి. ఇండియాఅని మనముపిలుచు దేశములో షుమారు ౨౦ కోట్లజనులున్నారు వారిలో బహుమంది స్వల్పముగా దుస్తులువైచుకొన్నను వారందరికి సరిపడు గుడ్డలను తయారుచేయవలయునన్న ప్రపంచములో నెల్ల పరిశ్రలకు ప్రసిద్ధికెక్కిన దేశమునకు సహితము సాధ్యముగాదు. కనుక ఇండియాయొక్క బేరము సర్వోత్కృష్టమయినది. ఎప తెగకుండ ఉండేదిగూడాను. మనకు కావలసిన బేరమిస్తూ తానుకూడ పరిశ్రమల సాగించుకొనవచ్చును. ఏలననగా, అంతజనములో కొంత భాగమునకు దుస్తులను తయారుచేయవలయు నన్నను మనలంకాషైరులో ప్రస్తుతమున్న మగ్గములను రెట్టింపు

చేయవలసివచ్చును. ఇదియంతయు రాబోవు సంగతిని నే నూహించి చెప్పుచున్నాను. ఇది జరుగక పోవచ్చును గూడాను. ఏలననగా ఇండియా ఇప్పటి కింకను మన వస్త్రములను బహు స్వల్పము గానే కొనుచున్నది.” వాస్తవమునకు ఇండియాది ఒక పెద్దవర్తకమే కావలసిన విధియున్నది. ఆమె పరిశ్రమ లన్నియు నశించి పోవలసి యున్నవి. ఆమె పనిపాటలవా రందరు దారిద్ర్యములో మునిగి అనుక్షణమును విజృంభించుచున్న ఆంగ్లేయ వర్తకమునకును, పరిశ్రమలకును మత్స్య నిరికకొని నలిగిపోవలసియున్నారు. ఇండియాచేత ఎక్కువ వస్త్రములను ఎట్లు కొనిపించగలుగుదుమా యనునదియే ఆంగ్లేయుల నెదుర్కొన్న సమస్య. ౧౮౬౬వ సంవత్సరములో ఆంగ్లేయుల తృష్ణను చల్లార్చదగినంతగా వస్త్రములను గొనుచుండ లేదు. ఇంకను రాటములగుండె కొట్టుకొనుచునేయున్నది. ఇంకను ఆగిపోలేదు. స్వదేశినూలు నింకను జను లుపయోగించుకొనుచునే యున్నారు. దానిని త్రోసిపుచ్చుట చాల కష్టముగ నున్నది. సాలీలకళాకౌశల మింకను సంగీతములో సంగతులు జూపి చెవినాకర్షించినట్లు అద్దకము మెరుగులతో కనుల కింపును గూర్చుచున్నది. చండేరి, ఆర్ని మొదలగుస్థలములలో ఏస్వల్పసంఖ్యాకులో మజ్లినులు నేయించుకొనుచున్నారు గాని చాలమంది నవి యాక

ర్శించనిమాట వాస్తవమే. స్వదేశములో సన్నపు నూలు నకును, సన్నగుడ్డలకును ఆదరణ పోయినది. కాని కొందరింకను అభిమానముతో పట్టుకొని వేళ్లాడుచున్నందున అవిచావక మరణావశిష్టముగా నున్నవి. మెడోసు టెయిలరు అను ఆయన హైదరాబాదుకు సమీపమున నున్న నందేపు నారాయణపేట మొదలగు స్థలములలో జనులు తలుపులుమూసి నీళ్లుచల్లి గదులను చల్లగాచేసి ఢక్కాలో జేయునట్టి సన్నపునూలును వడుకుచున్నారని వ్రాసి యున్నాడు. సన్న వస్త్రములు చోళమండలములోను, ఆర్ని మొదలగు స్థలములలోను ఇంకను దొరుకుచునే యుండెను. మధ్యరాష్ట్రములలో సర్కారువారు ప్రకటించిన నివేదికనుబట్టి అకోలా, జబ్బల్ పూరు, నాగపురము మొదలగుస్థలములలో ప్ర కర్మాగారాలు కట్టి సన్ననివస్త్రములను నూలునువచ్చుచుండెనని తెలియుచున్నది. సన్నపునూలు విశేషముగ దొరకకున్నను తొగరంచు గుడ్డలయందును, జరితో వేసిన అంచులయందును, ముతకగుడ్డలయందును దేశమింకను ఆధిక్యము చూపుచునే యుండెను. అంచు గుడ్డలను ఇండియాలోకంటె చౌకగా జేయుటకు ఆంగ్లేయులకు సాధ్యము గాకపోయినను విద్యను గ్రహించుట మంచిదిగనుక అదియును ఆంగ్లేయులు నేర్చుకొనవలసినదేయనియు అందుమూలమున జనుల రుచిభేదముల

గ్రహింపవచ్చునవనియు, వాట్సనుగారు శిఫారసుచేసిరి. ఇండియాదేశపు సొగసైన అంచులపని నేర్చుకొనుటకు వేళ్లను సున్నితముగా త్రిప్పగలనేర్పు గావలసియున్నది. అట్టివానికి విశేషముగ అమ్మకములేదు. ఏస్వల్పసంఖ్యాకులో వాని నుపయోగింతురు. ముతకనూలు విషయములో మాత్రము ఇండియాదేశపు రాటముతోను, మగ్గముతోను పోటీచేయుట దుర్ఘటముగ నుండెను. విదేశపు గుడ్డలకంటె స్వదేశపుముతకగుడ్డలు చౌకగనుండి చాల కాలము మనుచుండెను. ముతకగుడ్డలను జనులు విశేషముగ నుపయోగించుచుండిరి. ఫోర్బ్సు అను ఆయన మఱి యొక గొప్పవిషయమునుగూడ జెప్పుచున్నాడు. అమెరికాతో యుద్ధముజరిగి దూదిధర లేచినను విదేశపుముతక గుడ్డలకంటె స్వదేశపువి రెట్టింపు ప్రియముగనున్నను జనులు స్వదేశవస్త్రములనే కొనిరట. పైవిషయమునే మధ్యరాష్ట్రములలోని ఉద్యోగులు గూడ గమనించియున్నారు. కార్నకుఅను ఆయన యంత్రముమీదనేసిన గుడ్డలు స్వదేశగుడ్డలను తరిమివేయలేక పోయినవనియు, స్వదేశి ముతకగుడ్డలు చాలకాలము మనుటయే కాక చాకలవాని బండపెట్లకు ఆగి ఎండచలి వానల కాపునని యువ్రాసియున్నాడు. కార్నకుగారు తనరాష్ట్రములోని చిమ్మూరు మొదలగు గ్రామములలో జరుగు వారపుసంత

లనుగూర్చి వ్రాయుచు ఈసంతకు విశేషముగ ముతక వస్త్రములు వచ్చుచునియు, వాటిని ఢేడ్ అను జాతివారు నూలువడకి నేయుదురనియు, అవి ముదుగుగనుబలముగను నుండుటచేత బీరారురాష్ట్రములోని కుంబీలను వ్యవసాయకులు పైకి పోకుగనున్నను వలపాతల వలె నుండు ఇంగ్లీషుగుడ్డలకంటె వాటినే ఉపయోగింతురనియు, ధర యెక్కువయినను శ్రీమంతులగు కుంబీలందరును తపచుగ వానినే కొందురనియు చెప్పుచున్నాడు. ఆ సంతలోని ౧౧౧ర దుకాణములలో ౯౨౧ గుడ్డలవే; వానిలో ౯ మాత్రమే విదేశీగుడ్డలవి. వానిలో కోష్టీలను సన్నచేతగాండ్రవి ౧౦౦ షాపులు; ఢేడులముతకషాపులు ౩౯౧ కి మించియున్నవి. ఆసంతకు ౨౯ బండ్లదూది అమ్మకమునకు వచ్చెను. ఢేడులు తమవస్త్రముల నమ్మి రాబోవు వారములో వడుకుటకుగావలసిన దూదిని కొని తీసికొని పోవుదురు. సన్ననూలును వడుకుటనుగురించియు, నేయుటనుగురించియు గూడ ఉద్యోగస్థులు లెక్కల నుంచియున్నారు. అకోలాసంతకు మిక్కిలి సన్నని నూలు వచ్చినదనియు అది మోటుగ నుండుటచే రాటముమీద వడుకబడెనని చెప్పినయెడల ప్రేక్షకులు నమ్ముటకు వీలులేనంత సన్నముగా నున్నదనియు కార్నకుగారే వ్రాసియున్నారు. అకోలాకు వచ్చినవాటిలో మిక్కిలి సన్న

ముగ నున్ననూలు (౨౪౫ వ నంబరుది) పౌను బరువుది ౧౧౭ మైళ్లు పొడుగుండెనట. సన్ననూలు వడికే ధేడులు జాగ్రతగా పరిశీలించి తమకు పనికివచ్చు ప్రత్తినిగొనిదానిని ప్రత్తిరాటముతో బట్టక పింజెలు వెగిపోకుండ చేతితో విత్తులు దీయుచుండువారట. రాటముతో బట్టినప్రత్తి ౩౦వ నంబరుకులోపుగనుండు నూలుదీయుట కుపయోగపడు చుండెను. ముతకనూలుకు ఏకులు పింజారీలే చేయు చుండిరి. నూలుదీయుటయు నేయుటయు సాలీలే చేయు చుండిరిగాని ఈవృత్తి నిలుచునని మాత్ర మప్పటికాశ గన్పట్టుచుండలేదు.

ఐరోపావస్త్రములు స్వదేశవర్తకమును ముగింపు నకువెచ్చుచుండెను. ముఖ్యముగా రైళ్లువేసిన చోట విదేశవస్త్రముల ప్రచార మెక్కువయ్యెను. మధ్యరాష్ట్రములలో ౧౮౮౩ మొ. ౧౮౮౭ వరకు గల ఎగుమతి దిగుమతిసంఖ్యలు జూచినయెడల దిగుమతులు క్రమముగ వృద్ధియగుచున్నను ఎగుమతులే అధికముగ నుండెను.

| సంవత్సరము | స్వదేశవస్త్రముల ఎగుమతి (మణుగులు) | విదేశవస్త్రముల దిగుమతి (మణుగులు) |
|---|---|---|
| ౧౮౮౩ - ౮౪ | ౭౫,౩౮౨ | ౨౨,౫౯౧ |
| ౧౮౮౪ - ౮౫ | ౫౪,౨౭౭ | ౫౮,౪౯౮ |
| ౧౮౮౫ - ౮౬ | ౫౫,౦౫౨ | ౨౯,౦౭౦ |
| ౧౮౮౬ - ౮౭ | ౫౨,౮౯౩ | ౫౮,౪౦౨ |

౧౮౬౮-౬౯ సంవత్సరముల మధ్యరాష్ట్రపు గజెటులో ప్రకటింపబడిన లెక్కలవల్ల కొన్నిజిల్లాలలో పరిస్థితు లెటులుండునో తెలియవచ్చును.

| జిల్లా | దిగుమతులు | | ఎగుమతులు | |
|---|---|---|---|---|
| | స్వదేశి | విదేశి | స్వదేశి | విదేశి |
| | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆర్వి | ౫౩,౯౯౪ | ౩౨,౬౫౦ | ౨౫,౬౨౫ | ౧౬,౩౦౦ |
| డియోలి | ౧,౨౩,౨౮౧ | ౧౩,౭౨౨ | ౩,౭౯౦ | — |
| హింగింఘాటు | ౨,౫౯,౭౦౬ | ౪౪,౬౧౩ | ౧,౭౭,౧౧౪ | ౨౬,౧౬౧ |

బర్హాంపురపట్టణమును, పాండలమును వస్త్రపరిశ్రమకు మిక్కిలి ప్రసిద్ధికెక్కియుండెను. అచ్చటివారు నూలు వడికియు అద్దకమువేసియు సంపాదించునది గాక సాలెవానికి నెలకు ౫ మొదలు ౧౦ రూపాయలవరకు గిట్టుచుండెనట. సాలెవాని కితరరకముల వస్త్రములు నేయుట కవకాశము లేనియెడల సాధారణపు దోవతులు, చీరెలు నేసికొనినచో పెట్టుబడితో నవసరములేకయే ఎడతెగక పనిదొరికి చక్కగ కాలము జరుగుచుండెనట. పట్టణమునకు గావలసిన నూలు సాలెకుటుంబములును, యితరులును వడుకుచుండిరనియు సన్నపునూలును ధేడజాతివారును, ముతకనూలును జిల్లాలోని అన్నిజాతుల స్త్రీలు

ను వడుకుచుండిరనియు క్రమముగా సన్ననూలువాడుక తక్కి ముతకనూలు విశేషముగ వాడబడుచున్నదనియు గజెటులో నున్నది.

బొంబాయిలో పరిస్థితు లంత ప్రోత్సాహకరముగ లేవు. కొన్నిజిల్లాలలో రాటపు పరిశ్రమ సజీవముగనే యున్నను కొన్నిటిలో అంతరించినది. అహమదాబాదులో నూలుయంత్రములు స్థాపించుటచే గుజరాతులో చేతి నూలున కాదరము తగ్గినది. నూలువడుకుట స్త్రీలకు ప్రధానవృత్తిగానున్న ఖాందేషులో పూర్తిగ నశించినది. సూరతు ధార్వాడజిల్లాలలో మాత్రము స్త్రీలందరును స్వోపయోగమునకును, అమ్మకమునకును గూడ నూలు వడుకుచుండిరి. తాళ్లకు,నవారుకు ముతకనూలే ఉపయోగించబడుచుండెను. పల్లెటూరివారు ముతకగుడ్డలను మాత్రమే ఉపయోగించుచుండిరి. స్వదేశవస్త్రములు చాల గట్టిగానుండుటచేతను, స్త్రీలు పూర్వాచారమును మార్చుట కిష్టపడకపోవుటచేతను బస్తీలలోకూడ స్వదేశవస్త్రములే ధరించుచుండిరి. సాధారణముగ స్త్రీలు రోజునకు ౫ గంటలకాలము వడుకుచుండేవారు. ఎవరికి గావలసినవకులు వారే పత్తిలోని విత్తులుదీసి ఏకుకొనుచుండెడివారు. దూదిలో విత్తు, చెడ, ఆకు లేకుండ దీసి వడికితే ధార్వాడజిల్లాలో రతి నూలు వ ౨-౮-౦ కు గిట్టేది.

మెడ్లికాటు అను ఆయన ౧౮౭౦ వ సంవత్సర ప్రాంతమున వ్రాసిన 'చేమగ్గము' అను గ్రంథములో బంగాళమున ప్రత్తి స్వోపయోగమునకు మాత్రమే అనగా బజారులలో అమ్ముటకుగాక ఎవరు పండించిన ప్రత్తి వారి యింటిలో నూలువడికి పొరుగు సాలెవానిచే నేయించుకొనుటకుమాత్రమే పైరుపెట్టబడుచున్నదని వ్రాసినాడు. అనగా మాంచెస్టరు అప్పటికి చాలకాలము క్రిందనే ఢక్కా మజ్లినుల జంపివేసినదనియు, ఇతరస్థలములలో నెక్కడనయినను మిగిలియున్నదానిని విరమింప జేయుచున్నదనియు, సాలీలు వ్యవసాయపు కూలీకి దిగిరనియు మనము గ్రహింపవలయును. ఆకాలములోనే పవెల్ గారు పంజాబును గూర్చి వ్రాయుచు సాలీలు విశేషముగ ముదుగువస్త్రములనేసి యమ్ముకొనుచున్నారని ఉదహరించినాడు. దేశమొత్తమును పరికించినయెడల ఇండియాలో నాటుజిల్లాలలో మాత్రము ముదుగుగుడ్డల నేతమాత్రము నిలిచి యున్నదని తేలుచున్నది. అంతటను ఖాదీమాత్రము లేకపోలేదు గాని క్షీణదశకుమాత్రము వచ్చియుండెను. నూలువడుకుట క్షీణించినకొలదిని చేమగ్గములకు కూడ పనితగ్గుచువచ్చినది. చేమగ్గ మేస్థితికి వచ్చినదయును మదరాసు రివిన్యూబోర్డువారు ౧౮౭౦ వ సంవత్సరములోను ౧౯౨౧ వ సంవత్సరములోను ప్రకటించిన లెక్కలనుబట్టి స్పష్టముగ వెల్లడికాగలదు.

| మదరాసు రాజధాని జనాభా | మగ్గములసంఖ్య | గ్రామములలో | బస్తీలలో |
|---|---|---|---|
| ౧౮౭౦-౩ కోట్లు | ౨౬౯౨౨౦ | ౨౨౦౦౧౪ | *౪౯౨౦౪ |
| ౧౯౨౧-౪ కోట్ల ౧౦లక్షలు | ౧౬౯౪౦౩ | తెలియదు | † తెలియదు |

ఎంతనూలు { *౩వవంతు విదేశి, తక్కినది స్వదేశి †అంతయుయంత్రము నూలు

ఈ రాజధానిలో మగ్గములసంఖ్య ఒకలక్ష తగ్గినది. జనాభా వృద్ధినిబట్టి ౧౦౦ కి ౫౦ వంతున తగ్గినదని చెప్ప వచ్చును. పట్టణములలో నెన్నిమగ్గములున్నవో గ్రామములలో నెన్నియున్నవో తెలిసిన బాగుండును. ౧౯౧౧వ సంవత్సరములో చాటర్టన్‌గారు ౧౮౭౦ వ సంవత్సరము నుండి చేమగ్గములసంఖ్య తగ్గలేదనియు, సాలీలు మును పటికంటె నెక్కువ కష్టపడినగాని జీవనము జరుగుచుండ లేదనియు వాదించిరిగాని వారి సారాంశములు సరియైనవి గావు. జనాభారిపోర్టులలో వృత్తివిభజనలు సరిగా చేసి యుండలేదు. తగ్గినమగ్గములసంఖ్యను వారు లెక్కకు దీసి కొనలేదు. పరిశ్రమయొక్క నిజస్థితి తగ్గినమగ్గములసంఖ్యనుబట్టియే తేలగలదు. సాలీలు, సాహుకారులు, చేతి

లో చిక్కి బయటపడజాలక మగ్గముల మూలద్రోసి జీవనమునకై బస్తీలు చేరిరి. చాలమంది ఇండ్లువిడిచి పట్టణములలో కూలిచేసికొనుటకో, తేయాకు తోటలకో పరువులిడిరి. మదరాసులోని సాలీలకే పెద్దదెబ్బ తగిలినది. ఇంకను కొందరావృత్తినే యంటఁబట్టుకొని యుండుటకు కారణము స్త్రీపురుషులు చాలమంది యంత్రముల మీఁద నేసినదోవతులు, చీరెలు కట్టుకొనుట కిష్టపడక పోవుటచేతనే. విదేశవస్త్రముల దిగుమతి చాలమగ్గముల నంతరింపఁజేయగా విదేశినూలుయొక్క దిగుమతి మిగిలిన మగ్గములను నడిపి వర్తకుల యధీనము చేసినది. లాభము వర్తకులకే పోయి సాలీలకు జీవనము గడచుటయే కష్టమయినది. మగ్గములు క్షీణించుట యొక్క కారణములకై దూరము పోనవసరములేదు. మధురలోని నేతపరిస్థితులను గూర్చి వ్రాయుచు ప్రభుత్వమువారు 1829 వ సంవత్సరపు వార్షికనివేదికయందులో కారణములు వరుసగా వ్రాసియున్నారు.

సాలెవానిరాబడి యెందుకుతగ్గినది విమర్శించుచు నిట్లు వ్రాసిరి. "ఇంగ్లండునుండి దిగుమతియయిన వస్త్రములు నేతవృత్తి నెట్లు భంగపరచినదియో తెలిసికొనుట కొక చిత్రమయిన దృష్టాంతము గలదు. మధురలోని సాలీలు తాము నేసిన వస్త్రములను తాముకూడ ధరింపరు.

మొత్తముమీద నేతవృత్తి రాను రాను పనివాండ్రకు గిట్టుటలేదు. కారణములకై దూరముపో నవసరము లేదు. నూలు దిగుమతికాకపూర్వము కొన్ని సంవత్సరముల క్రిందటివరకును రెండుమూడువేల కుటుంబములు నూలు వడుకుచుండేవి. ఇది పూర్తిగ నిలిచిపోయినది. విదేశపు జరీ రాకపూర్వము ౫౦౦ ముసల్మానుకుటుంబములు జరీ చేయుచుండేవి. ఇప్పుడు వారిలో ౧౦ కుటుంబముల వారు మాత్రమే జరీ చేయుచున్నారు. సంవత్సరము క్రిందటివరకు నూలు ఇచటనే అద్దబడుచుండెను. తొగ ఇప్పుడు బొంబాయినుంచి దిగుమతి యగుచున్నది. ఇప్పుడు వీరందరు నేతలో దిగుటచేత వారికి కూలి గిట్టుట లేదు" సాలీల రోజుకూలి చాల తగ్గిపోయినది. కొందరు వ్యవసాయపుకూలికి బోవుచున్నారు. మరికొందరు బండ్లు పెట్టుకొని బాడుగకు నదిదగ్గరనుండి ఇసుక మొదలయి నవి తోలి జీవించుచున్నారు. సేలము జిల్లానుంచి మంచి నేర్పరులయిన సాలీలు వచ్చి తిరుచినాపల్లి బజారులలో బండ్లులాగడము ఈరోజున మీరు కనుగొనవచ్చును.

వడుకుట ఆగిపోవుటకును మగ్గములు తగ్గిపోవుటకును కారణ మొకటే. దూదిమిల్లులకు బంపుటకో, ఎగుమతిచేయుటకో పండింపబడుచు దైనిక గృహజీవితములో స్థానమును బోగొట్టుకొన్నది. నూలువడుకుటవలని లాభ

మును జనులు మరచిపోయినారు. దానివల్ల విచిత్ర ఫలిత ములు పొడసూపినవి. ౧౮౨౭ వ సంవత్సరమునకు తరు వాత ౩౦ సంవత్సరములలో ప్రత్తిపండించు విస్తీర్ణము ముబ్బడి యయినను పూర్వము ప్రత్తి పండించు భాగము లలో కొన్నిటియందు ప్రత్తివేయుట అసలే మానివేసి నారు. మరికొన్నిటియందు తక్కినపైరులనుకూడ మాని వేసి ప్రత్తినే పండించుచున్నారు. వ్యాపారమునకు గాక పోయినను పూర్వము సర్వసాధారణముగ ప్రత్తి పండించు చున్న బంగాళములో ఒకటి రెండుజిల్లాలలో దప్ప తక్కిన చోట్ల ప్రత్తిపంట మే లేదు. ౧౮౭౭ వ సంవత్సరపుమధ్య రాష్ట్రముల గజెటులో వార్ధాజిల్లాలోను, బేరారులోను పూర్వము ప్రత్తిపంట విరివిగనున్నను అకస్మాత్తుగా విస్త రించి ఇదివరకు ఆహారపదార్థముల బండించుభూము లన్ని టిలోను ప్రత్తిని పండించుచున్నారు. నాగపురముజిల్లా యందు సహితము ప్రత్తిపంట పెరిగి ఇబ్బడియైనది.

దక్కనులోని ఎత్తుపల్లపుభూము లన్నిటియందును ప్రత్తిపండింపబడుచున్నది. బీడవలన్నియు దున్ని ప్రత్తి నాగించిరి. ధరలయొక్క హెచ్చుతగ్గులు కనిపెట్టి రహితు ప్రత్తిని వర్తకపదార్థముగా భావించి పయిరుమీదనే బేర ములిచ్చుట కారంభించినారు. ప్రభుత్వమువారును దీనిని ప్రోత్సాహపరిచిరి. అమెరికాయుద్ధకాలములో లాంకా

పైరుయొక్క ఉపయోగమునకై ఎగుమతి నిమిత్తము ప్రభుత్వమువారు ప్రత్తిపంట పండించుటకై రైతులను ప్రోత్సాహపరచిరి. ఈప్రయత్నము లాంకషైరున కుపయోగించకపోయినను ధరలు విశేషముగ బెరిగినవి. తరువాత గూడ దూది ఎగుమతిపదార్థముగనే భావింపబడుచుండెను. రాటపుసరిశ్రమ ఆగిపోయినతోడనే పొడుగు పింజలుగల మంచిరకపుప్రత్తి మానివేసి ఏరకపుదైనను హెచ్చులాభము వచ్చుదానినిమాత్రమే పైరు పెట్టుటకు రైతు ప్రారంభించినాడు. ౧౮౭౦ వ సంవత్సరమునకు తరువాత ఇంగ్లండు ఇండియానుండి దూది తెప్పించుకొని ఇతరదేశములకు తిరిగి ఎగుమతిచేయుచు వచ్చెను. హిందూదేశపుప్రత్తికి చైనా, జపానుదేశములలో క్రొత్త మార్కెట్లు తయారయినవి. దేశములో పెరిగిన దూది యంత్రశాలలు విశేషముగ దూదిని కొనుట కారంభించినవి. అయినను ఇంగ్లండు ఇండియాలో ప్రత్తిపండించుటకు ప్రయత్నము చేయుచునేయున్నది. ప్రస్తుతము ఇంగ్లండు చాలవరకు అమెరికానుండియు ఈజిప్టునుండియు దూది తెప్పించుకొనవలసియున్నను తనకదుల్లకు దగిన పొడుగుపింజెలదూదిని ఇండియాలో పండించుటకు చేయు ప్రయత్నములను మానలేదు. ౧౯౦౯ వ సంవత్సరములో ఇంగ్లండు ప్రత్తికిమిత్తమై అమెరికాపై నాధారపడ

కుండుటకై యేమిచేయఁగలయునను సమస్యను పరిష్కా-
రించుటకే ఇండియాదూదిసంఘ మేర్పరచబడినది. హిం
దూదేశపు రయితు విశేషము పండబాడే చిన్నపింజెల
ప్రత్తినే పండించునుగాని పొడుగుపింజెల ప్రత్తిని అతనిచే
పైరుబెట్టింప జేయుట సాధ్యముకాదని కమిటీవారియెదుట
సాక్ష్యమువచ్చినను అతనిచేత పొడుగుపింజెలదూదిని పం
డించునట్లు చేయుటకు సాధనముల గనుగొనవలసినదని
సంఘమువారు శిపారసుచేసినారు. విదేశపుప్రత్తిరకము
లను లాంకషైరు నిమిత్తమై పండించుటకు పంజాబు సింధు
దేశములలో ప్రయత్నములు జరుగుచున్నవి. ఇంగ్లం
డుయొక్క అవసరము లేవో విచారించి పూర్తిచేయుట
మనపని. ఈమధ్యనే 1919వ సంవత్సరములో నియమింప
బడిన పారిశ్రామికసంఘమువారు పొడుగు పింజెందూది
నిగూర్చి చెప్పుచు "ప్రపంచముయొక్కయు ముఖ్యముగా
నింగ్లండుయొక్కయు గుడ్డలవర్తకపు దృష్టినిబట్టి యోచిం
చినయెడల (పంజాబులో చేయబడు) పరీక్షలపర్యవసానము
తేలునరకును వేచియుండుట మంచిది. విదేశవస్త్రములు
దిగుమతిచేసికొనుటకును ముతకదూది నెగుమతిచేయు
టకును ఇండియా నొక పెద్దబేరగానిని"గా జేయునిమి
త్తము ప్రభుత్వమువారు పడినపాట్లను వివరించునపుడు
ఈ మహాప్రయత్నమున రైల్వే లెంతవరకు తోడ్పడినది

తెలియజేయనియెడల విషయము కొరవడియుండును. డల్‌హౌజీప్రభువు ఇండియాదేశములో రైళ్లువేయుటను గూర్చి విలువగల తనయభిప్రాయ మిచ్చినప్పుడు రైళ్లు వేయుటయొక్క ముఖ్యోద్దేశమును వారు దాచలేదు. ఇండియాదేశపుదూదిని ఇంగ్లండున కెగుమతిచేసికొనుట కును ఇంగ్లీషువారి గుడ్డలను ఇండియాలో విచ్చలవిడిగ దేశమంతట పంచిపెట్టుటకును ఈ క్రొత్తప్రయాణసాధన ములు మిక్కిలి యుపయోగపడునని వారు సెలవిచ్చి యున్నారు. ఉత్తరహిందూస్థానములో సుప్రసిద్ధమయిన జి. ఐ. పి. ఇనుపదారికి పునాదులు వేసిన చాప్‌మన్‌గారు ౧౮౫౧ వ సంవత్సరములో ఇండియాలో ఎట్లా రైళ్లు వేసినయెడల దూది సులభముగా నింగ్లండున కెగుమతి చేయుటకు వీలగునో తెలియజేయుటకు ఒకపెద్దగ్రంథ మును వ్రాసినారు. ౧౮౫౧ వ సంవత్సరములో దేశ ములో పండుదూదిలో ౧౦౦ కోట్లు మొదలు ౩౦౦ మున్నూరుకోట్ల పౌనులు స్వదేశీపరిశ్రమలకును, 15కోట్ల పౌనులు విదేశముల యెగుమతికిని ఉపయోగపడుచుండు నది రైళ్లధర్మమా యని అంతయు ఎగుమతికి మారి నది. రైల్వేల సహాయమున వర్తకము వ్యాపించి దూదికి ధర అధికమై యెగుమతిచేయుటకు మరింత ప్రోత్సాహము గలిగించినది. ౧౮౪౩ లో పౌను

౧కి ౭౪ మైళ్లుగనుండిన అప్పటినుండి ౧౮౯౧ లో ౭ మైళ్లకు పెరిగి ఒక్కదశాబ్దములో మూడుమైళ్ళయినది. రైళ్లితరవిధముల సహితముపయోగించినవి. దేశముయొక్క హృదయాంతరాళమునకు సహితము విదేశవస్త్రములు గొనిపోవుటకు వీలయినది. స్వదేశపు అంగళ్లన్నియు విదేశవర్తకుల స్వాధీనమయినవి. స్వదేశ పరిశ్రమలహత్య సులభమయినది.

దేశమున ఆర్థికవిప్లవము గావించిన రైళ్లు దేశమున కేమియు హానిచేయకపోగా వర్తక మభివృద్ధి పరచినవని కొందరు వాదింతురు. కాని ఈవాదము నిరాధారమని సులభముగ ఋజువుచేయవచ్చును. ఇండియాలో గలిగిన ఆర్థికవిప్లవమును, ఇంగ్లండులో గలిగిన ఆర్థిక విప్లవముతో పోల్చి విమర్శించిన కారక్ వెల్ అను ఆయన ఇండియా కెట్టిహానిజరిగినదియు స్పష్టముగ విశదీకరించియున్నాడు. “ఇంగ్లండులో గలిగిన ఆర్థికవిప్లవమునకు దేశమున జనించిన శక్తులే కారణము. సంఘములో గలిగిన సంచలనమునకు సరితూగు బాహ్యాభేదములు త్వరలో సర్దుకొని ధనికశ్రామికసంబంధములు నూతన మార్గముల నవలంబించి క్రొత్తసామరస్యమును బొందును. ధనికులు పూర్వము ధనము నుపయోగించుచున్న మార్గములు మారినప్పుడు దానిని తమకు వీలయిన క్రొత్తపద్ధ

తులలో నుపయోగించి ధనము నార్జించిరి. పూర్వపువృత్తుల బోగొట్టుకొన్న పనివాండ్రు తమకై వేచియున్న పాతన పరిశ్రమలలో ప్రవేశించిరి కాని ఇండియాలో పైతరగతులవారు ఉద్యోగులుగను, సైనికులుగను, పాలకులుగను పనిచేసి ధనము సంపాదించుమార్గముల నన్నిటిని గోల్పోయిరి. రహితులకు క్రొత్తరైలుమార్గములవలన గలిగిన నష్టమునకు ప్రతిఫలములేదు. పూర్వపు పరిశ్రమ లన్నియు విదేశవర్తకపు పోటీవలన నశించుటచేత దేశములో వర్తకము వృద్ధిచేయుటకని పేరుపెట్టి వేయబడు రైళ్లు మొదలగువాని అదనపు ఖర్చును సహితము కలుపుకొని ౧౫ కోట్ల రూపాయిలపన్నును ప్రతిసంవత్సరము రహితే భరించవలసి వచ్చుచున్నది. నూతనప్రయాణసౌకర్యములు నిరాధారులైన దేశీయులయొక్క ధనమును గొనిపోవుటకై తోడ్పడినవిగాని వారిదుర్దశను తొలగించుట కేమాత్రమును సాయపడలేదు.

దీనికి ధరపెరిగి కొంత యెక్కువఆదాయము రహితులకు వచ్చినను దానితోపాటు భోజనపదార్థముల ధరలు పెరుగుటకును అదియే కారణ మయినది. ౧౮౯౦ — ౧౯౨౮ సంవత్సరముల మధ్య భోజన పదార్థములను ప్రత్తిని పండించుట కుపయోగపరచబడిన విస్తీర్ణముల బరికించినయెడల ప్రత్తిపంటలకొరకై యెంత

ఎక్కువభూమి యుపయోగించబడుచున్నదియు తేల గలదు.

| మిలియనుల ఎకరములు (మిల్లి. యను = పదిలక్షలు) | | |
|---|---|---|
| సంవత్సరము | దూది | భోజన పదార్థములు |
| ౧౮౯౨-౯3 | ౮.౯౪౫ | ౧౮౬.౭౬౧ |
| ౧౯౨౦-౨౧ | ౧౫.౩౧౮ | ౧౯౯.౬౬౭ |
| ౧౯౨౪-౨౫ | ౧౬.౪౮ | ౨౧౦.౦౦౦ |

జనాభా అభివృద్ధికి దగినట్లు భోజనపదార్థముల పండించువిస్తీర్ణముగూడ క్రమముగ వృద్ధియయిన మాట వాస్తవమేకాని ౧౮౯౨ వ సంవత్సరమునగూడ ఇండియాకు తగినన్ని భోజనపదార్థములు పండించుచుండలేదు. ఆలోప మింకను ఉండనేయున్నది. దూది మొదలయిన వర్తకపదార్థముల పంటయే వృద్ధిచేయబడుచున్నది. దూది, నార మొదలగు వానిని పండించుటవల్ల దేశమున కాకలి తీరదని మజువయిన సంవత్సరములుగూడ నున్నవి. దేశములోని మారుమూల ప్రదేశములకు గూడ ఎగుమతులు వ్యాపించి దూదిమార్కెటుయొక్కయు, మారకపు పద్ధతులయొక్కయు సెగ పల్లెటూళ్లకుగూడ గొట్టినవి.

ఇండియాలో ఆర్థికజీవితముయొక్క పాదు పల్లెటూరినుండి పట్టణమునకు మారినది. గృహజీవితముయొక్క పునాదులు కదిలిపోయినవి. వందలకొలది పల్లెటికుటుంబములు, బస్తీలు చేరుచున్నను, పడిపోవుచున్న గృహములు పల్లెటూళ్లలో నెన్నియో కన్పట్టును. ఆంగ్లప్రభుత్వ మడుగుపెట్టినతరువాత వడుకుపరిశ్రమ అంతమొందినది. ఖద్దరుకళాకౌశలమంతయు విదేశపుతెక్కలికాండ్రయొక్క అక్రమచర్యలకును ధనతృష్ణకును బలియయినది. రాటములు మూలబడుటయో, వంటచెఱకుగ నుపయోగ పడుటయో సంభవించినది. పైదేశీకులయొక్కయు ముఖ్యముగ ఆంగ్లేయులయొక్కయు, దిగుమతులు నిరాఘాటముగ దేశముప్రవేశించి స్వదేశపరిశ్రమల నంతమొందించినవి. స్వదేశపరిశ్రమలకు ప్రతిబంధములగల్పించి విదేశవర్తకులు చౌకగాదెచ్చి యమ్ముకొనుటకు ప్రయాణసౌకర్యములు గల్పింపబడినవి. పరదేశపు దిగుమతుల నెదుర్కొనుటకు స్వదేశపరిశ్రమల కేమియు చేయూత యొసంగబడలేదు. ఈపరిస్థితులలో స్వదేశపరిశ్రమలకు నాశనముగాక మఱి యేమిగతి యున్నది? మనపరిశ్రమలకు రానున్న భావిదుర్గతినిగూర్చి ౧౮౦౬వ సంవత్సరములోనే ఒకపార్లమెంటుసభ్యుడు కనులజూచినట్లు చెప్పియుండెనని విల్సనను చరిత్రకారుడు వ్రాసి

యున్నాడు. ఆజ్యోతిషము చెప్పినట్లు జరిగినది. "ఇండియా మనకుగావలసిన ముతకపదార్థములన్నిటిని ఎగుమతిచేయుట యనగా ఇండియాకు రానున్న దుర్గతిని వేగమురప్పించుట యని యర్థము. హిందువు లెగుమతిచేసిన దూదిని బెట్టియే వారికి గుడ్డలు నేసి పంపి మనకు ఓడలకూలి, ఏజంటుగా పనిచేసినందుకు జీతము, కమిషను, భీమాఖర్చు, వడుకు నేతల కగువ్యయము మొదలయినవన్నియు మిగుల్చు కొందుము. అప్పుడు హిందూదేశప్రభుత్వము స్వదేశపరిశ్రమల రక్షించుట కేమాత్రమయినను ప్రయత్నమే చేసియున్న యెడల విదేశీయుల యంత్రముయొక్కయు, కళాకౌశల్యముయొక్కయు పోటీని సులభముగా నెదుర్కొనియుండును. కాని విధినియామక మట్లులేదు. కోట్లజనుల దురవస్థయను పునాదిమీద ఆంగ్లేయవర్తకభవనము నిర్మింపబడవలసియుండెను. బర్కు మొదలగు ఆంగ్లప్రముఖులు ఇండియాలో బ్రిటిషురాజ్యమును స్థాపించుటవలన బీదరహితులకు ప్రతిదినమును కూడేర్పడునని తలంచియుండిరి. గాని అతనికుండలో నిదివరకున్న కూడు సహితము ఎండమావులలోని నీరయ్యెనని మనకు ఋజువయినది.

---

# రాట్నము - మగ్గము

———:*:———

## 3

ఇండియాలో ఖద్దరుపరిశ్రమకును యంత్రపరిశ్రమకునుగల అవకాశములు ౨౦ వ శతాబ్దముయొక్క ముఖద్వారములో మన మడుగుబెట్టినప్పుడు దేశ మంతటను యంత్రవస్త్ర ప్రవాహము వ్యాపించి రాటపు పరిశ్రమ దానిలో మునిగిపోయినది. అచ్చటచ్చట మిట్టప్రదేశములలోమాత్రము పూర్వపు ఔన్నత్యమునకును ఇటీవల వాటిల్లిన వినాశనమునకును సాక్ష్యములోయన కొద్దిరాటములు నిలిచియున్నవి. పూర్వ మత్యాదరమును బడసిన చక్కని ఖద్దరువస్త్రములు అంగళ్లనుండి తరిమివేయబడినవి. ఇండియాదేశము ప్రపంచమునకంతకును వస్త్రములు పంపుచున్న పూర్వపుటిండియా గాదు. తా నితర దేశములకు బంపుటకు మారుగా తానే ఇతరదేశములనుండి సన్నగుడ్డలు, ముతకగుడ్డలు,—తెల్లవి,అద్దినవి—అన్నియును తెప్పించుకొను చున్నది. దేశము విదేశితెక్కలికాండ్రకు వేటపట్టయినది. సుప్రసిద్ధులయిన రాజ

కేయవేత్త లెందరో ఇండియాలో బీదవాని కుటీరము లన్నియు కూలిపోవుచున్నవని ఊరక కేకలిడినవారేకాని ఈపురాతన పరిశ్రమను పునరుద్ధరణ చేయువిషయమై నేలుగదిల్చినవా రెవ్వరును లేరు. ఆకాలపు ఆర్థికభావ ధోరణి యంతయు తాసీపాలనాటి పనికిమాలిన మోటు రాటముల నపహసించుస్థితిలో నుండుటచే పునరుద్ధరణ ప్రయత్నము లెవ్వియు జరిగినవి కావు. ఇక్ష్వాకుల నాటికి దగిన రాటమునకై గతజల సేతుబంధన మేలసనియు, గతిం చినదానికై కన్నీళ్లువిడిచి ప్రయోజనము లేదనియు, లేచి నడుముకట్టి ఇప్పటి పరిస్థితుల కనువైన నూతన యంత్ర ముల సాధనముగాగొని మన కింకను నిలిచియున్న పర పతి నుపయోగించి వస్త్రపరిశ్రమకు పునఃప్రతిష్ఠగావింప వలయుననియు నిర్ధారణ చేయబడినది.

స్వదేశోద్యమము వచ్చినతరువాత దేశీయులు లోతుకు దిగి విషయమును యోచించుటకు ప్రారంభించి తమయొక్క అభివృద్ధియు మన అర్హత మీదను ఆనరణ పరిస్థితుల మీదను ఆధారపడియుండు ననియు, తత్తరపడి తెచ్చిపెట్టుకొన్న అస్వాభావికపువిజ్ఞా నమును నమ్మి పనిచేయగూడదనియు తెలిసికొనిరి. స్వయం సహాయమే మార్గమని ధృవపడినది. నూతనభావములు దేశమంతటను వ్యాపింపదొడగినవి. జాతీయకళలను,

పరిశ్రమలను వృద్ధిపొందింపవలయునను యోచనలు ప్రారంభమయ్యెను. హావెలు, ఆనందకుమారస్వామి మున్నగు కళాప్రవీణులు మగ్గపునేతను పునరుద్ధరించు మార్గముల నరయుచుండిరి. వీరుదప్ప తక్కినవారి దృష్టి మాత్రము యంత్రపరిశ్రమ వైపునకే తిరిగియుండెను. రక్షణపన్నులు, ఆర్థికచట్టములు మున్నగు ఉపాయములచే యంత్రపరిశ్రమల వృద్ధిపొందింపవలయునని ఆర్థికసంధి పత్రములలో వితర్కించుచుండిరి. చర్కా - వారిదృష్టిపథమున నింకను బడలేదు. హైందవసైనికజీవితములో చర్కాను ప్రవేశపెట్టవలయునను అద్భుతపుటూహాలు మహాత్మాగాంధిగారికి దోచినవి. ఇది వారు ప్రత్యేకముగ గనిపెట్టిన అనుపమేయమయిన సాధనము. విమర్శనధోరణిగలిగి ఆత్మపరీక్షను గావించుకొనుచు బీదలభావముల ననుసరింపగలిగి వారిబాధలకు సానుభూతి చూపగల భావోన్నతుని మానసము పల్లమునకు నీళ్ళుపారినట్లు చర్కావైపునకు బారినది. పూర్వమువారు రస్కిను టాల్‌స్టాయిల గ్రంథముల జదివినప్పుడే బీదలగు జనుల వృత్తులను గూర్చి యోచించియుందురు. చర్కాపునరుద్ధరణమునకు బోలిన దేదో దివ్యభావము బీదలదారిద్ర్యరోగమును, దాని చికిత్సనుగూడ వారిబుద్ధికి దివ్యదృష్టిద్వారా తోపించియుండును. దారిద్ర్యపీడితులకు

చర్ఖాయే కల్పతరువు. దానిని సర్వత్ర వ్యాపింపజేసి నచో దారిద్ర్య మంతరించును. వారు 1908 లో ప్రకటించిన హైందవస్వరాజ్య మనుగ్రంథములో లాయర్లను, వర్తకులను, యంత్రాలయాధికారులను రాటముపై నూలు వడుకవలసినదని కోరియున్నాడు. గాంధిలో పొంగి పొరలునట్టి కారుణ్యభావము ఘంటాపథముగ మ్రోగినది. అవసరమున్నప్పుడు పదార్థ ముత్పత్తియగునను సిద్ధాంతమే ప్రపంచమునకు శరణ్యముగాదని ధృవపరచబడినది. ధర్మము కేవలము కరుణాప్రేరితమే కాక ఆచరణీయముగను, ఆర్థికముగ సాధ్యమయినదిగను గూడ నుండవలయును. ఇట్టి మనోనిశ్చయముతో ప్రజాంగీకారమునకై చర్ఖాసిద్ధాంతము ప్రవచించబడినది.

ఇప్పుడు జాతీయనిర్మాణ కార్యక్రమములో చర్ఖా అగ్రస్థానము వహించినది. *

* 1920 వ సంవత్సరమున జరిగిన ప్రత్యేకకాంగ్రెసులో స్త్రీపురుషులును బాలబాలికలును ఆత్మశిక్షణమునకై ఖద్దరు తయారుచేసి ధరింపవలయునని తీర్మానింపబడినది. ఆ సంవత్సరముననే జరిగిన నాగపూరు కాంగ్రెసులో ఆతీర్మానమే బలపరచబడెను. 1921 వ సంవత్సరములో జరిగిన బెజవాడసభలో 20 లక్షలరాటములచే పని చేయించవలయునని నిశ్చయింపబడెను. ఢిల్లీలో జరిగిన భారతస్థాయిసంఘసభలో బాలభటులందరును నూలువడుకుట నేర్చుకొనవలసినదనియు, శాసనోల్లంఘన మవలంబింపగోరు ప్రదేశములలో 100 కి 60 మంది

అయితే ఖద్దరు దేశమునకు క్షేమకారియు ఆర్థికముగ లాభకారియు గూడానా? ఆర్థికదృష్టితో జూచినయెడల ఖద్దరుకార్యక్రమము ఆచరణయోగ్యమయినదేనా? అది యిప్పుడు జాతికి అగత్యముగ కావలసిన అవసరమున్నదా? ఈప్రశ్నలకు సరియైనజవాబియ్యగలిగినయెడల చర్ఖాకు భావిభాగ్యోదయము కలుగునని చెప్పవచ్చును. దేశములో పదార్థముల నుత్పత్తిచేయుశక్తికి సంపూర్ణమయినపనిని జూపించుచు దానిని హెచ్చించుటకుగూడ అవకాశమున్ననేకాని దేశముయొక్క క్షేమలాభములను ఆర్థికశాస్త్రానుకూలముగ నడపుచున్నట్లు చెప్ప నలవిగాదు. ఆర్థికపరిశ్రమలయొక్క ముఖ్యోద్దేశము జనులయొక్క ముఖ్యావసరములను సంతృప్తిపరచగల రూపన పదార్థసృష్టిగావించుటయేకాని కేవలధనోత్పత్తిమాత్రము

---

వంతున అక్కడచేసిన ఖద్దరు ధరింపవలెననియు తీర్మానింపబడెను. 1924 వ సంవత్సరములో మహాత్మాగాంధి విధించిపెట్టిన దరునాం కాంగ్రెసు శాఖలసభ్యులందరును రోజునకు అరగంటవంతున వడుకవలసినదనియు, 2000 గజముల సాఫైననూలును నెలకి చందాగా పంపవలసినదనియు అహమ్మదాబాదులో తీర్మానింపబడెను. ఆసంవత్సరాంతమున సభ్యులందరు నూలునే చందాగా యియ్యవలసినదని తీర్మానించిరి. ఈతీర్మాన మిప్పుడు భారతవర్షసంఘమున వర్తించుచున్నది. గాని కాంగ్రెసు సభ్యత్వమునకు మాత్రము డిప్పెనను, నూలైనను చందాగా ఇయ్యవలసినదని నిర్ణయము చేయబడినది.

గాదు. జనులయొక్క ముఖ్యావసరములనునవి వారి సాంఘికనియమముల ననుసరించియు, అభిరుచుల ననుసరించియు, ఆవరణము ననుసరించియు యేర్పడిన ఆదర్శములపై నాధారపడియుండును. ఆర్థికసిద్ధాంతము లేర్పరచు అంతస్థులును, ఆదర్శములయొక్క విలువలును జాతీయ జీవితములో వెల్లడియగు ప్రత్యేకజాతీయభావములకును అంతర్మిళితమయియుండు సాంఘికాదర్శముల పరస్పర గౌరవలాఘవములకును విశేషభిన్నముగానుండగూడదు. తత్కాలమున జనులు జీవించునట్టియు లేక పరిస్థితులనుబట్టి జీవింపవలసివచ్చునట్టియు జీవితమార్గములకును ఆర్థికమార్గములకును పొందికగలిగి యుండవలయును. జనుల కేది యవసరమో యేది కోరదగినదో నిర్ధారణ చేయవలయునన్న పరస్పరసంఘటితములగు మానవశక్తులను, భావములను ఆర్థికనైతిక ఆదర్శములను లెక్కలోనికి తెసికొనవలయును. అట్లు దీసికొనక యేర్పరచబడిన సిద్ధాంతములవలన విశేషప్రయోజన ముండదు. ఒకజాతికి వర్తించు ఆదర్శములు, ఆర్థికఅంతస్థులు మఱియొకజాతికి జతపడకపోవచ్చును. మనవంటిజాతులు కొన్ని సుష్ఠుగను, సౌఖ్యముగను జీవించుమార్గముల నారయుస్థితి కింకను రాలేదు. అసలు ఏదోవిధముగ నయిన జీవించుటకు సాధనముల వెదకికొనవలసినస్థితియందే యున్నాము. ప్రయోజన

కారోజు జీవన మెట్లుజరుగునాయని అనేకహైందవకుటుంబములకు నిత్యసమస్యగా నున్నది. గ్రామములలోనే ఆర్థికస్థిరత్వమునకు పునాదులు వేయగలిగినయెడల హిందూదేశపు ఆర్థికసమస్యను పరిష్కరించినవార మగుదుము. మనగృహములయందు పనివిషయమై యేర్పడినవిముఖత్వమును బోద్రోలి యచ్చట అర్థార్జనకు పా దేర్పరచవలయును. అప్పుడే మనకు క్షేమలాభములు సమకూడగలవు. ఆత్మవిశ్వాసము గలిగియుండుట, పదార్థముల ఉత్పత్తికి దోడ్పడుపనిచేయుట, పురుషప్రయత్నముయొక్క శక్తిని పూర్ణముగ నుపయోగించుట—ఈమూడే మన భావ్యభివృద్ధికి సాధనములు. పొరుగు కుటుంబములను పోకార్చి ఏకొద్దిమందినో భాగ్యవంతుల జేయుట గాదు మనసమస్య. సహకారము, పరస్పరసహాయము అనుధర్మములమీదనే మనజాతిని నిలువబెట్టగలము. జనులను నిర్బంధపెట్టక నూతనమార్గముల నవలంబింపజేసి పదార్థముల నుత్పత్తిచేయుశక్తిని అతిశయింపజేయుటయు, తన్మూలమున ఒకరిలాభము దీసి మఱియొకరికి బెట్టక జాతీయభాగ్యమును వృద్ధిచేయుటయు మన ఉద్యమమునకు తోడ్పడుమార్గములని చెప్పవచ్చును.

ఈ విశాలదృష్టితో జూచినయెడల చర్ఖాలోను, ఖద్దరులోను ఎట్టిశక్తు లిమిడియున్నవో బుద్ధిమంతులెల్లరు

గ్రహింపగలుగుదురు. అయినను ఖాదీయొక్క ఉపయో
గశక్తులనుగూర్చి పలువురు పలువిధములుగ అంచనా
వేయుచున్నారు. కొందరిదియొక కట్టెముక్కగను మాత్ర
మే భావించి రాజకీయప్రాముఖ్యమేమియు దీనియందు
లేదందురు. ఆర్థికముగ దీనివిలువను సందేహించువారు
గూడ కొందరు గలరు. రైట్ హానరబిల్ శ్రీనివాసశాస్త్రి
గారు రాటము ఆర్థికరీత్యా తెలియని అపసిద్ధాంతమని
సంశయాత్ములభావములను సరిగ వెల్లడించియున్నారు.
చర్కానుగూర్చి గోరంతలు కొండంతలు చేయబడినవా
లేక మనదృష్టిని బలవంతముగ నాకర్షింపగల అద్భుత
శక్తులు దీనియం దిమిడియున్నవా? దీనినిగూర్చి చెప్పిన
దంతయు స్తవమా వాస్తవమా? ఈసమస్యనుగూర్చి
బాగుగ తెలిసికొనవలయునన్న మొట్టమొదట ప్రతిపక్షుల
ఆక్షేపణల నెత్తికొని విమర్శించుట యుక్తము. నూలు
వడుకుటను, పునరుద్ధారణ చేయుటను గూర్చి వ్య
తిరేకముగా జెప్పబడిన హేతువుల నన్నిటిని బరిశీలించిన
యెడల ముఖ్యమయిన వాదనపద్ధతుల నిట్లు విడదీయ
వచ్చును. (౧) వడుకుటయే వృత్తిగా బెట్టుకొని
దినమంతయు పనిచేయువారికి కూలిగిట్టదనియు, ఏది
యో మఱియొక ప్రధానవృత్తి బెట్టుకొని దానికెత్తోడుగా
మాత్రమే దీని నుపయోగించుకొనవచ్చుననియు మొదటి

యాక్షేపణ. (౨) రెండవవృత్తిగా బెట్టుకొన దగినవియు, బీదవారల కనువయినవియు, వడుకుటకంటె నెక్కువ లాభకరములయినవియు ఇతరవృత్తు లున్నవి. (3) దేశము నకు చర్కావలన లాభమున్నదని యంగీకరించినను అది అతిస్వల్పము. (౪)చర్కా ఉపయోగకారియే యైనను ఈ కాలమున యంత్రములతో పోటీకి నిలువజాలదు. ఈ యాక్షేపణ లన్నియు వరుసగా మనము విమర్శించి చూతము.

(౧) వడుకుట ప్రధాన వృత్తిగా బెట్టుకొని దిన మంతయు వడికినయెడల తక్కినపనులయందువలె దీనిలో సరియైన కూలిగిట్టునని దానియం దెంతయభిమానమున్న వాడును వాదించుటలేదు. వడుకుటవలన రాదగిన కూలి దినమునకు రెండుమూడణాలకంటె నెప్పుడును మించదు. కరువుపనులలో గవర్నమెంటువారిచ్చుకూలి రెండణాల కంటె నెక్కువలేదుగనుక క్షామనివారణకై రాటము నిశ్శంకముగా బనికిరాగలదు. కాని మనదేశములోనున్న కోట్లకొలది వ్యవసాయికులకును, ఇతరులకును వారివారి ప్రధానవృత్తులకు జతవృత్తిగా నుపయోగపడి తగినంత లాభకారిగా నుండునా యనువిషయమునమాత్రము అభి ప్రాయభేదము లున్నవి. ఇచ్చట అభిప్రాయభేదములకును, వాదప్రతివాదములకును అవకాశ మున్నది.

వివాదమున కవకాశమియ్యని కొన్ని విషయములు గలవు. మన దేశముయొక్క దుర్భరదారిద్ర్య మట్టివిషయములలో నొకటి. దాదాభాయినౌరోజీ హైందవుల పైని కాదాయ మెంతయైనది నిర్ధారణ చేయుటకు ప్రయత్నించినది మొదలు షుమారొక డజనుమంది మదింపులు వేసియున్నారు. పలువు రార్థికపండితులు వేరువేరు కాలములలో వేసిన అంచనాల క్రింద పొందు పరచెదను.

| గ్రంథము పేరు | ఏ సంవత్సరమునకు | మొత్తపు ఆదాయము | తలసరిసంవత్సరాదాయము |
|---|---|---|---|
| | | కోట్లు రు. | రు. |
| ౧. దారిద్ర్యము అనాంగ్ల ప్రభుత్వము (దాదాభాయి) | ౧౮౬౭-౬౮ | ౩౪౦ | ౨౦ |
| ౨. ప్రభుత్వమువారి ౧౮౮౨ సం॥పు ఆర్థిక నివేదిక | ౧౮౮౧ | ౫౨౫ | ౨౭ |
| 3. ప్రోస్పరస్ బ్రిటిష్ ఇండియా (డిగ్బీ) | ౧౮౯౯ | ౪౨౯ | ౧౭. ౫ |
| ౪. కర్జనుగారి ఆర్థికపత్రము (౧౯౦౧-౨) | ౧౯౦౦ | ౬౭౫ | ౩౦ |

| | | | |
|---|---|---|---|
| ౫. ఇండియాభాగ్యము (వాడియా) | ౧౯౧౩-౧౪ | ౧౨౧౦ | ౪౪ |
| ౬. ఇండియాయొక్క భాగ్యమునన్నుయిచ్చుశక్తి (ఖంబట్ట) | ౧౯౦౧-౧౪ | ౧౧౭౬ | ౩౬. |
| | ౧౯౧౪-౨౨ | ౧౮౬౨ | ౫౮. ౫ |
| | ౧౯౦౦-౨౨ | ౧౩౮౦ | ౪౪. ౫ |
| | ౧౯౨౧-౨౨ | ౨౩౬౪ | ౭౪ |
| ౭. భారత పునర్నిర్మాణము (విశ్వేశ్వరయ్య) | ౧౯౧౧ | | ౩౬ |
| | ౧౯౧౯ | | ౪౫ |
| ౮. ఇండియా ఆదాయము | ౧౯౨౨ | | ౫౧. ౮ |
| ౯. ఇండియాఆర్థికశాస్త్రము (కేల్) | | | ౪౦ పె. |
| | | | ౪౮ ఐం. |
| ౧౦. ఆర్థిక క్షీణత | ౧౯౧౧-౧౨ | ౫౩౯ | ౨౧ |
| ౧౧. ఆర్థికశాస్త్రము (షిరాజ్)* | ౧౯౨౧ | ౨౫౯౮ | ౧౦౭ |
| | ౧౯౨౨ | ౨౬౬౮ | ౧౧౬ |

ఇండియా ఆదాయమును న్యాయముగ లెక్కించినవా రెవ్వరును తలకు నికరాదాయము రు. 50-0-0 ల కంటె నెక్కువగా వేయలేదు. * ప్రపంచమంతటిలో

* షిరాజ్ గారి లెక్కలు అతిశయోక్తిగా వేయబడినవి. పంటలు, ఇతరశాస్త్రజ్ఞులు చేసినదానికంటె రెట్టింపు వేసెను. ఆయన నికరాదాయము తీయలేదు. కొన్ని సంవత్సరముల ఆదాయముదీసి దరహాము మీద లెక్కలు దీయక ఒకసంవత్సరపు అంకెలనుబట్టియే తేల్చినారు. వ్యవసాయేతర ఆదాయమునకు లెక్క లేమియు చూపక ఊరక 883 కోట్లని వేసియున్నారు.

ఇండియా బీదదేశమని అందరు సంగీకరించిరి. అచ్చటి బీద వారిస్థితి హృదయభేదకముగ నుండును. దేశాదాయములో మూడవవంతు మొత్తము 100 కి ఒక్కరువంతున అనుభవించుచున్నారు. వారికుటుంబములకు 100కి అయిదువంతు లగుదురు. మిగిలిన 35 వంతువారికి ఆదాయములో 3 వ వంతువచ్చును. తక్కిన 60 వంతుల జనము శేషించిన మూడవవంతు ఆదాయమువలన జీవనము గడుపుకొనవలసియున్నారు. దీనిని బట్టి మిక్కిలి బీదలగు వారికి సంవత్సరమునకు తలకు రు. ౨౦ మొదలు రు. ౨౫ కంటె ఎక్కువ ఆదాయములేదు. బీదలకు కడుపు నిండ ఆహారము లేదు. జీవితమునకు అత్యవసరమయిన పదార్థములుగూడ చిక్కవు. కోట్లకొలది జనులు పస్తుల పాలై, సాంఘిక నైతికవిషయములలోసహితము క్షీణదశకు వచ్చియున్నారు. హంటరుగారు దేశజనులలో 4 కోట్లకు పూర్తియయిన ఆహారము లేదని వ్రాసియున్నారు. అన్నములేనివారిసంఖ్య ప్రతిసంవత్సరమును హెచ్చగుచున్నది. బీదలలో జీవశక్తి తక్కువగుటచేతనే మరణముల సంఖ్య హెచ్చుచున్నది. ఇండియాలో ౧౦౦౦ కి ౩౩.౪ వంతునను, జపానులో ౨౧.౯ వంతునను ఇంగ్లండులో ౧౪.౭ వంతునను ప్రతిసంవత్సరమును చనిపోవుచున్నారు. ౧౯౧౮ లో వచ్చిన విషజ్వరములవల్ల దేశములో

౮౦ లక్షలమంది చనిపోయినారు. దారిద్ర్యమే రోగమని ఒక అర్థికశాస్త్రజ్ఞుడు చెప్పియున్నాడు. ౧౮౦౦ మొదలు ౧౮౨౫ వరకు దేశములో ౬ కరువులును, (౧౮౨౫, ౧౮౫౦ సంవత్సరములమధ్య ౨ కరువులు వచ్చియుండగా ౧౮౫౧ మొదలు ౧౯౦౦ లోపల ౨౪ కరువులు వచ్చినవి. మరల మరలవచ్చు ఈకరువులవల్లనే మరణముల సంఖ్య అమితముగా పెరిగిపోవుచున్నది. వానితోపాటు దారిద్ర్యమును హెచ్చినది.

మనదేశపు జనాభాలో బహుమంది వ్యవసాయకులు, నాలిగింట ముగ్గురు భూమివల్లనే జీవనము చేయుచున్నారు. వీరి కుటుంబములకు ఇతరాదాయములు పోయినవి. వ్యవసాయపుపని సంవత్సరము పొడుగునను ఉండదు చాలకాలము వృథపుచ్చుచుందురు. ఇదియే వీరు గర్భదరిద్రులగుటకు కారణము. ౧౯౨౧ వ సంవత్సరపు జనాభానుబట్టి* జనులలో నూటికి ౭౧మంది జానపదులే.

* ఇండియాలోని పౌరులయొక్కయు, జానపదులయొక్కయు సంఖ్య తెలిసియుండుట మంచిది.

౧౯౨౧-వ సంవత్సరపు గణితి

| | | |
|---|---|---|
| ౧ | ఇండియా మొత్తపు జనసంఖ్య | ౩౧,౮౯,౪౨,౮౪౦ |
| ౨ | జానపదులు | ౨౮,౬౪,౭౬,౨౦౫ |
| ౩ | పౌరులు | ౩,౨౪,౭౫,౨౭౬ |

లేక ౧౦౦-కి ౧౦ వంతు.

వీరందరు వ్యవసాయకులే యనుటకు వీలు లేదు. కొందరు స్వయముగా కృషి చేయక భూమివల్ల వచ్చు ఆదాయము వల్ల జీవింతురు. వ్యవసాయపుకూలీలసంఖ్య పెరుగుట క్షేమకరము గాదు. ౧౯౦౧ వ సంవత్సరపుగణితినిబట్టి విశేష జనసంఖ్య గలిగి కరువులు తరుచు వచ్చుచుండు రాష్ట్రములలో భూమిలేనివాండ్రసంఖ్య అమితముగా పెరిగిపోయినది. ఇది ఆర్థికముగ జూచినయెడల మిక్కిలి అపాయకరము. సాధారణముగ పంటలుపండుసంవత్సరములలోనే వ్యవసాయపుకూలీలకు ఆదా చాలాతక్కువగుటచే స్థిరమగు జీవనము వారికి లేదు. వ్యవసాయకులలో చాలమంది చిన్నరయితులు. ఇండియాలో పెద్దరహితులసంఖ్య చాల తక్కువ. సమష్టిజీవితపద్ధతితగ్గి కుటుంబములు పలుమారు పంచుకొనుటయు, జనసంఖ్య వృద్ధియగుటయు భూమి చిన్నముక్కలుగ చీలిపోవుటకు కారణములు. ఈ పంచుకొనుటవలని నష్టము దేశమంతటను సర్వసాధారణ మయినది. ముక్కలుగా చీలుటయే కాక ఒక్కని

---

| | | |
|---|---|---|
| ౪ | పట్టణములసంఖ్య | ౨,౩౧౬ |
| ౫ | గ్రామములు | ౬,౮౫,౬౬౫ |
| ౬ | పురములలో ఇండ్లు | ౬౭,౬౫,౧౧౪ |
| ౭ | గ్రామములలో ఇండ్లు | ౫,౮౪,౩౩,౩౭౫ |

ఇండియాలో పౌరులసంఖ్య త్వరగా పెరుగుట లేదు. ౧౮౯౧లో ౧౦౦-కి ౯.౫వంతునన్ను,౧౯౨౧లో ౧౦౦-కి ౧౦.౨వంతునను ఉన్నారు.

యొక్క భూములే అనేక చీలికలుగా పలుచోట్ల నుండుట చేత వ్యవసాయమునకు వీలుగాక ఖర్చుకూడ యెక్కువయి లాభము తగ్గుచున్నది. బ్రిటిషు ఇండియాలో సాగులో నున్న భూమి ౨౨౪ కోట్ల యెకరములు. వ్యవసాయకులకు తలాయొక ఎకరమయినను లేదు. జను లతివత్తుగా నున్న బీహారులో భూమి ఆసామికి ఒక ఎకరమయినను పడదు. రయితువారీపద్ధతి అమలులోనున్న మదరాసు రాజధానిలో పెద్దపట్టాలు లేవు. సాధారణపట్టాకు ౧ మొ. ౫కంటె ఎక్కువ ఎకరము లుండవు. దక్కనులో గ్రామములు సర్వేచేసిన డాక్టరు మాన్‌గారు పట్టాలలో ౧౦౦కి ౬౦ వంతు ౫ ఎకరములకంటె లోపలివి. ౧౯౨౧-వ సంవత్సరపు బంగాళాజనాభారిపోర్టులో తాంప్సన్‌గారువ్యవసాయకునకు ౨-౭౫ఎకరములకంటెఎక్కువ లేవని తేల్చినారు. అస్సాములో ఒక్కొకపట్టా ౨౪ ఎకరములకు మించదు. పట్టా లంతచిన్నవిగనుండుటచే వ్యవసాయకులకు సంవత్సరము పొడుగున పనియుండదు. ఇదియును అందరంగీకరించిన విషయమే. గవర్నమెంటు నివేదికలసాక్ష్యము కావలసినయెడల కావలసినంత యున్నది. కొన్ని యిందు పొందుపరచెదను. ౧౯౨౧-వ సంవత్సరపు గణితరిపోర్టులో ఎడ్డీగారు "జనులలో బహుమంది వ్యవసాయకులు. వ్యవసాయమనగా సంవత్సరము

నకు రెండుపంటలు పైరుపెంచి కైలుచేసి ముగించుట. ఇంగ్లండులోమోస్తరుగా అనేకపైరులు కలిపిపెట్టరు. పైరులఊడ్పులరోజులలోను, కైలురోజులలోను, కొద్దిగా కలుపురోజులలోను పొలములకు నీళ్లుగట్టునప్పుడును విశేషముగా పనియుండునుగాని తక్కినరోజులలో నూరక కూరుచుందురు. ఆవల వర్షాధారపు భాగములలో ఒకప్పుడు నెలలకొలదియు మరికొన్నివేళల సంవత్సరమంతయును రహితులూరక ఉండవలసివచ్చుచున్నది. ఈతీరిక కాలమంతయు వృథాగా గడపబడుచున్నది" అని వ్రాసియున్నారు. ౧౯౨౧-వ సంవత్సరము మధ్యరాష్ట్రముల జనాభారిపోర్టు వ్రాసిన హంటర్‌గారు అదే అభిప్రాయమిచ్చుచున్నారు. "బహుమందికి జీవనాధారమయిన వ్యవసాయము పనివాండ్రకు సంవత్సరముపొడుగున పనియియ్యజాలదు. ఈరాష్ట్రములలో చాలచోట్ల వర్షాకాలము వెళ్లిన తరువాత ఖరీఫ్పంటయిది పెట్టబడుచున్నది. ఇదియే అక్కడి ముఖ్యమయిన పంట. అది కోసినతరువాత తిరిగి వర్షాకాలము వచ్చువరకును పనియేయుండదు." ఆ సంవత్సరపు జనాభాలోనే బంగాళమునుగూర్చి తాంప్సనుగారిట్లు చెప్పిరి: "మనుష్యునకు ౨। ఎకరములు గల వ్యవసాయము సంవత్సరములో విశేషరోజులు పట్టదు. పొలము దున్నిఊడ్చి తిరిగి నూర్చినప్పుడు రైతు కొంతవరకు

కష్టపడునుగాని మిగిలినకాలమంతయు చేతులు ముడిచి పెట్టుకొని కూరుచుండవలసినదే. పంజాబుయొక్క "క్షేమ సౌభాగ్యము"లను గ్రంథములో కాల్వర్టుగారు ఇదే అభిప్రాయమునకు రావలసివచ్చినది. "పంజాబులో వ్యవసాయకునకు ౩౬౫ రోజులలో ౧౫౦ రోజులకంటె నిండు పనిలేదు." దీనినిగూర్చి ఇంతకంటె విరళముగ జెప్ప నవసరము లేదు. మెట్టప్రదేశములలో వ్యవసాయకునకు ఆరు నెలలకంటె నెక్కువపనిలేదు. వాండ్ర ఆడువాండ్రకు కలుపుతీతలు పయిర్లకోతలరోజులలోదప్ప పనియుండదు. ఇది కాగనే యూరకకూర్చుందురు. మగవాండ్రకంటెఆడవాండ్రకెక్కువ విరామమున్నది. మఱియును వ్యవసాయకుని కష్టముయొక్కఫలము వర్షముపై నాధారపడి యున్నది. వానికి వ్యవసాయమనగా వర్షపు జూదము. సంవత్సరములో బహుకాలము పని దొరకకపోవుటచేతను, పంట వర్షముపై నాధారపడియుండుటచేతను దేశములో నిరుద్యోగమెక్కువయి దారిద్ర్యము బలమయినది. వేసినపైరు పండునని నిలువలేకపోవుటచేతను, పైరు పండినను సంవత్సరములో చాలభాగము చాలకపోవుటచేతను, పని చాలకపోవుటచేత కలుగు నిరుద్యోగస్థితికి వ్యవసాయమునకు తోడుగ జతవృత్తి లేకపోవుటయే కారణము. కనుక ఈవిషయము మనము ముఖ్య

ముగ గమనించవలసి యున్నది. ఇప్పుడునిరర్థక మగు చున్న తీరికకాలమంతయు ఉపయోగపరచుకొనుటకు చేయబడు చికిత్సలు ఒకటిరెండు జత వృత్తులను సూచించునవిగ నుండనియెడల జాడ్యమును కుదుర్చజాలవు.

ఇండియాదేశపు వ్యవసాయపరిస్థితుల గూర్చి విమర్శించినవారు వ్యవసాయకునికిపనిలేని రోజులకు పనిగల్పించి అతని ఆదాయము వృద్ధిచేయవలసినదనియు, అతడు పడుశ్రమకు ఫలితముగా అతని కన్నవస్త్రములకు లోపము లేకుండ నుండులాగు చేయవలయుననియు గ్రహింపక మానరు. మనముచేయుసూచనలు అతడేమయిన లాభకరమగు ఇతరవృత్తి నవలంబించ దలచినయెడల అడ్డము రానివిగను, పని తక్కువయిగాని, వరదలు-కరువులు-మొదలయినవి వచ్చినప్పుడుగాని ఉపయోగించునవిగను, మరియును ఇల్లు విడిచిపోవవసరము లేక తనకుటుంబములోని వారందరు కలిసి పనిచేసికొనుటకు వీలయినవిగను నుండవలయును. మనము సూచించు రెండవవృత్తి గృహపరిశ్రమలలో జేరినదై వ్యవసాయకునకు తగుపాటిలాభము నియ్యగలిగి తరుచుగా నతడును, అతని భార్యాపిల్లలును గలిసి పనిచేసికొనుటకు వీలయినదై జాతిమతాచారములకు భిన్నముగాకుండ నుండవలయును. రాటపరిశ్రమ ఈపరీక్షల కన్నిటికిని ఆగగలదైయున్నది. అది

మనపూర్వపు గ్రామసాంఘిక జీవితమునకు బాగుగసరి పడియుండును. మనకు వీలయిన అన్ని ఋతువులలో ననుసరింప దగినదియు, దేశమంతటికిని బనికి వచ్చునదియు, బహుమంది బీదలకు పని కల్పించు నదియు విద్యగాని, విశేషకౌశలముగాని అవసరము లేని దియు నగు వృత్తి యిదియే. అలహాబాదులో వ్యవసాయ కళాశాలాధికారి యగు హిగిన్బాథము అను ఆయన పన్నులసంఘము యెదుట యిచ్చినసాక్ష్యములో ఎక్కు-వయిన జనులకు జీవనము గల్పించగల గ్రామపరిశ్రమలు లేకుండుట విచారకరమని చెప్పియున్నాడు. పూర్తిగాపని లేని బహుమందికి భూమియే జీవనాధారము కావలసి వచ్చినప్పుడు కొన్ని ఋతువులలో మాత్రమే చేయుటకు వీలయిన పల్లెటూరి వృత్తులను కల్పనచేయుటయే యోగ్య మయిన పని. వ్యవసాయములకు కొంత మంచి ఆదాయ మును తీసికొనిరాగల రెండవవృత్తి యవసరమగుట స్పష్ట ము. అది అతని వ్యవసాయవృత్తివలన గలుగు క్షేమ లాభములకు ప్రతిబంధకముగ నుండగూడదు.

వ్యవసాయకుడు ఇప్పుడు పని జరుగుచున్నట్టిగాని, లేక ముందెప్పుడో స్థాపించబోవునట్టిగాని పరిశ్రమస్థానము లకు తప్పనిసరియైనపుడు దప్ప పోవుట సాధ్యము గాదు.

అతనిగ్రామమునకు పనివెచ్చి చూపినప్పుడుమాత్రమే అత
నికి సాయపడగలదని థాంప్సనుగారి అభిప్రాయము. ఇది
చర్కాప్రవేశపెట్టవలయుననిబోధించువారియొక్క వాద
మనియు అది చాలవరకు సహేతుకముగనే యున్నదని
యు థాంప్సనుగా రంగీకరించిరి. ఆయన అంతట రాట
మునకు అనుకూలవాదమనే నాస్తికవాదములో తాను
పడిపోవుచున్నట్లు భయపడి త్రిప్పకొనిస్థిమితపడి చర్కా
యొక్క నిష్ప్రయోజకత్వమును ఋజువుచేయుటకై తప్పు
దారినబడి దుర్వాదము ప్రారంభించిరి. బంగాళీవ్యవసాయ
కుడు ఆధునికజీవితపద్ధతుల కలవాటుపడి స్వల్పపుపనితో
భూమినుండి విశేషలాభము తీయుట కభ్యాసమైనాడు.
విశేషకాలహరణమునకును, ప్రయాసకును తానలవాటుపడిన
చర్కాపని కత డిచ్ఛగించునని తోచదు. ఆర్థిక దృష్టితో
చూచినయెడల చర్కా నిష్ప్రయోజనము. కానిమగ్గము
లవిషయ మట్టిదిగాదు. నేతపనివలన పెక్కుమందికి జీవన
నాధారము గల్పించుట సాధ్యము గాదనియు, దానికి
కొంత నేర్పరితనము కావలసి యుండుననియు దలంచి యేమనుటకును తోచక ఎవరయినా
ధర్మాత్ములు గ్రామములలో నారయంత్రశాలను స్థాపించి

గ్రామస్థులకు పనిగల్పించిన బాగుండునను హాస్యాస్పదమయిన సూచనతో ముగించినారు. ఒక్క నారయంత్రశాలగాదు: నూరు నారయంత్రశాలలు స్థాపించినను ఒక్కబంగాళమునకయినను చాలునా? మామూలుగా మనరహితులు క్రొత్తసూచనలకు విముఖులనియు తమ ఇండ్లకు దూరముగాపోయి పనిస్వీకరించరనియు వారితో మన మేకీభవించెదము; కాని, అతనికి వీలయిన కొన్ని ఋతువులలో మాత్రమే పనిగల్పించునది 'రాటముతప్ప. మరియొకటిలేదు. నారయంత్రశాలలు లాభకారులు గావనియు, ఒక్కొకప్పుడు దివాలా తీయుట కవకాశముగలదనియు ఒకవైపున వారంగీకరించుచుండుటచే వారిసూచనలు హాస్యాస్పదములని తేలుచున్నది. అందువల్లనే చర్కాయొక్క ఉత్కృష్టత తెల్లమగుచున్నది. చర్కావలనఅతనికి విశేషలాభము రాకపోవచ్చును. వ్యవసాయము వలన అతనికి ఎకరమునకు ౧౫ రూపాయిల నికరాదాయము వచ్చునని అంగీకరించినయెడల చర్కావల్లవచ్చు ఆదాయము అతనికి బాగుగ తోడ్పడగలిగినంతగనే యుండగలదని చెప్పవచ్చును. చర్కాలోనే అతని ఆర్థిక లాభ మిమిడియున్నది.



౫. ఏకులుచేయుట-నూలు వడకుట

వెలమపద్ధతి (దేవిడి)



౬. సన్నని నూలువడుకుట

నూలువడుకునకు నడిబొడ్డుగానుండు గ్రామములనుండి తీసిన లెక్కలనుబట్టి ఈవిషయమును ధ్రువపరచవచ్చును. వానినుండియే బలవత్తరమయిన నూతన హేతువులను గూడ రూపింపవచ్చును. స్త్రీలు వడుకును ఉపవృత్తిగా గైకొనుచున్న బీహారు, మదరాసు, పంజాబు రాష్ట్రముల లోని గ్రామములలో సాధారణముగ ఒకరొకరికి వారమునకు ఎనిమిది పది అణాల వంతున గిట్టుచున్నట్లు తెలియుచున్నది. రాటము సాధారణముగ పనిలేని ఋతువులయందే వడుకువారుగనుక కదురుకు సంవత్సరాదాయము రు. ౨౫ లకు మించదు. స్వల్పాదాయముగల బీదకుటుంబముల కిది మంచిపైరాబడియే. తమిళనాడులోనికొన్ని మాదిరిగ్రామములలో ప్రస్తుతపరిస్థితులను పరికింపగా, నీక్రిందిముఖ్యవిషయములు తేలుచున్నవి.

అనేకగ్రామములలో రాటములవలన ఇతరాదాయములవలనవచ్చుదానిలో ౧౦౦ కి ౧౨ మొదలు ౨౦ వరకు ఆదాయము వచ్చునట్లు తేలినది. పొలముపని, యింటిపని చేసికొనగా మిగిలిన తీరిక వేళలయందుమాత్రమె స్త్రీలు వడుకుచున్నారు. వడుకొకకష్టపుపనిగా నెవ్వరును భావించుచుండలేదు. కొన్నికుటుంబములలో ౨, లేక 3 రాటములు పనిజేయుచు వ్యవసాయపుఆదాయములో సగమువరకు వచ్చుచుండెను. వ్యవసాయపుపనికి పనికి

## తమిళనాడులోని ప్రస్తుతపరిస్థితులను దెలుపు పట్టి

| గ్రామము పేరు | రాట్నములు | వడుకువారల రాబడి రూ | ఇతర సంవత్సరాదాయములు | ౩వది నాల్గవ దానిలో ఎన్నోవంతు |
|---|---|---|---|---|
| పుదుప్పాలెం ప్రాంతము | | | | |
| ఉప్పుమపాలెం | ౨౫ | రూ ౭౬౦ | రూ౩౩౬౦ | ౧౨ ./. |
| శంభుపాలెం | ౨౯ | ౪౫౦ | ౩౧౬౫ | ౧౫ ./. |
| పుదియంపట్టి | ౨౦ | ౩౪౬ | ౨౬౫౦ | ౧౪ ./. |
| చితలందూరు | ౨౫ | ౩౮[illegible] | ౨౧౫౧ | ౧౮½ ./. |
| పుదుప్పాలెం | ౨౫ | ౩౩౬ | ౨౩౯౭ | ౧౮½ ./. |
| కానూరు ప్రాంతం | | | | |
| కొమారంపాలెం | ౬౦ | ౧౩౯౭ | ౯౦౦౯ | ౧౫ ./. |
| చెల్లంపాలెం | ౧౪ | ౨౪౨ | ౨౧౯౦ | ౧౨ ./. |
| ఉత్తుకుళి ప్రాంతం | | | | |
| వెలంపాలెం | ౨౫ | ౪౩౧ | ౧౪౦౦ | ౨౭½ ./. |
| పాపంపాలెం | ౬౭ | ౧౨౦౫ | ౫[illegible]౨౦ | ౨౩ ./. |
| శంఖంపాలెం | ౧౪ | ౩౮౨ | ౨౬౭౨ | ౧[illegible] ./. |

రాని ముదుసళ్లును, పిల్లలును వడికి జాతీయాదాయమును వృద్ధిజేయుచుండిరి. నీటియెద్దడివలనను కరవువలనను కష్టకాలము సంభవించినప్పుడు రాట్నమున కెక్కువ ప్రాముఖ్యమువచ్చుచుండెను. మెట్టయూళ్లలోగూడ పైవిధముగనే లెక్కలు వేసినయెడల పైఫలితములే తేలవచ్చును. వ్యవసాయమునకు వడుకు మంచి ఉపవృత్తియని స్పష్టపడినది. మఱియొక టేదియు దీనికిసరియైనది లేదు. దేశముయొక్క-

అన్ని భాగములకు తగియున్నది.వ్యవసాయమునకు తోడు వృత్తి అవసరము. వ్యవసాయకుని దారిద్ర్యమునుండియు అప్పులనుండియు దరిజేర్పగలది మఱియొకటి లేదు.

రాటము మొదలయిన పూర్వకాలపు మోటు వృత్తులు నశించిపోయినను వాటిస్థానమున నున్నితపు పనిముట్లును, సులభమయిన ప్రయాణ సౌకర్యములును గలిగి జనులకు క్రొత్తజీవనోపాధులు గలిగినవనుట వాస్తవము గాదు. వాస్తవమువిచారించినయెడల నిరుద్యోగత యేటా వృద్ధియై దానినెదుర్కొనుటకు దారిదోచకున్నది.పూర్వకాలపు నాటువృత్తులు నశించుటచేత వానివలన జీవించుచుండినవారిలో పదపవంతున కయినను క్రొత్త నాగరక వృత్తులవలన జీవనము బేర్పడలేదు. వ్యవసాయకునకుదారిద్ర్యవిముక్తి పోయినకొద్దీ దూరమగుచున్నది. విచారించినకొద్దీ నిస్పృహత్వమే గలుగుచున్నది గాని దారి చిక్కుటలేదు. వృత్తులయొక్కయు,ఆదాయములయొక్కయు లెక్కలను పరిశీలించినయెడల సందేహములన్నియు నివర్తి కాగలవు.

*వృత్తి

౧. వ్యవసాయము

దానివలన జీవించు జనాభా ౧౦౦ కి ౭౯ వీరిలో ౧౦౦కి ౪౫ పనిజేయువారు, ౫౫ వారిపై నాధారపడువారు,

---

*1921-వ సంవత్సర జనాభా ప్రకారము వివిధవృత్తులవలన జీవించువారి వైనము.

| | |
|---|---|
| I. మూలికపదార్థముల ఉత్పత్తి | ౨౩౧౯౪౪౦౩ |
| ౧ వ్యవసాయము, పశుపాలనము | ౨౨౯౦౪౫౧౧౯ |
| ౨ చేపలుపట్టుట—వేట | ౧౬౦౭౩౩౧ |
| II. ఖనిజములు తీయుట— | ౫౪౨౦౫౩ |
| ౧ లోహపుగనులు | ౩౯౮౯౬౮౨ |
| ౨ రాతిక్వారీలు | ౭౪౬౪౫ |
| ౩ ఉప్పు | ౬౮౧౪౦ |
| ౪ వస్తునిర్మాణము | ౫౫౬౧౨౬౯౪ |
| III. పరిశ్రమలు— | ౩౩౧౬౭౧౦౮ |
| ౧ నూలుయంత్రములు | ౭౮౪౭౮౨౯ |
| ౨ చర్మము, కొమ్ము, దంతము మొదలగునవి | ౭౩౧౧౨౪ |
| ౩ కలప | ౩౬౧౩౫౮౩ |
| ౪ లోహములు | ౧౮౦౨౨౦౮ |
| ౫ పశువులవాణి | ౨౨౧౫౦౪౧ |
| ౬ రసాయనపదార్థములు | ౧౧౯౪౨౬౩ |
| ౭ భోజనపదార్థనిర్మాణము | ౩౧౦౦౩౬౧ |
| ౮ అలంకారములు | ౭౪౨౫౨౧౩ |
| ౯ గృహోపకరణములు | ౨౭౦౬౫ |
| ౧౦ వాస్తుపరిశ్రమ | ౧౭౫౩౭౨౧ |

| | |
|---|---|
| ౧౧ వాహననిర్మాణము | ౫౨౭౯౩ |
| ౧౨ ప్రకృతిశక్త్యుత్పత్తి | ౨౪౮౮౧ |
| ౧౩ ఇతరవృత్తులు | ౩౩౭౮౯౩౭ |
| **IV.** వాహనము— | |
| ౧ వాయువిమానము | ౬౨౯ |
| ౨ జలయానము | ౭౪౫౩౯౯ |
| ౩ రోడ్లు | ౨౧౪౫౯౪౯ |
| ౪ రైళ్లు | ౧౨౩౨౬౭౨ |
| ౫ టపా, తంతి, టెలిఫోను | ౨౦౭౪౦౫ |
| **V.** వర్తకము— | |
| ౧ బ్యాంకులు, భీమాలు | ౯౯౩౪౯౨ |
| ౨ సరారితనము | ౨౪౨౬౭౮ |
| ౩ వస్త్రవ్యాపారము | ౧౨౮౬౨౭౭ |
| ౪ చర్మవ్యాపారము | ౨౮౩౮౬౨ |
| ౫ కలపవర్తకము | ౨౨౭౬౬౭ |
| ౬ లోహవ్యాపారము | ౬౪౧౬౮౮ |
| ౭ కుండలు, ఇటికెలు, పెంకులు | ౬౨౪౯౮ |
| ౮ రసాయనవస్తువ్యాపారము | ౧౨౦౦౨౮ |
| ౯ కాఫీ భోజన హోటళ్లు | ౭౦౬౩౩౨ |
| ౧౦ ఇతర భోజనపదార్థ వ్యాపారము | ౯౨౮౨౬౫౧ |
| ౧౧ కుట్టినగుడ్డల వ్యాపారము | ౨౮౪౮౬౮ |
| ౧౨ గృహోపకరణ వ్యాపారము | ౧౭౩౧౮౮ |
| ౧౩ గృహనిర్మాణ వస్తువ్యాపారము | ౭౬౮౧౦ |
| ౧౪ వాహనముల వ్యాపారము | ౩౩౧౯౦౧ |
| ౧౫ వంటచెఱకు వ్యాపారము | ౫౧౯౨౯౬ |

౨. కట్టుబాట్లుగల పరిశ్రమలు ౧%
౩. వర్తకము ౬%
౪. భారవహనము ౨%
౫. పాలనము ౨%

---

| | |
|---|---|
| ౧౬ భోగ్యవస్తువులు, కళలకు సంబంధించినవస్తువులు | ౪౫౯౮౬౮ |
| ౧౭ ఇతర వర్తకము | ౩౦౪౮౫౭౦ |
| **VI.** సేన— | |
| ౧ సేన | ౨౧౮౧౫౯౭ |
| ౨ నౌకాసైన్యము | ౫౭౧ |
| ౩ విమానదళము | ౯౦౩౩ |
| ౪ పోలీసుదళము | ౧౪౨౨౬౧౦ |
| **VII.** ౧ ప్రజాపాలనము | ౨౬౪౩౮౮౨ |
| **VIII.** పండితవృత్తులు— | |
| ౧ మతము | ౨౪౫౨౬౧౪ |
| ౨ న్యాయవాదము | ౩౩౬౫౧౦ |
| ౩ వైద్యము | ౬౫౯౫౮౩ |
| ౪ ఉపాధ్యాయత్వము | ౮౧౫౨౨౮ |
| ౫ ఇతరశాస్త్రజ్ఞులు | ౭౬౧౬౩ |
| **IX.** ఇతరవృత్తులు— | |
| ౧ ఆదాయమీదజీవనం | ౪౭౯౮౩౫ |
| ౨ గృహసేవకము | ౪౫౭౦౧౫౧ |
| ౩ ఇతరవృత్తులు | ౧౧౦౯౮౫౬౬ |
| **X.** వ్యర్థజీవులు— | |
| ౧ ఖయిదీలు, పిచ్చివాండ్లు | ౧౪౫౪౬౭ |
| ౨ బిచ్చగాండ్లు, వ్యభిచారిణులు, దేశద్రిమ్మరులు | ౩౦౨౦౬౮౦ |

తక్కినవారికి నియమితవృత్తులు లేవు. జనాభా లెక్కలలో నుదాహరించినట్లు ఆదాయములేని యింటి పని జేసికొనుచుందురు. అనగా సోమరులుగా నుందురని మృదువుగా జెప్పుట.

౧౯౨౧ వ సంవత్సరపు జనాభా లెక్కలను ౧౯౧౧ వ సంవత్సరపు జనాభా లెక్కలతో బోల్చిచూచినయెడల వ్యవసాయకులసంఖ్య మొత్తపుజనాభా యభివృద్ధికంటె ఎక్కువయినట్లు గనుపడును. పరిశ్రమలవల్ల జీవించువారిసంఖ్య చాలవరకు తగ్గినది. ప్రధానపరిశ్రమలలో వస్త్రకారులు, కుమ్మరులు, లోహకారులు, వడ్రంగులయొక్కసంఖ్య మిక్కిలి క్షీణించినది.

గ్రామములలో కృషీవలునిపై నాధారపడి జీవనము జేయు జనులసంఖ్య క్రమముగ నధికమగుచున్నది. అందుచే భూముల ఫలసాయమువలన జీవించువారి సంఖ్య పెరుగుచున్నది. జనులలో ౧౦౦ కి ౯౦ మంది ప్రత్యక్షముగనో పరోక్షముగనో భూమిమీదజీవించుచున్నారు. అందుచే వారికి చాలినంతపని లేదు. ప్రతిదినమును అనేకగంటలు పనిలేక ఊరకుందురు. కట్టుబాట్లుగల పరిశ్రమలవృద్ధిజేయుటవలన ఇంతవరకు ౧౦౦కి ౧ వంతున మాత్రమే జీవన మేర్పడినది. ఇంకను ౨౦ సంవత్సరము లీవిధముగ నీపరిశ్రమ లభివృద్ధి యయినను నిరుద్యోగు

లలో బహుమందికి జీవనాధారము లేక నేయుందురు. నూలు వడుకుటదప్ప ఇంతలో బహుజనులకు తీరికసమయములో పనిజేయుట కుపకరించు ఇతరచేతిపనులుగన్పట్టవు. నూలు వడకడము నశించుటవలన గలిగిన పెద్దలోప మింతవరకు నివర్తి కానేలేదు. తిరిగి ఆవృత్తినే పునరుద్ధారణ చేసిన దప్ప ఆస్థానము నాక్రమించగల మఱియొక వృత్తి గన్పట్టదు. నూలువడుకుటయును, దానికి చేరికగల ఇతరవృత్తులునే ఈలోపమును నివర్తిచేయగల వని గత నాలుగు సంవత్సరముల యనుభవమువలన మనకు రుజువయినది. ఇతరవృత్తులేమియు లేకపోవుటచే గాబోలు పల్లెటూరివారావృత్తిని విడువలేదు. వ్యవహారజ్ఞానము లేకనో, సరియయినయేర్పాట్లు కుదురకనో నూలువడుకుట నిలిచిపోయినప్పుడెల్లను వడుకువారు మిక్కిలి నష్టపడి తమరాటమునకు మంచిరోజులు వచ్చునిమిత్తమై వేచియుందురు.

వడకడము వ్యవసాయముయొక్కయు, ఇతరవృత్తులయొక్కయు సర్వతోముఖమయిన అభివృద్ధికి సర్వవిధముల ప్రతిబంధకమని వాదించువారుగూడ గలరు. ప్రభుత్వమువారుగూడ వ్యవసాయకునియెడ సానుభూతి గనుపరచునట్లు నటించి యీవాదమునే అవలంబించుచు దేశక్షేమాభిలాషు లెల్లరును వ్యవసాయమునకే తోడ్పడవలసినదని సలహా యిచ్చుచున్నారు. ఇతరవృత్తుల యభి

వృద్ధికి వడకడము ప్రతిబంధకమనే దుర్వాదమును మనము సులభముగ బయటపెట్టవచ్చును. వడకడము గృహమునకు స్థిమితము గలిగించి, గృహస్థులయం దింతవరకు దాగియున్న శక్తులను బయటికిదీసి, పదార్థముల ఉత్పత్తికి అనువుపరచి ఇతరవృత్తులకు తోడ్పడునని మనము స్పష్టముగ రుజువు చేయవచ్చును. వ్యవసాయముయొక్క స్థితిగతులను పూర్వమునకంటె యెక్కువ విమర్శదృష్టితో విచారించి చూతము.

౧౯౨౧ వ సంవత్సరములో వ్యవసాయ పరిస్థితు లీవిధముగ నున్నవి:

| | ఎకరములు |
|---|---|
| ౧. సర్వే డిపార్టుమెంటువారి లెక్క ప్రకారము గుడికట్టు | ౬౬,౬౬,౧౦,౦౦౦ |
| ౨. గ్రామస్థుల లెక్కదాఖలా | ౬౬,౩౫,౦౮,౦౦౦ |
| ౩. అడవుల క్రింద | ౮,౫౪,౧౯,౦౦౦ |
| ౪. వ్యవసాయమునకు లాయఖయిన బంజరు | ౧౫,౧౧,౭౩,౦౦౦ |
| ౫. వ్యవసాయమునకు నాలాయఖయిన బంజరు | ౧౫,౩౧,౩౮,౦౦౦ |
| ౬. బాడవలు | ౫,౦౫,౫౪,౦౦౦ |
| ౭. విత్తిన విస్తీర్ణము | ౨౨,౩౧,౮౪,౦౦౦ |
| ౮. మాగాణి | ౪,౭౭,౯౦,౦౦౦ |

దేశవిస్తీర్ణములో మూడవవంతుమాత్రమే సాగగుచున్నదని స్పష్టమగును. వ్యవసాయమునకు లాయఖుయిన బంజరుసాగులో మూట రెండువంతులకంటె మించదు. ఈబంజరు మంచిభూమియై యుండదు. సాగులోనికి దీనినంతయు తెచ్చినా వ్యవసాయకులకు తలకు $\frac{1}{2}$ ఎకరము మాత్రమే రాగలదు. దీనినంతయు సాగులోనికి తెచ్చుట సులభసాధ్యము గాదు. ప్రభుత్వమువారు విశేషముగ ధనసహాయము చేయనిది సాగుచేయుట కవసగమయిన మూలధనమును, పశువులును, కొరముట్లును వ్యవసాయకునికి లేవు. ఇదిగాక బంజర్లలో చెట్లు, పొదలు కొట్టి సాగుచేయుటకు రెండుమూడు తరములు పట్టును. ఇదివరకు జరుగుచున్న దానికంటె ఎక్కువ త్వరగా క్రొత్తభూములు సాగుచేయుట సాధ్యముగాదు. భూములను భాగించుకొనడముచేత దేశములో పెద్దవ్యవసాయములకు వీలు లేదు. భూమిమీద ఒత్తిడి యెక్కువగుచున్నది. ప్రతిదియు భూమివలన రావలసియుండుటచేత దానికి విశ్రాంతితగ్గి క్రమముగనిస్సారమై తక్కువపంటలు పండుచున్నవి. మంచిభూములన్నియు నిదివరకేసాగులోకి వచ్చినవి. ధనాభావముచేత కొద్దిభూమివలన ఎక్కువ రక్షించేయుటకు వీలుగాకున్నది. బీదతనముచే రహితుభూమికి తగినంత ఎరువు వేయజాలకున్నాడు. అందువల్ల

పంట తక్కువయినది. నైట్రోజను అను ఎరువుపదార్థము తగ్గిపోవుటవలన కృషికి మితిలేనినష్టము వాటిల్లినది. దేశములో వంటచెరుకు లేక పేడను పిడకలుజేసి కాల్చివేయుచున్నారు. అందుచే నైట్రోజను బొత్తిగా తగ్గిపోయినది. ఏటా చమురుగింజలు ఆహారపదార్థములు ఎముకలు తోళ్లు మొదలయిన జంతుపదార్థముల రూపమున నైట్రోజను విశేషముగా ఇతరదేశముల కెగుమతియగుచు దీనికి బదులుగా ఎరువులేవియు దిగుమతియగుటలేదు. ఇకముందు వ్యవసాయ మభివృద్ధికావలయునన్న మూడు ముఖ్యవిషయములు గమనించవలసియున్నది: నీటిపారుదల ఎక్కువజేయుట, నైట్రోజను ఎరువుల నభివృద్ధిజేయుట, వ్యవసాయపు పనులలో నాగరక పద్ధతుల నవలంబించుట—ఈ మూడు ఇంతలో సాధ్యమయ్యేటట్టు గనుపట్టదు. నీటిపారుదలవిషయమై అభివృద్ధిసూచనలెవ్వియు గాన్పించవు. ఇప్పుడాలోచనలోనున్న సూచనలన్నియు కార్యరూపము జెందినను ౯౦ లక్షల ఎకరములకంటె ఎక్కువగా నీటిపారుదల కాజాలదు. ఇటీవల జరిగిన వ్యవసాయాభివృద్ధి వలన ఫలసాయమేమియు అధికము కాలేదు. పదిసంవత్సరములలో జరిగిన పనులకు ఫలముగా వ్యవసాయకులకు 34 కోట్లరూపాయల ఆదాయము మాత్రమే ఎక్కువయినదని మెకెన్నా అను ఆయన వ్రాయుచున్నాడు.

దేశమునకు మొత్తముమీద వ్యవసాయమూలమున ఏటా ౧౦౦౦ కోట్ల రూపాయల ఆదాయ వచ్చుచుండుటచే 3౪ కోట్లాకలెక్కలోనిది గాదు. ఆదాయవిషయమై యిటులుండగా వ్యవసాయకుడు క్రమక్రమముగా అప్పులలో మునిగిపోవుచున్నాడు. ౧౯౧౧ లో వ్యవసాయకులు బాకీపడిన మొత్తము 3౦౦ కోట్లని మెక్లేగనుగారు అంచనా వేసియున్నారు. కాని ఈమొత్తము చాలా తగ్గించి వేయబడినది. దానినిగూర్చి మన మిట చర్చింపబనిలేదు. కాని మునుపటికంటె వ్యవసాయకుని యప్పు లిప్పుడు చాలా ఎక్కువయినవని చెప్పకతప్పదు. అప్పులు వృద్ధియగుచున్నవి. వడ్డీ మితి దప్పియున్నది. వ్యవసాయకుని స్థితి యీ విధముగానున్నది. వ్యవసాయకుని దుస్థితిచే కోట్లకొలది జనులు ఉపవాసములపాలగుచున్నారు. దేశపరిస్థితుల ననుసరించి మన దేశములో వ్యవసాయాభివృద్ధి మందముగా నుండకతప్పదు. పన్ను నిమిత్తమును వర్తకముకొరకును భూమిని ప్రధానసాధనముగా నెంచుకొనుచున్న విదేశప్రభుత్వములో వ్యవసాయము ఎక్కువ అభివృద్ధిని గాంచజాలదు. ప్రతిస్వల్పవిషయమున వ్యవసాయశాస్త్రజ్ఞునిసహాయ మత్యవసరమైయున్నది. అదిగాక వ్యవసాయకునికి పనిలేనిరోజులలో పనిగల్పించవలసిన విషయమట్లే నిలిచియున్నది. తగుపరి

ష్కారము చేయవలసియున్నది. వ్యవసాయకునకును అతని కుటుంబమునకును తీరవుకాలములో చేదోడుగా నుండులాగునను జీవితావసరముల కుపకరించులాగునను ఇల్లువిడిచిపో నవసరములేని కుటుంబవృత్తి కనుగొనవలసియున్నది. వ్యవసాయమున కనుబంధముగా నుండుటకును దరిద్రోపహతమయిన కుటుంబమునకు సాయపడుటకును తగినవృద్ధి నూలువడకడమే. కుటుంబ మొక రాటముకొంటే వ్యవసాయమునకై కొంతభూమి కొన్నట్టె. ఎండవాన లను భేదములేక రాట మెల్లప్పుడును కుటుంబమునకు సంపాదించి పెట్టుచుండును.

రాటపరిశ్రమను తిరిగి యవలంబించుట యనగా కుటుంబముయొక్క ముఖ్యావసరమును గుర్తించుటయే. కాని యీసందర్భమున నొక ప్రశ్న పుట్టకమానదు. వడకడమువలన తగినంత ఆదా వచ్చునా? జాతీయ ఆదాయమును వృద్ధిపరచగలదా? కేల్ అనుఆయన రాటపరిశ్రమ జయప్రదముగా సాగినను దానివలన వచ్చు ఆదాయము అతిస్వల్ప మనియు జనాభా మొత్తముమీద పంచివేసిన యెడల తలకు రు. 1-6-0 కంటె నెక్కువ రాదనియు రుజువుపరచుటకై మిక్కిలి పట్టుదలతో ప్రయత్నించినాడు. ఇది దుర్వాదము. ఇంతమాత్రముచేత చర్ఖాయొక్క విలువ తగ్గజాలదు. ఆర్థికముగ జూచినయెడల

కేలుగారు వేసిన లెక్కలలో చాలతప్పులున్నవి. విదేశ వస్త్రములను తెప్పించుకొనుటవలన అయ్యేదిగుమతిఖర్చులును దిగుమతియైనవాటిని దేశములలో వివిధభాగములకు కొనిపోవుట కయ్యే బాడుగవగయిరా ఖర్చులునువారు గమనించలేదు. మఱియును వస్త్రములను దేశములో వడికి నేయించుకొనేయెడల దేశములోపండేపత్తికోస్తా బేరముల దిగుమతులతో నిమిత్తములేక ఎడతెఱపిలేక దేశములోనే ఖర్చవుచుండును. లక్షలకొలది మూలధనము విదేశవర్తకములో వెచ్చించనవసరములేక నదియ్యెల్లను ఇతర పదార్థముల నుత్పత్తిచేసికొనుట కుపయోగించును. అన్నిటికంటెను ఎక్కువనష్టము వస్త్రములెగుమతిజేయుచుండిన దేశము దిగుమతి జేసికొనవలసి వచ్చుటచే పరిస్థితులు తారుమారగుటవలన గలుగుచున్నది. కేలుగారు మఱి యొకసంగతిగూడ బొత్తిగా మఱచిపోయినారు. వడుకుట వలన గలుగుసౌకర్యముల నన్నిటిని గలిగించగల మరి యొకవృత్తిలేదని తనవాదసౌకర్యమునకై మఱపుచెందిరి. మన దిగుమతులలో మూడవవంతు విదేశవస్త్రములే. పల్లెటూరివారికి పనిలేనిసమయములో నక్కరకువచ్చి దేశమున కెక్కువ ఆదా సమకూర్చగల మఱియొక వృత్తిని వారు చూపగలిగినయెడల వారు వేసిచూపిన లెక్కలు కొంత ప్రయోజనకారిగ నుండెడివి. హిందువుల గ్రామ

జీవితమునకును సాంఘికాచారములకును వడుకు మిక్కిలి తగి యున్నది. అది సులభముగ నేర్చుకొనదగినది. స్వల్ప మూలధనముతో సాగింపనచ్చును. అదియునుగాక పల్లె ఊళ్లలో నవలంబింపదగినదియు, తీరిక యున్నప్పు డవలంబించుటకును, లేనప్పుడు మానివేయుటకునువీలయినది. వ్యవసాయకుని కుటుంబములోనివా రెల్లరును అవలంబించుచు మఱియెక్కువ ఆదా రాకపోయినను మంచి ఆదా పొందదగినది. కరవుకాలములో కొంతపుష్టి నిచ్చి రహితు పుంజుకొనుటకు వీలయినది. జాతీయదృష్టితో విచారించినయెడల వడుకువలన దేశధనము విస్తారముగ అభివృద్ధియై దినక్రమమున క్షీణించిపోవుచు దేశమును నీరసింపజేయుచున్న ధాతునష్టము నిలిచిపోగలదు. ప్రత్యేక వ్యక్తియొక్క దృష్టితో విచారించినయెడల వడుకువలన యెక్కువతృప్తికరమగు లాభము కనుపడుచున్నది. దేశ ధనము జనులందరిలో సమముగ విభాగించబడి బీదవాని ఆదాయము వృద్ధియై యతనిస్థితి బాగుపడగలదు.

వడుకును, నేతను పునర్జీవింపజేయుటవలన వచ్చు లాభము లీక్రింద క్లుప్తముగ నుదాహరించబడును.

౧. సంవత్సరములో 3 మొదలు ౬ నెలల వరకును పనిలేక ఊరకుండవలసిన వ్యవసాయకునకును, వాని కుటుంబమునకును తోడువృత్తిగా నుపయోగించుట

కిది మిక్కిలి తగియున్నది. కరవురోజులలో ప్రధానవృత్తిగా నవలంబించుటకును పనికిరాగలదు. వదురు వ్యాపింపజేయుటయనగా వృథాయగుచున్న మానవశక్తినంతయు పనిలోనికిని, భాగ్యములోనికిని మార్చుట.

౨. ఇండియాదేశమునుండి విదేశములకు వరద పొర్లుగా కొట్టుకొనిపోవుచున్న ధనప్రవాహమునకు అడ్డుకట్టబడును. కనీసము ౬౦ కోట్లధనము ఇండియాకు లాభముక్రింద నిలుచును. పనిలేక మొద్దుపారిపోవుచున్న చేతులకు చలనముకలిగి చేతిపనులలో నేర్పు పెంపగును.

౩. తన్మూలమున దేశీయులకు భోజనమునకుతరువాత ముఖ్యావసరమగు వస్త్రము నిర్మింపబడును.

౪. ఈవృత్తి సులభముగ నేర్చుకొని ఆచరించుటకువీలయినది. పురుషులకు స్త్రీలకుబిడ్డలకుపనిగలుగును.

౫. అందరును అవలంబింపదగిన వృత్తి యిదియే. జాతీయసౌభాగ్యము నొక్కత్రుటిలో వృద్ధియొనర్పగలదు.

౬. దీనిని వృద్ధిబొందించుటకు మఱియొకవృత్తిని నాశమొందింప బనిలేదు. ఇతరపనుల కడ్డమురాక తీరిక సమయములలో నవలంబింపదగియున్నది. మనమేమియు చేయజాలమను మనమనస్సులలోని గిలిని పోగొట్టి జాతి

యొక్క బుద్ధిప్రతిభను వృద్ధిపొందించి జనులు పూనికతో పట్టువిడువక పనిజేయుట కలవఅచును.

హిందూదేశపు ఆర్థికసమస్యలు గ్రామజీవితమునకు సంబంధించియున్నవి. గ్రామవాసులయందు విలీనమైయున్న కార్మికశక్తినంతయు నుపయోగింపగల దేది యయినను ప్రబలమయిన ఆర్థికసాధనమే యని యంగీకరింపక తప్పదు. బొంబాయివాస్తవ్యులయిన పండిత షా గారు చర్ఖానుగూర్చి తన రెండు గ్రంథములలోను రెండు స్థలములలో ప్రస్తావించియున్నారు. వారు మొదటి గ్రంథములో మగ్గమునకును, రాటమునకును భేదమును గ్రహింపజాలక గందరగోళపడి తమ యసమర్థతను వెల్లడిచేసికొనిరి. "సౌభాగ్యము, పన్నునిచ్చుశక్తి" అను వారి రెండవ గ్రంథములో చర్ఖాను వారు ఖండించ ప్రయత్నించి స్వసహాయవృత్తిగా నది గొంతవరకుపనికివచ్చునని యంగీకరించినను చర్ఖావాదమువలన జాతియొక్క చేతగానితనమును, నిస్సృహత్వమును వెల్లడియగుచున్నవనియు, రాజకీయవేత్తలు ఈ పనికిమాలిన ప్రాత సాధనమును శరణ్యముగా గొనుటచే జనులు వ్యవసాయమును విడి పనికిమాలిన యీ రాటపుబొమ్మనుబెట్టి యాడుకొని లాభము సంపాదింపబో రనియు ఆక్షేపించి యున్నారు. చర్ఖాను అభిమానించిన రాజకీయవేత్త లెవ్వరును జను

లను వ్యవసాయపుపనులను మాన్పించి రాటపరిశ్రమలో బెట్ట నుద్దేశింపలేదని వెంటనే వీరికి జవా బియ్యవచ్చును. జనులు తమభూమిని విడువకయే వ్యవసాయపుపనులులేక తీరికగలిగిన రోజులయందే నూలు వడుకుదురు. షహా గారు వ్యవసాయమునకు సరిపోగా మిగిలిన గ్రామవాసుల కందరికి చర్ఖాకుబదులు అస్సాము మొదలగు దేశములలో తేయాకు మొదలగువానియొక్క క్రొత్తపంటలను కల్పించ వలసినదనియు, బర్మా, బీహారు మున్నగు రాష్ట్రములలో అడవులు,గనులు మొదలగువానియందు జీవనము జూప వలసినదనియు, క్రొత్తపరిశ్రమల స్థాపింపవలసిన దనియు వ్రాసియున్నారు. షాగారి సూచనలను అంగీకరించినను అవి తాత్కాలికపుపనులుగాక అనేక తరములవరకు జీవ నము గల్పించునవై యుండుటచే అవి చర్ఖాస్థానమును వహింపజాలవు. షాగారి సూచనలలో మదరాసున కేది యు దారిజూపలేదు. వీరు దేశమునువిడిచి యే బర్మాకో వలసపోయి యచ్చటివారితో కలసిపోవలయు నని వారి యాశయము. కనుక వారిసూచనలు హాస్యాస్పదములు. జనసమూహములను ఢిల్లినుండి దౌలతాబాదునకు మా ర్చినపిచ్చిచక్రవర్తియొక్క ఊహలను దలపించుచున్నవి.

ఈతర్కమంతయు జరిగిన తరువాత సహితము రాటము మూలమున ఇండియాకు కావలసిన వస్త్రము

లన్నియు చేయుటసాధ్యముగా యనియు, అనగా ఈ కాలపు యంత్రములముందు రాటముపోటీకినిలువగలదాయనియు చర్చించవలసియున్నది. ఒకవిధముగా యోచించినయెడల ఖద్దరుకును, మిల్లుగుడ్డలకును పోటీపెట్టుటకే వీలులేదు. వంటకును వస్త్రమునకును వర్తకసరళిగా కూలికి విలువ గట్టుటకే వీలులేదు. బయటి ఆర్థికసిద్ధాంతములను ఈ రెంటికిని వర్తింపజేయగూడదు. కడుపునకు తించె ఖర్చు యిపోవునని యెట్లనుకొనమో అట్లేరాటముయంత్రమున కంటె నష్టదాయకమని అనుకొనగూడదు. మరియొక దృష్టితో యోచించినయెడల రెంటికిని సంపూర్ణమయిన పోటీ ఉన్నదనియే యెంచవలసియున్నది. వడుకును పునర్జీవింపజేయుటయొక్క ముఖ్యోద్దేశము జాతిలో నిద్రాణమై యున్న పారిశ్రామికశక్తిను త్తేజింపజేయుటయేయని మరచ గూడదు. వడుకును మానుటయనగా జాతికి ఒక అవయవము పోయినట్లె యెంచవలసి యున్నది. భిన్నమయిన అవయవమును కట్టుకొనజేయుటకే యిప్పుడు మనము చేయుప్రయత్నమంతయునని గ్రహింపవలయును. యంత్రశక్తిముందు రాటము నిలుచునాయను ప్రశ్నకు జవాబు వడుకును దేశములో విరివిగ వ్యాపింపజేయ సాధ్యమగునా యనియు, జనులలో సర్వత్ర వ్యాపింపజేయ వలను పడునా యను ప్రశ్నల కియ్యగల జవాబులపై నాధార

పడియుండును. వడుకును దేశమంతట వ్యాపింప జేయుటకు సౌకర్యము లెన్నియో కలవు. సర్వసామాన్యముగ నుండు నీసౌకర్యముల గొన్నిటి నుదాహరించెదను.

౧. స్త్రీ తన స్వంతపొలములోనో, లేక ఇరుగుపొరుగుననో పైరగుట.

౨. రాటము ప్రతిగ్రామములోను చేయించుకొనుటకును, చెడిపోయినచో బాగుచేయించుకొనుటకును వీలయిన తేలికపనిముట్టుగా నుండుట.

3. రాటము సులభముగాకదలించుటకును, ఎక్కడనయినా పెట్టుకొని ఏవేళప్పుడయినను పిల్లలు, పెద్దలు, ముసలివాండ్లుకూడ పనిచేయుటకువీలయినదిగా నుండుట.

౪. వడుకుట మిక్కిలి తేలికమై శరీరమునకు శ్రమ గలిగించక బుద్ధిపుట్టినపు డెల్లను చాలించుటకు వీలుగా నుండుట.

౫. ఇండియాలోని సామాన్యరకపు దూది సహితము నేర్పరులు సన్నపునూలు వడుకుటకు తగియుండుట.

౬. ఎగుమతులతోను, వర్తకముతోను నిమిత్తము లేక వడికినవాడో, పొరుగువాడో ఆవస్త్రమును ధరించుటకు వీలుగా నుండుట.

2. దేశములో మారుమూలలలో సహితము స్వవృత్తిగా నేయునట్టి నేర్పుగల సాలీలు దొరకుచుండుట.

ఈ చేతిపరిశ్రమ కనుకూలపరిస్థితు లెన్నియో గలవు. దేశమొత్తముమీద మిక్కిలి లాభకారి యని నిస్సందేహముగా జెప్పవచ్చును. ప్రతిష్ఠొందనగ్రహము నందును అవలంబించుటకు ఈవృత్తి తగియున్నదా యని తప్పిసీలుగా మన మిప్పుడు విచారింపవలసి యున్నది.

ఈప్రయత్నము వెంటనే సఫలమగుటకు తగినన్ని రాటములును, మగ్గములును దేశములో నున్నవా యని మనము ముందు యోచించవలసిన విషయము. మనకు అవసరమయిన లెక్కలు లేకపోవుటచేత నిర్ధారణచేయుట కష్టము. చాలవరకు ఊహించి లెక్కలు వేయవలసి యుండును. ఇప్పుడు పనిజేయుచున్న రాటములసంఖ్యను బట్టియే వడుకుపరిశ్రమయొక్క సంపూర్ణవ్యాప్తి నిర్ధారణచేయ వీలులేదు. పంజాబు, ద్రవిడ, ఆంధ్ర, బీహార, కర్ణాట, రాజపుతానారాష్ట్రములు చర్ఖాకు బంగారపు గనులని చెప్పవచ్చును. ఈరాజ్యములలో రాటపరిశ్రమకు గల సావకాశము లెన్ని యని యిప్పుడు తేలకున్నను నీవృత్తి మిక్కుటముగ వృద్ధియగుటకు పెక్కు ప్రోత్సాహ వని స్పష్టముగ చెప్పవచ్చును. ఖాదీ ప్రచారమునందు అనుభవజ్ఞు లయినవారి యభిప్రాయమునుబట్టి ౫౦ లక్ష

రాటములు పనిజేయుచున్నవని సునాయాసముగ జెప్ప వచ్చును. దీనిని ప్రాతిపదికగా దీసికొని మనము లెక్క వేయ ప్రారంభించెదము. జాగుపనికింద కొంత తీసివేసి రోజుకు ౪ లేక ౫ గంటలు పనిజేసినయెడల ౧౫ వ నం బరునూలు దినమునకు ౮౪౦ గజముల పొడవు గల రెండు విచ్చెలు ప్రతిరాటమునుండియు తీయవచ్చును. అనగా సంవత్సరమునకు కదుపుకు ౪౮ పౌనుల చొప్పున వడుకవచ్చును. పౌనుకు ౪ గజములవంతున సంవత్సరము నకు ౧౯౨ గజములగుడ్డ తేలుచున్నది. ౫౦ లక్షల చర్ఖాలవల్లను ౯౬ కోట్లగజముల వస్త్రము ఉత్పత్తి కాగలదు. ౧౯౨౨-౨౩ వ సంవత్సరము మనకు దిగు మతియైన గుడ్డ ౧౫౭ కోట్ల గజములగుటచే దిగుమతి మొత్తములో మూడు రెండువంతులు ౫౦ లక్షల రాట ములవలన ఉత్పత్తి కాగలదు. ఈరాటములు రోజుకు ౪ గంటలవంతున పనిజేసినయెడల మనకు కావలసిన వస్త్ర ములలో చాలాభాగము ఉత్పత్తి చేసికొనవచ్చును. ముందు మన కెట్టియవకాశములు గలవో దీనివలన స్పష్ట ముగా తేలుచున్నది. మగ్గములనుగూర్చి సరియయిన లెక్కలే దొరకుచున్నవి. ఇప్పటికిని నేతపరిశ్రమవలన ౬౦ లక్షలకంటె నెక్కువమంది జీవించుచున్నారు. ౧౯౨౧ వ సంవత్సరపు జనాభా లెక్కలలో ౧౧ రాష్ట్రములలో

పనిజేయుచున్న మగ్గముల సరియయిన లెక్కలు దొరకగిలవు.

| రాష్ట్రముపేరు | మగ్గములసంఖ్య |
|---|---|
| ౧. అజ్మీరు | ౧౫౮౭ |
| ౨. అస్సాము | ౪౨౧౩౬౭ |
| ౩. బంగాళము | ౨౧౩౮౮౬ |
| ౪. బీహారు ఒరిస్సా | ౧౬౪౫౯౨ |
| ౫. బర్మా | ౪౭౯౧౩౭ |
| ౬. ఢిల్లీ | ౧౬౬౭ |
| ౭. మదరాసు | ౧౬౯౪౦౩ |
| ౮. పంజాబు | ౨౭౦౫౦౭ |
| ౯. బరోడా | ౧౦౮౫౭ |
| ౧౦. హైదరాబాదు | ౧౧౫౪౩౪ |
| ౧౧. రాజపుతానా | ౮౯౭౪౧ |
| మొత్తము | ౧౯,౩౮,౧౭౮ |

పై లెక్కలలో బీరారు మధ్యరాష్ట్రములు సంయుక్తరాష్ట్రములలో పనిచేయుచున్న మగ్గముల సంఖ్య చేరలేదు. అవి వదలివేసినను దేశములో ౨౦లక్షలరాటములు పనిజేయుచుండినట్లు తేలుచున్నది. మగ్గమునకు

సంవత్సరమునకు ౧౦౦౦ గజములవంతున లెక్కచూచు కొన్నయెడల మగ్గమునకు ౧౫౨౦ గజములుకూడ నేయ వచ్చును. దిగుమతియగుచున్న గుడ్డకంటె నెక్కువయే ఉత్పత్తిచేయవచ్చును. ఇప్పుడు పనిజేయుచున్న రాటములను మగ్గములనుబట్టియే ఈవృత్తిని దేశములో సర్వత్ర వ్యాపింపజేయవచ్చునని ధైర్యము గలుగుచున్నది. దీనికి దోడు జను లింకను వస్త్రముల నుత్పత్తిజేయు నేర్పును మరచిపోలేదు. కావలసిన వస్త్రమంతయు నుత్పత్తిజేయ గలశక్తి దేశమున కున్నది. ఈ రెండుపరిశ్రమలను వ్యాపింపజేయుటకు తగుఏర్పాట్లుమనముచేయవలసియున్నది. వీటిని చాకచక్యముతో పునర్జీవింపజేసినయెడల ఖద్దరు మిల్లుగుడ్డలను సులభముగ త్రోసివేయగలదు.

దేశములోని ఆదాయసాధనముల నుపయోగించుకొనుటకై కొంత పెట్టుబడి అవసరమయినను అంతకంటె రాటమును వ్యాపింపజేయుటకు చక్కని యేర్పాట్లను మనిషిచట్టమును అగత్యమై యున్నవి. మనగ్రామవృత్తుల చరిత్రలో సంభవించిన మూడునాలుగు పురుషాంతరముల అవాంతరమును కూడగట్టుటకుగాను పూర్వకాలమునకు సరిపోయిన ఆచారవ్యవహారములను కొన్నిటినిపునరుద్ధరింపక తప్పదు. పూర్వకాలపు వడుకుయొక్కయు, నేతయొక్కయు అందచందమంతయు విశేషము పెట్టుబడి

తోను, పెద్దయేర్పాట్లతోను అవసరములేకయే కావలసి నంతవరకే ఉత్పత్తి జేసికొనుపద్ధతిలో నిమిడియున్నది. భాగ్యవంతులస్త్రీలు ఇంటిఅవసరమునకై వడికి కాలక్షేపము జేసికొనుచుండిరి. బీదలు తమకుకాగా మిగిలినది అమ్ముకొనుచుండిరి. ఎవరింటిఖర్చుకు కావలసినదూదిని వారు నిలువజేసికొనుచుండుటచే ధనికులు ముడిదూదిని కొని నిలువజేసి అమ్మవలసిన అవసరము లేకపోయినది. వడుకువారును, నేతగాండ్లును సరసనే నివసించుచు నూలిచ్చి నేయించుకొనుచుండుటవలన నడిపి మనుష్యులపెట్టుబడితో పనిలేకపోయినది. కోరుట యిచ్చుట సామాన్యముగ జరిగిపోవుచుండెను. ఎంతఅవసరమో పనివాడికి సాధారణముగ తెలిసియే యుండుటచే కావలసినదంతయు ఆజీలుగా నుంచుకొనుచుండెను. పని ఒకరిచేతిలోనుండక అంతయు స్వాభావికముగను, స్వంతముగను జరిగిపోవుచుండెను.

మన ప్రయత్నములలో కేంద్రీకరణము పనికిరాదు. అందువలన రాట మింకను నిలిచి పనిజేయుచున్న ప్రతిభాగమునందును పనిజరుపుటకు వీలుండును. వడుకు వివిధరాష్ట్రములలో వివిధరకములుగ నున్నది. సవ్యముగను, నిరాడంబరముగను జరిగిపోవునప్పుడే ఆయారాష్ట్రములలో ఎంతవరకు కేంద్రీకరణ

మనవసరమో తెలిసికొనవచ్చును. అస్సాము రాష్ట్రములోని నవగంగప్రాంతములో గుడ్డను దూదిచ్చి కొను ఆచారము వ్యాపించియున్నది. దీనిని ఆధి లేక సంగోరుపద్ధతి యని పిలుచుచున్నారు. కొంత ప్రత్తి యిచ్చినయెడల అది పట్టి, ఏకి, వడికి, నేసినతరువాత ఆగుడ్డ సగము ప్రత్తిఖరీదునకును, సగము పైపనులకూలికిని చూచుకొనబడుచున్నది.. ఆంధ్ర దేశములోను, అరవనాటిలో కొన్ని భాగములలోను చీళ్లు సంతలకుదెచ్చి అమ్ముపద్ధతి సంగోరుపద్ధతివలె సంపూర్ణతకు రాలేదు. ప్రత్తిపట్టుట మొదలు చీళ్లు పోయువరకు మాత్రమే జరిగి, నేయకముందే సంతకు వచ్చుచున్నది. ప్రతియిల్లును నేతయంత్రశాలగ మార్చిన అస్సాము యొక్క ప్రత్యేకపరిస్థితులు ఇండియాలో నితరభాగములయందు సాధ్యము గావు. పడుగుజేయుట, పంటుచుట్టుట, మాత్రము నేతగానికి వదలి విచ్చెలు, చీళ్లుమట్టుకు తయారుజేయుపద్ధతి రెండవది. ఇది పంజాబు బీహారు మదరాసు రాష్ట్రములలో వ్యాపించియున్నది. నడిమివర్తకులతో అవసరము లేకయే సాలీలే నూలు కొని గుడ్డ లమ్ముటయు గలదు. వడుకువారే ఏకులుచేసికొను ఆచారము కొన్ని భాగములలో నింకను నిలిచియున్నది. కాని దూది నిలువజేసి నూలువడికి సంతలకు దెచ్చి అమ్ముకొనుటకు తగిన డబ్బులేనివారు చాలమంది గలరు. దూదేకులవాడు ఏకు

లుతయారుచేసి అమ్మునది మూడవపద్ధతి. పలువిధములుగ దేశములో నింకను రాటము నిలిచియున్నదిగాని ముఖ్య వృత్తిగా నెంచదగినస్థితిలో లేదు. మన మీపై జెప్పినహద్దులకులోబడి పని ప్రారంభించవలసియున్నది. ఆయారాష్ట్రములలోని ప్రత్యేకపరిస్థితుల ననుసరించి కేంద్రీకరణపద్ధతిని విసర్జించినచో ఇప్పటి ఖాదీ ఉద్యమము పెంపొందగలదు.

కేంద్రీకరణమును విసర్జించుటలో మొదట చేయవలసినపని ముడిదూదిని నిలువజేసి వడుకువాండ్లకు పంచిపెట్టుపద్ధతి మాన్పించుట. ఇదియే మనము చేయదలచిన గొప్పపనికి అస్తిభారము. ఇండియాలోసర్వసాధారణముగ ప్రత్తి పండించువారును విడుచువారునే నూలు వడుకుచుందురు. కొన్నిచోట్లకూలీలకు ప్రత్తే కూలిక్రింద నియ్యబడుచుండును. కొందరు స్వంతదారులే ప్రత్తివిడుచుకొనుచుందురు. ప్రత్తి పండనిభాగములలో వడుకు చాలతక్కువ. కొన్నిచోట్ల నూలువడుకువారు దూది నిలువజేసికొనలేనంతటి బీదలేయయినను వారికి శక్తిగలుగునంతవరకును సాయము జేయుచుండవచ్చును. వడుకువాండ్లే దూదినిలువజేసికొనుటవలనలాభము లనేకము లున్నవి.మనమువానిని విమర్శింపవచ్చును. పెద్దమొత్తములు ఖర్చుపెట్టి ప్రత్తినిలువజేయవలసిన యావశ్యకత లేకుండుట మొదటిలాభము.

ఏబది అరువదికోట్లరూపాయిలఖరీదు గల గుడ్డను ఉత్పత్తి జేయవలయు నన్నచో ఒక్కదూదినిలువజేయుటకే అనేక కోట్లరూపాయిలు తప్పక కావలసియుండును. ఈలాభమే కాక గుమాస్తాలు, భీమా మొదలయినవానికి కావలసిన ఖర్చు లన్నియు తగ్గిపోవును. వెంటనే యీనష్టమును తగ్గించుట సాధ్యము గాకపోవచ్చును గాని దూది నిలువ జేయుటకు వలయుమొత్తమును తగ్గించు ప్రయత్నములు ఇప్పటినుండియు చేయవలయును. మఱియు నిలువ జేయువారు దూదిధరయొక్క హెచ్చుతగ్గులనుబట్టి మార్పు జేయుచుందురు. దూదిధరలు హెచ్చయినప్పుడు విశేషముగ గుడ్డ తయారుజేయువారు తమపనులు తగ్గించుకొని లాభమునకు తగుమాత్రమే నూలును తయారు జేయు చుందురు. అప్పుడు రాటమునకు ధరల తేడాల వలన రాగలుగు నష్టమునకు పరిహారమేమియు గన్పట్టదు. ౧౯౨౩ లో దూదిధర చప్పనలేవగానే ఖాదీనేయువారు పని తగ్గించగా రాటము మూలబడవలసివచ్చినది. వడుకువాడే దూదిని సేకరించి యుంచుకొనునెడల ఇట్టి ఒడుదుడుకులవలన నిరుద్యోగత సంభవించదు. ముందుగానే ప్రత్తిని నిలువజేసికొనునెడల పట్టుకూలియును అతనికే మిగిలి విత్తులు లాభముక్రింద నిలుచును. ప్రత్తివిత్తుల వలన వ్యవసాయకునికి గలుగు ఉపయోగము మిక్కు

టము. దూదిధర హెచ్చినప్పుడు నిలువజేసికొన్నవానికి నూలుధర హెచ్చి లాభించును. తగ్గినప్పుడు తగుమాత్రమే వడికి తన ఇతరపనులు చూచుకొనవచ్చును. ఏవిధముగ జూచినను వడుకువానిపని లాభసాటిగనే యుండును. ముడిదూదికై ఇతరులపై నాధారపడి యుండగూడదని వడుకువానికి బోధించుటయే ముఖ్యముగ జేయవలసినపని. వడుకువాడు పుంజుకొనువరకు కొంతకాలము దూదినిలువజేసి సహాయము చేయవలసినదేగాని ఎల్లప్పుడిదియే అలవాటుజేయునెడల వడుకువా డితరులపై నాధారపడి యుండవలసివచ్చును. *

వడుకువాడు గర్భదరిద్రుడుగ నున్నప్పుడే పైనుండి సహాయము రావలసియుండును. కాని అతడుగూడ వస్త్రము అన్నముతోటిపాటిదని గ్రహించి ధాన్యమువలె దూదినిగూడ కొనియుంచుకొనుట అవసరమని నేర్చుకొనవలయును. నూలువడుకు వ్యవసాయకుటుంబము భోజనపదార్థ

* ఒక్కొకప్పుడు దూదేకులవాండ్లే దూదివర్తకు లవుదురు. కర్నూలుజిల్లాలోని నాగలాపురగ్రామములో దూదేకులవాండ్లే దూది నిలువజేసి వర్తకలాభమునుసహితము పొందుచున్నారు. కొన్నివాణ్ణుగులదూదికొని యేకులుచేసి వడుకువాండ్లకిచ్చి వడికించి నూలు జమచేసికొని అమ్ముకొనుటచే వర్తకలాభము వస్తువు నుత్పత్తి జేయుపనివానికే మిగులుచున్నదిగాని పట్టివ్యాపారియొక్క చేతులలోనికి బోవుటలేదు. అందుచే పనిజేయువర్తకులు బయలుదేరుటలేదు.

ములకై కొన్ని ఎకరముల ప్రత్యేకించు విధముననే ప్రత్తికి గూడ ఏర్పాటు జేయవలయును. అప్పుడే పూర్వకాలపు నూలుసంతలును, స్వేచ్ఛావర్తకమును ప్రబలగలవు.

వడుకువాడు దూది నిలువ జేసినప్పుడే మంచినూలును ఉత్పత్తిజేయగలడని గ్రహింతువు. దూది తనదైనప్పుడే వడుకువాడెక్కువజాగ్రత్తగను, పొదుపుగనువడికి ఎక్కువనూలును తయారుజేయును. అందువలన కొంత వెసులుబాటు చిక్కి తానుత్పత్తిజేసిన నూలుకు తగినధర వచ్చువరకును ఆగి అమ్ముకొనగలడు. వెంటనే మంచి రకపునూలు ఉత్పత్తి కాగలదు. ప్రత్తి చక్కగా శుభ్రము చేసి పట్టుదురు. దూది ఒబ్బిడిగా ఖర్చుపెట్టుకొని పంట విశేషముగ పండకపోయినను ప్రత్తికరవులేకుండ దూది నిలువజేసికొని చక్కనినూలు తయారుజేసి సరసమయిన ధరలకు విక్రయించబడును.

ఇప్పటిమోస్తరుగా ఎవరోదూదినిలువజేసి సిద్ధముయినఏకులనుఅమ్ముపద్ధతియున్నంతకాలము నూలురకము క్షీణించక తప్పదు. వడుకువాడు తనలాభమును మాత్రమే చూచుకొని నూలుయొక్క బాగోగులతో సంబంధము లేని నిర్జీవపు పనిముట్టయి ఊరుకుంటాడు. మఱికొన్ని విషయములను మన మిక్కడ గమనించవలసియున్నది. తిరుప్పూరువంటి నూలువడుకు ప్రాంతములను పరీక్షించి

అచ్చటి వడుకువారు స్వాతంత్ర్యులుగా నుండి పనిచేసినచో పరిస్థితు లెట్లుండునో యోచింతము.

ప్రస్తుతస్థితి (౧౯౨౫)

| పౌనునూలుఖరీదు | తప్సీలు | |
| --- | --- | --- |
| ౧౨ నంబరు రు ౧-౦-౦ | దూదిఖరీదు | ౦-౯-౬ |
| | వడుకునూలు | ౦-౪-౦ |
| | గుమాస్తావగైరా ఖర్చులు | ౦-౨-౬ |

కేంద్రీకరణము లేనియెడల

| పౌనునూలుఖరీదు | తప్సీలు | |
| --- | --- | --- |
| ౧౨ నంబరు రు. ౧-౧౩-౦ | ౩½ పౌ. ప్రత్తి ఖరీదు | ౦-౭-౬ |
| | ప్రత్తిపట్టుట వడుకుటకూలి | ౦-౬-౦ |

రెండవపద్ధతిప్రకారము ౨½ పౌనుల ప్రత్తివిత్తులు కూడ వడుకువానికి మిగులును.

పైజెప్పిన అంకెలు ఊహించివేసినవి గావు. కేవలము స్వానుభవమువలన తేలినవి. వడుకువాడు దూది నిలువజేసుకొనుటయను నొక్కవిషయముచేతనే నూలు ధర గుడ్డధర విశేషముగ తగ్గిపోవును. దానివలన ఖర్చులు తగ్గిపోయి విశేషముగ నూలుగుడ్డలు అంగళ్లలోనికి సిద్ధమవును. వడుకువాని ఆదా యెక్కువై ప్రతిబంధకము

లేమియు లేక తనకును దేశమునకును మహోపకారి కాగలదు. ఖాదీ చౌకయై ఉత్పత్తిచేయువానికిని ఉపయోగించువానికిని లాభకారి కాగలదు.

దూదిని ఒబ్బిడిగా ఉపయోగించుకొనుటవలన లాభము లింకను గలవు. ఈసందర్భములోనే సన్నరకము మధ్యరకము నూలునుగూర్చి విచారించవలసియున్నది. పౌనుకు తూగేవిచ్చెలను (విచ్చె=౮౪౦గజములు) బట్టి నూలు ఏనంబరుదో మనము నిర్ధారణచేయవచ్చును. పౌనుకు యిరువదివిచ్చెలు తూగినయెడల నూలు ౨౦-వ నంబరనియు ౪౦ విచ్చెలు తూగినయెడల ౪౦-వ నంబరనియు చెప్పవచ్చును. అన్నిరకముల దూదివలనను సన్ననూలు వచ్చునని చెప్పుటకు వీలులేదు. కొన్నిరకముల దూదివలన కొని నంబర్లనూలుమాత్రమే వడుకవచ్చును. హద్దుకుమించి ఏమాత్రము సన్నమయినను నూలు పీకుడై నేయుటకు వీలుగానుండదు. యంత్రముల నూలుకు వర్తించే సిద్ధాంతములు రాటమునకు వర్తింపవు. మిల్లులలో వడుకుటకుముందు దూదిపింజెలకు అనేక విధములయిన దోహదములు చేయబడుచుండుటచే భిన్న ఫలితముల నిచ్చును. రాటముమీద ౨౦ నంబర్లనూలు నిచ్చు దూదియంత్రములలో ౧౦, లేక ౧౨ నంబర్లకంటె నీయలేదు. పొట్టిపింజెలు గలదూది సహితము వ్రేళ్లతో

మార్దవముగా పట్టుటవల్ల మధ్యరకమునూలు నియ్యగలదు గాని ఆదూదే యంత్రములమీద ముతకనూలునిచ్చునదిగ గ్రహింపబడుచున్నది. పొట్టిపింజెల దూదివిషయమును సహితము రాటమే మేలనిపించగలదు. పొడుగు పింజల దూదివలన ముతక నూలును పొట్టిపింజెల దూదివలన సన్నపునూలును వడుకుటపొరబాటు. *అర్థశాస్త్రములో మంచిరకముపత్తిలోనుంచి ముతకనూలుతీసిన శిక్షవిధించే చట్టము మిక్కిలి శ్రేయస్కరమయినది. దానిని మన ప్రస్తుతపు ఖాదీషాపులన్నిటిలో బంగారుఅక్షరములతో చిత్రించి ఉంచుకొనవచ్చును.

పదవనంబరుకు పైబడిననూలును వడుకువిషయమై సతీశచంద్రదాసుగారు తన ఖాదీ మాన్యూలులో నిట్లు చర్చించియున్నారు: "మన కెట్టి నూలు కావలసినదియు ముందు యోచించవలసియున్నది. సన్నపునూలుకై దేశ

* ఆయాప్రాంతములలో పైరుపెట్టబడు దూదినిబట్టియే యచ్చట ఉత్పత్తియగు నూలురకమును నిర్ధారణచేయవచ్చును గాని ప్రస్తుతము మాది ఎగుమతులకై పైరుపెట్టబడు చుండుటచే పైసిద్ధాంతము వర్తింపగు. కోయంబత్తూరుజిల్లాలో బుకాననుగారి కాలమున నైతులకు దగిన ముతకనూలునిచ్చు నదనుపత్తి వేయబడుచుండెను. కాని ఇప్పుడు ఎగుమతులకై కాంబోడియా కరుంగన్నిరకములే పండించుచున్నారు. అయినను ఆజిల్లాలో నూలువడుకుట వృద్ధియయినయెడల పూర్వపు నదనుదూది తిరిగి తప్పక పండింపబడును.

ములో వెఱ్ఱివ్యామోహ మున్నది. సన్నపు నూలు గోరుట నిజముగ వెఱ్ఱియే. ఫల్గుణారివారందరును అనగా దేశీయులలో ౧౦౦ కి ౯౦ మందికి అవసరమయిన నూలువడుకవలయునని మన ఉద్యమోద్దేశమై యుండగా సన్నపునూలు గావలయునని కోరుట అసంబద్ధము. నంబర్లను ౬ నుండి ౧౦ వరకును ౧౦ నుండి ౨౦ లేక ౩౦ వరకును ఎక్కించుట పనితనమే కాని మన అభిప్రాయములు విమర్శనీయము లని నా అభిప్రాయము. సన్నపు నూలనగా అనేకకష్టము లున్నవి. సాధారణముగా దొరకని మంచిదూదికావలసియుండును. దానిని బాగుచేయుట బండు పని. ముతకనూ లింత నడుకలేము. నేయుట కష్టము. అందుచే ఎక్కువ నేతకూలి యియ్యవలసివచ్చును. సన్నపు నూలులో ఈచిక్కులన్నియు అనుసరించియుండును.”
పైజెప్పినది చాలవరకు వాస్తవమే యయినను విమర్శింప దగియున్నది. దాసుగారు సూచించినప్రకారము ఎక్కువ గజములు గుడ్డనేయుటయేనా మనఉద్దేశము? లేక మేలయిన రకములుకూడ ఉత్పత్తిచేయుటయును కొంతవర కవసరమే యని భావింపవచ్చునా? ఈ విషయమింకను చర్చించి తేల్చవలసియున్నది. మంచి ర క ము లు కూ డ తయారుచేయవలసియే యున్నయెడల మొత్తముమీద పనితనము మెరుగుబెట్టవలసియే యున్నది. మధ్యరకముల

యొక్కయు సున్నితమైనట్టియు నూలు వడుకుటకు కూడ మన మేర్పాట్లు గావింపవలసియే యుండును.

సన్నపునూలును వడిమిరకము నూలును గూర్చి వ్రాయునప్పుడు ఒకటిరెండు ముఖ్యవిషయములు గమనించవలసియుండును. సన్నపునూలుకు మంచిరకపుదూది కావలసియుండునుగనుకను అట్టిది అన్నిచోట్లను దొరకనందువలనను ఇది మొదటి ప్రతిబంధముగ నెంచవచ్చును. ఇది పెద్దచిక్కే కాని అసాధ్యమయినది గాదు. నూలు వడుకుట వృద్ధియయినతోడనే దానితోపాటు ఆయారకముల నూలు కనువయిన పూర్వపురకముల ప్రత్తియును తిరిగి పైరుపెట్టబడుననుటకు సందేహము లేదు. ఇదిగాక సన్నపునూలునకు ప్రతిబంధకము లింకను గలవు. నంబర్లు హెచ్చినకొద్దియు వడి తక్కువగును. అనగా తక్కువ నూలు ఉత్పత్తియగును. నంబరు హెచ్చినకొద్ది ఎక్కువ నూలు పట్టును. సన్నము, మధ్యరకము, ముతకరకముల నూలును ౨౪౦ గంటలలో-అనగా-రోజుకు ౮ గంటల చొప్పున ఒకనెలరోజులలో రాటముమీద వడికిన మొదల తేలుఫలితము లీక్రింద పొందుపరుపబడినవి.

మదరాసు గవర్నమెంటువారి తంతుపండితుడైన అమల సాదుగారి కరపత్రమునం దియ్యబడినవానికి సరిపోవునవే. అమలసాదు*గారు ౩౦ లేక ౪౦ నంబర్లనూలుకు ఎక్కువ గజములే యిచ్చినారుగాని ఊహించి నేయులెక్కలలో తగ్గించి వేయుటయే మేలని దరహాంమీదితగ్గుసంఖ్యనే మేము తీసికొంటిమి. నడుకుకూలి దారముపొడుగును బట్టియే యిచ్చుపద్ధతి అవలంబింపబడెను. అన్ని నంబర్లకు కూడ నడుకుధర ప్రస్తుతము నూలు విశేషముగ నడుకు కేంద్ర ప్రదేశములలో నమలులోనున్నవే యియ్యబడినవి. తమిళ నాడులో రూపాయికి ౧౨ మొదలు ౧౮ పుంజము (పుంజము = ౮౪౦ గజములు) లవంతున అమ్మబడును. మేము చేసినకూలియును ఆలెక్కకే సరిపోవుచున్నది. నలువదికి పైనంబర్లనూలు విశేషముగ లేకపోవుటచే కొంచెము ధరలెక్కువ చెప్పుచున్నారుగాని త్వరలో నివి

---

* అమలసాదుగారు తమకరపత్రములో శాస్త్రార్థికదృష్టితో చూచినయెడల నిరుపయోగమని స్పష్టపరచుటకు ప్రయత్నించిరి. మిల్లునూలుతో బోల్చినయెడల చేతినూలు పురిలేక గట్టిగా నడిపగలిగి సాఫుగాక అంగళ్లలో మిల్లునూలుతో పేరముకకు పోటీకి నిలువజాలదని వారి ముఖ్యాక్షేపణ. మంచినూలు తయారుచేయవలసినదని సూచించుటకు నవి యివి ప్రబలమైన ఆక్షేపణలుగావని చెప్పవచ్చును. ౬౦ లేక ౮౦ నంబర్లనూలు క్రిందటివరకు ఇండియాదేశము అంగళ్లన్నిటిలో ఖద్దరు అనాదినుండియు ఉత్కృష్టతకు పేరుపడి బహుకాలము మనగలిగి అంపముగ నేయబడుచుండెనని లోకమెరింగినవిషయమే. ఇకముందును ఖద్దరుఅట్టి ప్రసిద్ధినే పొందగలదు. అమలసాదుగారు చూచిన ఏదో నూలు పురిలేని పేకనూలు గనుక అంతయు అట్లుండుననుట సమంజసము గాదు.

తగ్గక తప్పదు. పొందూరు, గంజాములలోని నూలు విషయము వేరు. దానికి మంచిమంచిపురి ఉండును. అక్కడ పండేదూదివల్లనే అది తయారుచేయబడుచున్నది. వడికే వాండ్లు డక్కాలోమాస్తరుగా దూది నెంతయో శ్రమపడి శుభ్రము చేయుదురు. పొందూరు నూలుకు ఎక్కువ ధర పెట్టవలసినదేకాని ఇట్టిది మరెక్కడను దొరకనందున ధరలు మిక్కిలి యెక్కువగ నున్నవి.

పై వెరసులు పరీక్షించినయెడల నంబరు యెక్కువయినకొద్ది గుడ్డ తక్కువగు నని తేలుచున్నది. ౧౧-వ నంబరు మొదలు ౬౦-వ నంబరుకు బోయేవరకు నెల రోజులలో ఉత్పత్తియగుగుడ్డ క్రమముగ తగ్గి చివరకు నాలుగవవంతువరకు వచ్చినది. ముతకనంబర్లనూలు వడుకుట సులభమనియుఁ అందుచే నెక్కువలాభకారి యనియు వాదింపవచ్చును. లక్ష్మీదాసు పురుషోత్తముగారు యంగిండియాలో ౧౯౨౭-వ సంవత్సరం డిసెంబరునెలలో వ్రాసిన వ్యాసమునందు సన్ననంబర్లు పనికిరావనుటకు ఈవాదమునే చేసియున్నాడుగాని మొత్తము తగ్గినను నష్టమెక్కువలేదని చూపునట్టి అనుభవములోని ఒకటిరెండువిషయములను ఆయన గమనించలేదు.

(౧) సన్నపునూలు వడుకుటకును, నేయుటకును ఎక్కువకూలి యిచ్చినను మొత్తముమీద గుడ్డఖరీదు అమితముగా హెచ్చలేదనునది మొదటివిషయము. అనగా తక్కువగుడ్డ ఉత్పత్తియయినను వడుకుటకును, నేయుటకును ఎక్కువకూలి యిచ్చినను వానికెదగినట్లు గుడ్డధర

హెచ్చ లేదు. వ్యవహారజ్ఞుడయిన వర్తకుడు ఎక్కువకూలి యిచ్చియయినను ౨౦ నంబరుగల ౨౮౪ గజముల గుడ్డనే నేయించునుగాని తక్కువకూలియిచ్చి ౧౦ వ నంబరు ౫౦ గజముల గుడ్డను తయారుచేయించుటతో తృప్తిపొందడు, ముతకదానికంటె మధ్యరకపుగుడ్డ ఎక్కువ సులభముగా అమ్ముడుపోవుననుట ఒకకారణము గావచ్చును. మఱియు నతని కారాటములసంఖ్య వృద్ధిజేసి మధ్యరకపు గుడ్డను ఎక్కువగ నుత్పత్తిజేయుట కుత్సాహము గలుగును. మధ్యరకపుగుడ్డ ముతకదానికంటెతక్కువడుత్పత్తియగుట నిరుత్సాహకారణము గాక ఎక్కువరాటములచే బని చేయించుటకు హేతువగుచున్నది. అదియునుగాక దక్షిణ దేశములోని కొన్నిభాగములలో వడుకువాడు సన్నపు నూలునుమాత్రమే వడుకగలడు. బహుకాలము మధ్య రకమునూలును, సన్నపునూలునుమాత్రమే వడుకుట కలవాటుపడినవాడు ముతకనూలు వడుకజాలడు. కనుక సన్నపునూలును విశేషముగ వడుకుట కలవాటుపడిన ప్రాంతములలో ఖద్దరుఉత్పత్తిని వృద్ధిజేయక విడిచిపెట్టుట క్రమము గాదు. రాటముయొక్క పరిమాణము, దూది యేకుపద్ధతులు, శుభ్రముచేయుమార్గములు, నావకాశము గా పనిచేయుట మొదలగునవన్నియు ముతకనూలువడు కుటకు పనికిరానివే. కనుక జాతీయక్షేమమునకై మధ్య రకమునూలు వడుకుట ఉపయుక్తమే కాక అవసరమని కూడ నిష్కర్షగ జెప్పవచ్చును.

(౨) దూదిధర హెచ్చినప్పుడెల్లను గుడ్డల ధర హెచ్చునుగాని సన్నపునంబర్ల ధర ముతకవాని యంతగా హెచ్చవు. దూదిధరపౌనుకునాలుగణాలవంతున హెచ్చిన యెడల దానితోబాటు ముతకగుడ్డల ధర గజమునకు ౧-౧-౮ వంతున హెచ్చును గాని ౨౦, ౮౦ నంబర్ల గుడ్డధర గజమునకు ౯ లేక ౭ పైసలకంటె హెచ్చ జాలదు. దూదికి ధర హెచ్చినప్పుడు దూదినిలువజేసికొన లేని వడుకువాడు సన్నముగావడికి దూదిని మిగిల్చి మామూలుకూలినే సంపాదించుకొనుచుండును. దూది నిచ్చి నూలువడికించుకొనువాడు సన్నపునూలునే వడికించుకొని లాభమును పొందజూచును.

(3) మధ్యరకమునంబర్లు వడుకుటలో వడి ఎక్కువై ఎక్కువనూలు ఉత్పత్తియగును గనుక వడుకు ధరలు తగ్గించినను వడుకువానికి మొత్తముమీద నష్టముండదు. మధ్యరకము నూలును త్వరగా వడుకుమార్గము నల వర్చుట మంచిది. ఈసందర్భములో వడుకుకూలిని నిర్ధారణచేయుపద్ధతులగూర్చి యోచింతము. పొడుగును బట్టి కూలియిచ్చుపద్ధతిమంచిది. దానివలన నూలురకము మొత్తముకూడ నిర్ధారణ కాగలదు. మధ్యరకములు వడికి కాలమును తగ్గించుకొనుటకును, సన్నములువడికిఎక్కువ రేటు సంపాదించుకొనుటకును వడుకువాని కవకాశ

ముండును. పడకడములో మోస ముండుటకు వీలులేదు. తూనికనుబట్టి కూలియిచ్చే యెడల మంచిచెడుగుల భేద మున కవకాశ ముండదు. గనుక మంచిరకముతో చెడు రకమును కలుపుటకు వీలుగలుగును. అప్పుడు మంచిచెడు గులకు సమానమయినధర యియ్యవలసివచ్చును. నూలు కండెలు తూచికొనుచుండిన యెడల లోపల ముదుగు నూలు బెట్టి పైన సన్నము పోయుదురు. ఈపద్ధతివలన దత్తిమండ లములోని ఒక ఖాదీపరిశ్రమాలయములో ఈ మోసము మును బహుకాలము కనుగొననందున వ్యవహారములో గొప్పనష్టమువచ్చి ఆలయము మూసివేయవలసివచ్చినది. అయినను పొడుగునుబట్టి కొనునప్పుడుగూడ ఒక బాధక మున్నది. సన్నపునూలుకును మధ్యరకమునూలుకును కూలి నిర్ధారణ చేయుటకు ఇందువలన ఎక్కువ వీలుగా నుండునుగాని ముతకనూలువిషయమున నిది యనవస రము. అందువలన దేశములో సన్నపునూలు విచ్చెలు గను, ముతకనూలు తూనిక మార్గమునను అమ్ముట ఆచారమయినది. పదిపన్నెండునంబర్లను విచ్చెలు పోసి యిమ్మనుట అనవసరము. తూచి అమ్ముటయే యెక్కడ నయిన ఆచారముగ నున్నయెడల అది మార్చుట యుక్తము గాదు.

"మధ్యరకము నూలును సన్నపునూలును వడుకుటలో వచ్చు లాభనష్టములు స్వంతముగా వడికి చూచుకొనిన తెలియగలదు. సంవత్సరమునకు ౨౪౦ గంటలు స్వయముగా వడుకుకొనినయెడల సన్నని చిక్కనిగుడ్డను అతిస్వల్పఖర్చుతో స్వోపయోగమునకు నేయించుకొనవచ్చును. ఒకడు రోజుకు ముప్పాతికగంటనంతున వడికినయెడల తనకు కావలసినన్ని గుడ్డలను నూలు గుడ్డలకంటె సమితచౌకగా నేయించుకొనుట కవకాశ ముండుటచేత నే రాటము మిల్లునకంటె మేలయినదని చెప్పవచ్చును. స్వంతంగా వడుకుకొనినయెడల వస్త్రము ఏధరకు గిట్టునది నంబరువారీగా తెలియజేయుచున్నాము.

| నంబరు | | | | వడుకుకూలిలేకుండ గజము ఖరీదు |
|---|---|---|---|---|
| ౮ | ... | ... | ... | ౦-౪-౫ |
| ౧౦ | ... | ... | ... | ౦-౪-౩ |
| ౧౫ | ... | ... | ... | ౦-౪-౬ |
| ౨౧ | ... | ... | ... | ౦-౪-౯ |
| ౨౫ | ... | ... | ... | ౦-౪-౬ |
| ౩౦ | ... | ... | ... | ౦-౫-౧ |
| ౪౦ | ... | ... | ... | ౦-౫-౧ |
| ౫౦ | ... | ... | ... | ౦-౫-౩ |
| ౬౦ | ... | ... | ... | ౦-౫-౬ |

స్వాయముగా వడుకుకొనువానికి ఏనంబరుగుడ్డయైనను చాలవరకు ఒకధరకే గిట్టును. బీహారు గవర్నమెంటువారు నియమించిన టాలెంటుగారు ౧౯౨౧ వ సంవత్సరపు జనాభారిపోర్టులో వడుకుకూలి తీసివేసినను విదేశీగుడ్డకంటె ఖాదీ ఎక్కువఖరీదవునని చెప్పుట ఆశ్చర్యమును గలిగింపకమానదు. హాస్యాస్పదముగూడాను. ఇంటివారాలో అయిదుగురు గల ప్రతికుటుంబములోను ఒకరాటము రోజుకు రెండు రెండున్నర గంటలు పనిచేసిన యెడల వారికిచాలినగుడ్డకు వడుకవచ్చును. అట్టివంటప్పుడు కాలమువృథాగాకుండ ఏనంబరువడికితే లాభకరమో యోచించుకొని వడుకుకొందురు. ఇతరపనిలేనివారు కాలక్షేపనకొరకుగాని ఖులాసాగాగాని వడుకుకొనువారు సన్నపునూలును వడుకుకొనవచ్చును. తీరికలేని వ్యవసాయకులు మున్నగువారు ముతకనూలునే వడుకుకొందురు. క్రీ॥ ౧౮౦౦లో డాక్టరు బుకాననుగారీపైపరిస్థితులనే వర్ణించియున్నారు. ఆకాలములో వ్యవసాయకులుగూడ అమితమైన సన్ననూలును వడికి అంగళ్లకు బంపుచుండిరట. పైవిషయములన్నియు యోచించినయెడల దేశములో సర్వసాధారణముగ వడుకబడు నూలు నంబరు ౨౦ కి పైగా నుండునని చెప్పవచ్చును. మనము ఉత్పత్తిచేయు ఖాదీమొత్తము సరహాముమీదఆనంబరుకు వచ్చినయెడల

అది దేశమునకు తప్పక లాభకారికాగలదు. నూలంతయు అనంబరుదిగా నుండనవసరము లేదు. సరహాముమీద అంతకు వచ్చిన జాలును.

అన్ని చేతిపనులలోవలెనే వడుకుటయందు సహితము కేంద్రీకరణములేనప్పుడే వృత్తి లాభకారికాగలదు. ఈయేర్పాటులో వడుకువారు ఎవరికి గావలసిననూలును వారు సేకరించిపెట్టుకొనుట మొదటిమెట్టని చెప్పియుంటిని. నూలుగుడ్డలు కలిసి ఒక అంగడికి చెప్పించుట రెండవ మెట్టు. పూర్వపు వారపుసంతలపునరుద్ధరించుటయే దీనికి మార్గము. దక్షిణ హిందూదేశములో నూలు నమ్ముట ఆచార మగుచున్నది. మన నూతనోద్యమము ప్రారంభ మయినప్పటికంటె నిది యెక్కువయినది. మనము కోరు నదియే యిది. బహిరంగసంతలలోనికి వడుకువాడు, నేత గాడువచ్చి లావాదేవీలు ధారాళముగజరుపుకొను రోజు లింకను రాలేదు. దేశములో ఖాదీ సర్వసాధారణముగ ధరించుకాలము రానిది ఇది సంభవముగాదు. అదిజరుగు నప్పుడే మధ్యవాడు జారిపోవును. అంతవరకును నడిమి వాడు వడుకువాండ్లకును నేతగాండ్లకును, కొనువాండ్లకును దూదివర్తకునకును మధ్యవర్తిగా నుండుట అవస రమే. బహిరంగసంతలు వృద్ధియయినకొలదిని వీనియవస రము తగ్గిపోవును. వడుకువాడు, నేతగాడు పలుమారు

కలుసుకొనుచున్నయెడల నూలురకము వృద్ధికాగలదు. నూలుసంతలు దేశములో సర్వసాధారణ మయినప్పుడు నేతగాడిప్పటికంటె ఖాదీయం దెక్కువసంబంధము గలిగియుండుకొనును.

విడిగాజరిగిన చోట్లకంటె నూలు చౌకగా దొరకుచున్నది. అయినను ఖాదీ యింకను బాల్యావస్థయందున్నది.

| స్థలము | నంబరు | నూలు ఖరీదు | నేత కూలి | ఇతరవిషయములు |
|---|---|---|---|---|
| ౧. నాగలాపురం (చిత్తూరుజిల్లాలో) | ౨౦ | ౧-౧౦-౦ | | పడుగులు అన్ని పనులువడుకువాడే చేయును |
| ౨. తిరుప్పూరు (కోయంబత్తూరులో) | ౧౦ మొ ౧౨ | ౧-౦-౦ | | తూనిక పడుకువాడే చేయును. |
| ౩. అమ్రియాలా (గుజరాతు) | ౬,,౧౦ | ౧-౪-౦ | | తూనిక కేంద్రీకరణము |
| ౪. కలికేరి (చిత్తూరులో) | ౮,,౧౦ | ౧-౪-౦ | | తూనిక కేంద్రీకరణము |

వడుకువాడు నూలుస్వయముగాఅమ్మినప్పుడును, వడుకువాడు పనులు తానే చేసికొను ప్రాంతములలోను రెండుపనులు విడిగా జరిగిన చోట్లకంటె నూలు చౌకగా దొరకుచున్నవి. అయినను ఖాదీ యింకను బాల్యావస్థయం దున్నది.

కడపటి రెండుస్థలములు క్రొత్తగా ఖాదీ ఉత్పత్తి స్థాపింపబడినవి. ఇచ్చట పనులువగైరా పనులకు విడిగా

కూలి యియ్యబడుచున్నది. ౧, ౨ స్థలములలో అన్ని పనులును వడుకువాడే చేయుచుండుటచే కూలియంతయు ఒకదానిలోనే చేరియున్నది.

మన ఉద్యమము విదేశవస్త్రములమీద ఒక విధమయిన రక్షకపన్నుగా ఉద్దేశింపబడినదగుటచే మొదటి రోజులలో బాగుగ పెంపొందునట్లు చూడవలయును. దానిని పైకి తెచ్చుటకై దేశములో ఖాదీపై నభిమానమును గలిగించి పెంపొందించుటయేకాక ధనసహాయము గూడ చేయవలసియున్నది. ఉద్యమము బాగుగ కొనసాగించుటకు అవసరమగు ధనసహాయ మేవిధముగ చేయవలసియున్నది? ఖాదీకొనే ప్రతివాడును ఎక్కువధర యిచ్చి కొనుచుండుటచే ప్రతిగుడ్డకును కొద్దిగ ధనసహాయము చేయుచునేయున్నాడు. ప్రభుత్వమువారు ఈవృత్తి యొక్క అభివృద్ధిని నిరోధించి తోడ్పడనంతకాలము స్థితిపరులందరును దానిని సంరక్షించక తప్పదు. అన్నిటిలో ఉత్తమమయిన సహాయము ఖాదీఉత్పత్తికితోడ్పడుటయే. ఖాదీ ఎక్కువయినకొలదిని చౌకకాగలదు. స్వయముగా వడుకుటయే యెక్కువ ఉత్పత్తికి తోడ్పడు మార్గమును, ఉత్తమమయిన సహాయమునై యున్నది. బహుమంద వ్యక్తులు ప్రత్యేకముగాజేయు స్వల్పసహాయములు కలిసి యెంతమహదుత్పత్తి చేయగలవో చూపుటకు స్వయ

ముగా వడుకుటయే తీర్మానము. స్వయముగా వడుకుట అందరును తమ అందరకును జేసికొనుసహాయము. అందువలన ప్రస్తుత కేంద్రీకృతపద్ధతి మారిపోగలదు. అది ఖాదీఉద్యమమును విస్తరింపజేయుటయేకాక దేశములో వ్యాపించుటకు తోడ్పడగలదు. ఉద్యమమునకు విరామములేక నిలుకడ కుదురును. స్వయంకృషివలననే విశేషముగ సన్నపునూలు ఉత్పత్తి కాగలదు. అందువలననే ప్రస్తుతము సన్నపునూలుకున్న పెట్టుధరలుపడిపోగలవు.*

స్వంతవడుకునల్లనే కాక ఇతర మార్గములవల్లను ఖాదీయొక్క ఉత్పత్తివ్యయములు వృద్ధిచేయవచ్చును. వర్తకులు ఖాదీమీద పెద్దమొత్తములను వినియోగించిన యెడల చిన్నవర్తకులకు సహాయమగునని ఖాదీబోర్డువారు తీర్మానించిరి. అందువలన ఖాదీ ఉత్పత్తికి పరోక్షముగ తోడ్పడవచ్చును. చిన్నవర్తకుడు తన మూలధనమును వృద్ధిచేసి పైవిరాళమువలన లాభము పొందవచ్చునుగాని పెద్దమూలధనము పెట్టినవానికే నష్టము పూడ్చుకొనుటకు ఉపయోగించును. విరాళపద్ధతివలన ఖాదీ

* స్వంతవడుకువలన ఇతరలాభములుగూడగలవు. సరిగా నడిపినచో అది కాంగ్రెసుపనికి కలసినంత ధనమును చేకూర్చగలదని శ్రీ కె. సంతానముగారు ౧౯౨౫ వ సం.రం జనవరి ౨౨ వ తేదీగల యంగిండియా పత్రికలో చక్కని వ్యాసమును వ్రాసియున్నారు.

యొక్క గిట్టింపుధరమీద ఒకేవిధమయిన లాభము వేసు
కొని అమ్మించుటకు ఉపాయ మేర్పడును. విరాళములు
స్వల్పముగ నున్న యెడలమార్పువిశేషముండదు.విరాళము
పెద్దదిగనున్న యెడల సంపూర్ణమయిన లాభము కలుగ
గలదు. నూలుసంతలకు జతగా ఖాదీసంతలుగూడ పెం
పొందింపవలయును. గ్రామసంతలలోనికి ఖాదీని ప్రవేశ
పెట్టుటకై కమిషను రూపమునగాని,ఇతరమార్గములగాని
యియ్యబడు విరాళము మిక్కిలి ఉపయోగకారి కాగల
దు. జనసమ్మర్దము గల పట్టణములలో ఖాదీని వ్యాపింప
జేయుట సులభమేకాని ముందు విశేషముగ ఖర్చుకావల
సిన గ్రామములలో చొప్పించుటకే గట్టిప్రయత్నములు
విడువక చేయవలయును. పల్లెటూళ్లలోనికి దేశాభిమా
నము వ్యాపింపజేసినయెడల త్వరగా పోదు. పల్లెటూళ్ల
లోని వ్యవసాయకులలోను ఇతర పనివాండ్లలోను ఖాదీ
అభిమానమును పుట్టించుటకై పనిచేయుటయే ప్రధాన
ముగా బెట్టుకొన్న ప్రచారకులకు విరాళములు మున్నగున
విచ్చి యెక్కువ ప్రోత్సహింపవలయును. గ్రామములో
నమ్మువాడు కేవలము వర్తకుడుగనే కాక ఉద్యమప్రచా
రకుడుగగూడ నుండవలయును. అప్పుడే అతడు జయము
గాంచగలడు.

పైజెప్పినట్లు క్రయవిక్రయములమీద విరాళము లిచ్చుపద్ధతినే వడుకువాండ్లకును, నేగాండ్లకును లాభించునట్టి విరాళములగూడ నియ్యవచ్చును. వడుకువానికిచ్చువిరాళము ఖాదీయొక్క ఉత్పత్తివ్యయములను వృద్ధిపరచుటకు తోడ్పడునదిగ నుండవలయును. వడుకువాడు తననూలును అమ్ముకొనుటకు బదులుగా నేయించి తానె కట్టుకొనుటకు ప్రోత్సహించునదిగా నుండవచ్చును. తనకు కావలసినదూది నిలువజేసికొని వడుకునట్టివానికి విరాళముగ" వాని స్వోపయోగమునిమిత్తమై ఉచితముగగాని, సగముకూలికిగాని ఒక్కొక్కనికి ౧౨ చదరపు గజముల గుడ్డను నేయించి పెట్టవచ్చును. స్వంతముగ దూదినిలువజేసికొని సంవత్సరముపొడుగునను వడికి తాను నేయించుకొనక యితరుల కమ్ము ఆచారముగల భాగములలో ఈ విరాళములపద్ధతి ఎక్కువ ఉపయోగకారి కావచ్చును. సగముకూలికి నేయించి పెట్టుట యనగా ఒక్కొక్కనికి ౧౦, లేక ౧౨ అణాలచొప్పున పడును. ౨౦ లేక 3౦ వేల వడుకువాండ్లుగల ఏ భాగములోనయినను ఈవిరాళపద్ధతిని ప్రవేశపెట్టినయెడల ౧౫౦౦౦ లేక ౨౨౫౦౦ రూప్యములఖర్చుతో ౧ లేక ౧౪ లక్షలఖరీదుగలఖాదీ ఉత్పత్తి చేయించవచ్చును. ఉత్పత్తిమొత్తముమీద ౧౦౦కి ౧౨౪ మొదలు ౧౫ వరకువిరాళ మియ్యవలసివచ్చును. వడుకు

వారు ఇతరులు తనకు సాయమొనర్పగోరునటుల నే స్వయం సహాయమునుఅవసరమని గుర్తించునట్లు చేయవలయును. మనఉద్యమమునపనిచేసిపెట్టుచున్న నడుకువాండ్లలోబహు మంది ఏవిధముగను మార్పు జెందియుండలేదు. ఇప్పటికిని వారువిదేశిగుడ్డలను మిల్లుగుడ్డలనేధరించుచున్నారు. వారు పూర్వమువలె తమకుటుంబమునకు సహితము నడుకు కొనునట్లు చేయవలయును. మిక్కిలి హీనస్థితియందుండి పడిపోవుటకు సిద్ధముగనున్న మనఉద్యమమును కేవలము నిలుపుకొనుటయేకాక వృద్ధిచేయుటయును మనకుపరమ ధర్మ మని గుర్తించి లోపలినుండి సంస్కరణము ప్రారం భింపవలయును. ఇంటిపనిలో భాగముగా నడుకును అవ లంబించినయెడల యెంతముదుగు దయినను ఖాదీయం దభిరుచిగలుగును. ఖాదీఉద్యమము గ్రామములలో వేరూ నినయెడల మనము దానిని బలపరచుటకు జేయు ప్రతి ప్రయత్నమును దానికి ప్రధానాంగములయిన నడుకు వానికిని నేతగానికిని చెందునదియై యుండవలయును. నడుకువాని మోస్తరే నేయువాడును. మన దేశములో బహుకాలమునుండియు సాలెవాడు గొప్పశాస్త్రిగపరిగణింప బడుచుండెను. సేద్యమునకు తరువాత ఇప్పటికి దేశములో ముఖ్యమయినవృత్తి నేతయే. దానివలన ఇప్పటికిని ౬౦ లక్షలమంది జీవించుచున్నారు. ఇప్పటికిని మన దేశమునకు

గావలసిన గుడ్డలో నాలుగవవంతు మనచేతిమగ్గములే తయారుజేయుచున్నవి. మన దేశములో నుత్పత్తియగు మిల్లుగుడ్డలలో ముప్పాతికవంతు చేమగ్గములనుండ తయారగుచున్నది. ౧౯౨౩-వ సంవత్సరములో దేశములో ఖర్చుపడిన ౪౩౦½ కోట్లగజములగుడ్డలో ౧౧౦ కోట్ల గజములగుడ్డ చేమగ్గములమీద తయారయినది. మన విద్యాధికులు ఈకుటీరవృత్తియొక్క ప్రాముఖ్యమును నెక్కువగ గ్రహించవలసియున్నారు. ఇండియాయొక్క క్షేమము మగ్గము నింకను ఉన్నతస్థితికి దెచ్చి రాటముతో జత పరచుటపై నాధారపడియున్నది. మగ్గమునకు రాటము జతపడినగాని యది నిలువజాలదు. కొన్నిభాగములలో నేతగాడిది గ్రహింపకపోలేదు. కాని, యతడింకను రాటపు నూలుతో దాగుడుమూత లాడుచున్నాడు. రాటము నందతనికి ద్వేషము లేదు. నూతనోద్యమము నిలుచునని యతనికి నమ్మకము లేదు. అతనికి రాటముపైనేమయిన అభిమానమున్న యెడల నది నలుగురితోపాటిదే. రాటమువలన గ్రామముయొక్క ఆర్థికస్థితి బాగుపడునది గ్రామపాంచాణమువారిలో తనకు స్థానము లేదని నేతగాడిది గ్రహించవలసి యున్నది. రాటము బలపడనిది, స్వదేశ విదేశ యంత్రశాలాధికారులయొక్కయు, సాహుకారుయొక్కయు దాస్యద్వితయమునుండి తనకు

విమోచనము లేదని నేతగాఁడెరుఁగఁడు. తన ఆదాయమును క్షీణింపజేయుచున్న యితరవిషయములనూ అతఁడు గ్రహింపఁడు. అతని ఆదా క్రమముగ క్షీణించుచున్నది. మగ్గములయొక్క సంఖ్య క్రమముగ తగ్గిపోవుటయే దీనికి తార్కాణము. నేతగానికి స్వంతపెట్టుబడి లేదు. ఏ సాహుకారుమీఁదనో ఆధారపడవలసియున్నాఁడు. తన సరకులను సమయము కొఱకు వేచియుండి తన యిష్టమయినధరల కమ్ముకొనుట కవకాశము లేదు. పరపతిసంఘముల స్థాపించి డబ్బు సాయముచేయించ వలయు నని కొందరు చెప్పెదరు. అది కొంతవరకు మేలేయయినను అందువలన సంపూర్ణలాభము కలుగఁజాలదు. నేతగానికిని వానికుటుంబములోనివారందరికిని కావలసినది, చేతినిండపని. రాటమునుగూడ వారుతోడుచేసికొనే యెడల ఇప్పటిమోస్తరుగ ఋతువులపై నాధారపడియుండవలసిన పనిలేదు. రాటపు మ్రోత వినఁబడినంతకాలము అతనికి నిరుద్యోగత లేదు. పొరుగువాఁడే నేయించుకొనును గనుక కొనువానికై వెదకనవసరము లేదు. మదరాసురాష్ట్రోద్యోగియైన అపల్ సాదుగారివలె చిల్లుబోయుట, పడుగుచేయుట, పంకిదిప్పుట మొదలయిన వృత్తులన్నియు పడుగుయంత్రముతో చేయించవచ్చునని తలంచుచున్నారు గాని యది సాలెవాని క్షేమమునకు గాదు. అందుచే నతనికుటుంబికులకు కొంత

డబ్బు కూడబెట్టి రాట్నముల దానికనుబంధముజేసి వడుకు తన స్వంతవృత్తిగా జేసికొనగలడు. తిరుపూరుప్రాంతములలో నేతగాండ్లు పరపతిసంఘములలో వేసిన మొత్తములు మగ్గమునకు రు ౧౫౦ వరకు వచ్చినవి. ఈపద్ధతి నేయువానికిని, వడుకువానికినిగూడ లాభకరమే. ఖాదీ ఉత్పత్తి గ్రామములలో స్థిరపడగలదు. నేతగాండ్లిదివరకు వలె గ్రామముల విడిచిపోక యచ్చటనే స్థిరవాసము లేర్పరచుకొందురు. ఇది గాక సాలీలను వడుకునూలు నేయుటకై ప్రేరేపింపవచ్చును. చేతినూలు నేయుట కత డలవాటుపడనిచోట్ల కొంతవిరాళ మియ్యవచ్చును. ఇన్నిగజములఖద్దరు వడికినందు కింతవిరాళమని కొన్ని ప్రదేశములలో ఇచ్చి చూడవచ్చును. వడుకు తీవ్రముగ వ్యాపించినయెడల ప్రచారబలముచేతనే మగ్గములచే ఖాదీనేయించవచ్చును.*

కొన్నిచోట్ల కల్తీఖద్దరును తొలగించుట పెద్ద సమస్యయైనది. యంత్రశాలలలోను ముతకమిల్లునూలు వడుకు మగ్గములయందును మోసము జరుగుచున్నది. గుడ్డను చక్కగ పరీక్షించినయెడల మోసము కనుగొన

* వడుకువాండ్లును నేతగాండ్లునే కాక యితరులును తోడ్పడవచ్చును. పల్లెలలో పత్తిపండించు రహితులు పత్తినిరాళములనిచ్చియు, పట్టణములోనివారు ధనసహాయ మొనర్చియు నీయుద్యమమునకు తోడ్పడవచ్చును.

వచ్చునుగాని జరుగకుండ జేయుటకు వీలులేదు. సర్టిఫికేటు పద్ధతియు నిటువంటిదే. కల్మషమేమియు లేకుండ జేయవలయునన్నచో ఖాదీ ఉత్పత్తిజేయుస్థానమునకేపోయి అచ్చట నే జాగ్రతపడవలయును. ఉత్పత్తిస్థానమును పరిశుభ్రపరచనిచో పలుమారు చిక్కులు రాగలవు. ఏప్రదేశములో నయినను మోసము జరుగుచున్నదని తెలిసినప్పుడు ఈ క్రిందిసంగతులు గమనింపవలసియుండును. (౧) ఆప్రాంతములో రాట్నములెన్ని యున్నవి? అవి యెంతనూలు వడుకగలవు? (౨) నూలు అచ్చటి కెక్కడినుండి దిగుమతియగుచున్నది? (3) సాలీల ఆచారములు, వారిప్రతిష్ఠానల అమరిక. (౪) అచ్చటివర్తకులు ఎంతఖాదీ నెగుమతిచేయుచున్నారు? నేతగాడు స్వాధీనమయినయెడల మిల్లునూలు కల్తీచేయకుండ చేయవలయును. ఉద్యమప్రారంభములో నిట్టిచిక్కులు కొన్నివచ్చుచుండును గాని యది బలపడిన తరువాత చిక్కులన్నియు విడిపోగలవు.

పైసహాయములు కృత్రిమములు. వీటివలన ఉద్యమమును స్వల్పకాలమే పోషింపగలము. ఇట్టిసహాయములపై నాధారపడి యేపరిశ్రమయును బహుకాల ముండజాలదు. అది లోపలిబలముచేతనే వర్ధిల్లవలసియుండును. వడుకుదేశమందంతటను వ్యాపింపజేయుటకు పూర్వపద్ధతు లవసరమేయయినను ప్రతియంశమునందును పూర్వాచారముల నుద్ధరించుట సాధ్యము గాకపోవచ్చును. సాధ్యమయినను

కొన్నివేళల అంత ప్రయోజనకారులు కాకపోవచ్చును. కొన్నిసార్లు పూర్వపద్ధతుల సంస్కరింపవలసివచ్చును. చర్ఖాయొక్కయు, కమానుయొక్కయు వేగమును వృద్ధి జేయుట ఉద్యమమున కెంత యవసరమో వేరుగ జెప్ప నవసరములేదు. అందువలన తక్కినపద్ధతులు మార్చకుండ రకము పెంపొందింపవచ్చును. ప్రతిరాష్ట్రములోను కొరముట్లను, అవి పనిచేయుపద్ధతులను విమర్శించి యభివృద్ధి చేయుచుండవలయును. పనిముట్లలో స్వల్పాభివృద్ధి జరిగినను మొత్తముమీద చాల ఉపయోగింపగలవు. మంచి రకములకదుళ్ల నుపయోగించుటవలన రాటమునకు ౫౦ గజములవంతున వడి యెక్కువయినయెడల దేశమంతటను ౧ లక్షరాటములు పనిజేయుచున్న వని యెంచినచో ౨ కోట్లగజములు లేక ౧౮౦౦ పౌనులనూలు వృద్ధియగును. ఏకులు చేయుటయందును, ఇట్టిమార్పులు గన్పడినచో ఇట్టి లాభములే కనబడగలవు. కమాను ఏకేపద్ధతిలో పెంపు గనబరచినయెడల ఎక్కువనూలు వడుకుటకు మార్గమవును. వడుకువాడే ఏకులుచేసికొను నెడల అతనికి కూలి వృద్ధియగుటయేకాక నూలురకము పెంపొందగలదు. దూదేకులవాండ్లకు శిక్షగరపినయెడల కలుగులాభము స్వల్పముగాదు. ప్రతిజిల్లాలోను శిక్షాలయములను వెంటనే స్థాపించుట సాధ్యముగాదు గాని ప్రస్తుతము నూలువడుకు భాగములలో నైనను నేర్పరులైన ప్రచారకులు ఏకులు వడుకుట, పత్తిపట్టుట మొదలగువానిలో

మేలుసంగతులను నేర్పవచ్చును. దీనితోపాటు ప్రతి రాష్ట్రములోను వర్తకప్రదర్శనము జరుపుచుండవలయును. వివిధరకముల దూది, నూలు, గుడ్డలు పరీక్షార్థమై యిచ్చుటకై బంపవలయును. అందువలన రాష్ట్రములోని వర్తకులకు ఎక్కడ ఏమి దొరకునదియు వెల్లడియగును. ఇట్టివి ఏటేటా జరుగుటవలన మనలోపములను గ్రహించి దిద్దుకొనుట కవకాశము గలుగును. పలుమారు ప్రదర్శనములు జరిపి, పనులు చేసిచూపి, వివిధరకముల వస్తువుల చేర్చుటవలన లాభమత్యంతముగ నుండకతప్పదు. పై జెప్పినదంతయు వడుకువిషయమున కొద్దికాలములో రాదగినమార్పులనుగూర్చియే. ఈయభివృద్ధిని యంత్రపరిశ్రమతో బోల్చి చూచినయెడల ఎక్కువసంగతులు బయల్పడి దేశము రాటమునే యవలంబించి యంత్రమును విడువవలసినకారణములు అనేకములుగన్పట్టగలవు. ఇవి రెండును రెండురకముల పరిశ్రమలు. యంత్రపరిశ్రమల కాదర్శము కేంద్రీకరణము; రాటపరిశ్రమకు ఆదర్శము కేంద్రీకరణవిసర్జనము లేక విభజనము. రాటపరిశ్రమయొక్క వ్యాపకము దేశమంతటను జల్లు గురిపించి జలమును అంతటను ఉపయోగపరచుటవంటిది. యంత్రనిర్మాణముజేసి పరిశ్రమను కేంద్రీకరించుట నది కడ్డగట్టి జలమును కొన్నికాలువలకే పెట్టి వాటి ఉపయోగమును క్లుప్తపరచుటవంటిది. ఈరెండుపరిశ్రమలయొక్క ఆదర్శములు పరస్పరసంబంధములేక భిన్నమార్గముల వర్తిం

చును. ఆ మార్గములతోపాటు వాని ఆర్థికస్వభావములును భిన్నముగనే యుండును.

ఈ రెండురకములలో ఏది దేశమునకు ఎక్కువ క్షేమలాభముల నొడగూర్చుననుసమస్య విచారించుటకు పూర్వము, ఇండియాలో యంత్రపరిశ్రమయొక్క పుట్టుక పెంపులనుగూర్చి విమర్శించుట అవసరము. ౧౮౨౮ సంవత్సరము ఇండియాయందు మొదటినూలుయంత్రము కలకత్తాలో స్థాపింపబడినను ౧౮౫౩ సంవత్సరమున బొంబాయిలో ౫౦౦౦ కదుళ్లుగల మొదటినూలు యంత్రము స్థాపింపబడువరకును ఆవిరిబలముతో వస్త్రనిర్మాణము హిందూదేశ పరిశ్రమలో భాగమయినదని చెప్పుటకు వలనుపడదు. పూర్వపు రాటపరిశ్రమ విదేశవస్త్రపు దిగుమతిచే నశించినందున నూలుయంత్రముల స్థాపించి నష్టమును పూర్తిజేయ నుద్దేశింపబడెను. ఈపరిశ్రమకు బాల్యావస్థలోనే అరిష్టము గొట్టినది. అమెరికా యుద్ధమూలమున ౭౮౪ పౌనుల ప్రత్తికి రు ౬౦౦లవరకు ధర పెరిగెను. యుద్ధము ముగిసి ధరలు సర్దుకొనినతరువాత ౧౮౭౨ వరకు యంత్రము లభివృద్ధి నొందసాగెను. ౧౮౭౨ లో ౬౨ యంత్రములు ౧౬౫౪౧౦౩ కదుళ్లును, ౧౫౧౧౬ మగ్గములును గలిగి ౫౩౬౨౪ కూలీలకు పని యియ్యగలిగి యుండెను. అప్పుడే లంకాషైరుకు కన్నులు మెరమెరలాడెను. ఇంగ్లండులోని ఆందోళనఫలితముగ వస్త్రములమీద దిగుమతి

పన్నులన్నియు తీసివేయబడెను. అయినను ఇండియా యంత్రశాల లభివృద్ధిగాంచుచునేయుండెను. గుడ్డలును నూలును విదేశములకు ఎగుమతిగూడ అగుచుండెను. తరువాతిసంవత్సరములలో యంత్రశాలలు మిక్కుటమయ్యెను. ౧౮౮౦ మొదలు ౧౯౨౪ వరకు అభివృద్ధిని చూపుపట్టిక నిం దుదాహరించుచున్నాము.

| సం॥ | మిల్లుల సంఖ్య | మూలధనము | కదుళ్లు | మగ్గములు | పనివాండ్లు |
|---|---|---|---|---|---|
| ౧౮౮౩-౮౪ | ౭౪ | ౮[illegible]౬౭౭౭౨౫౦ | ౧౮౯౫౨౮౪ | ౧౬౨[illegible]౧ | ౬౧౮౩౬ |
| ౧౮౯౩-౯౪ | ౧౩౮ | ౧౧౩౩౦౦౮౪౦ | ౩౫౩౯౬౮౧ | ౨౯౩౯౨ | ౧౩౦౫౭౦ |
| ౧౯౦౩-౦౪ | ౨౦౬ | ౧౫౪౮౭౮౦౫౦ | ౫౧౬౭౬౦౮ | ౪౫౨౮౧ | ౧౮౬౧౪౪ |
| ౧౯౧౩-౧౪ | ౨౬౪ | ౨౧౫౦౨౩౦౫౦ | ౬౬౨౦౫౭౬ | ౯౬౬౬౮ | ౨౬౦౮౪౭ |
| ౧౯౨౩-౨౪ | ౩౩౩ | ౪౦ కోట్లు | ౭౯౨౭౯౩౮ | ౧౪౪౭౯౪ | ౩౪౩౫౭౬ |

కడచిన ౪౦ సంవత్సరములలోను ఇండియాలోని యంత్రపరిశ్రమయొక్క అభివృద్ధినిగూర్చి వ్రాయుట అనవసరము. ఒడుదొడుకులప్రయాణమని చెప్పి విరమించిన చాలును. ౧౯-వ శతాబ్దాంతమున యంత్రము చాల కష్టముల నెదుర్కొనవలసివచ్చెను. లంకాషైరుయొక్క ఓర్వలేమిచే సుంకములు విధించుటయు, బొంబాయిలోని బొబ్బలరోగముచే పనివాండ్లు దొరకకుండుటయు, ౧౯౦౦ వ సంవత్సరములో వర్షాభావముచే ప్రత్తి పండకుండుటయు, మారకపు పద్ధతులలోని ఎగుడుదిగుడులును పరిశ్రమాభివృద్ధిని కొంతవరకు ఆటంకపెట్టినవి. అయినను పరిశ్రమలు క్రమముగ వృద్ధియగుచుండెను. ౧౯౧౩-౧౪ లో ౬౮,౨౭,౭౩,౦౦౦ పౌనుల నూలును ౧౫౦ కోట్ల గజములగుడ్డయును ఉత్పత్తియయ్యెను. పదిసంవత్సరములకు తరువాత ననగా ౧౯౨౨-౨౩ లో ౭౦,౫౮,౪౮,౦౦౦ పౌనుల నూలును ౧౭౦౫ కోట్ల గజముల గుడ్డయును ఉత్పత్తియయ్యెను. యుద్ధకాలములో లంకాషైరు దిగుమతులు తగ్గుటచే ఎక్కువసరకుల నుత్పత్తి జేయుట కవకాశము గలిగినది. యుద్ధమూలముననే క్రొత్తయంత్రముల స్థాపింప వీలుగలుగునదిగాదు. ఎట్లయినను యుద్ధానంతరము యంత్రములకు ఇండియాలో పెద్ద అంగళ్లు దొరకినవి. ప్రస్తుతము ఉత్పత్తియగు సరకులు

౧౦ సంవత్సరముల క్రిందివానికంటె ౧౦౦-కి ౪౦ వంతున హెచ్చినవి.

| | | | |
|---|---|---|---|
| ౧౯౧౨-౧౩ | ౧౯౧౫-౧౬ | ౧౯౧౮-౧౯ | ౧౯౨౧-౨౨ |
| మొ. | మొ. | మొ. | మొ. |
| ౧౯౧౪-౧౫ | ౧౯౧౭-౧౮ | ౧౯౨౦-౨౧లో | ౧౯౨౩-౨౪ |
| సరహాసుమీాద సం॥ | సంవత్సరమునకు | సంవత్సరమునకు | ౧౬౭ కోట్ల గజ |
| ౧౧౭ కోట్ల గజ. | ౧౫౪ కోట్ల గజ. | ౧౫౮ కోట్లు | ములు |

ఇండియాలో ఖర్చుపడేనూలులో ౧౦౦-కి ౯౨ వంతులు మిల్లునూలును, గుడ్డలో విదేశపుదిగుమతికంటె ఖరీదులో కొంచెము తక్కువయినను పరిమాణములో కొంచె మెక్కువగను అనగా ఖర్చుపడేగుడ్డలో ౧౦౦-కి ౨౫ వంతునను ఉత్పత్తియగుచున్నది. అయినను పరిశ్రమ ఇంగ్లండులోవలె బ్రహ్మాండముగ వృద్ధిజెందలేదు. ౧౯౨౧ వ సంవత్సరాంతమున గ్రేటుబ్రిటనులో ౧౧ కోట్ల కదుళ్లను, ౭౯౦౦౦౦ మగ్గములును అనగా ఇండియాలోకంటె పదిరెట్లకదుళ్లును ౭ రెట్ల మగ్గములును పనిచేయుచుండెను. హిందూదేశములోని యంత్రపరిశ్రమము ఇంగ్లండులోని వస్త్రపరిశ్రమతో బోల్చబడదగకున్నను ప్రస్తుతస్థితినిబట్టి చూచినయెడల ఇండియాలో నీపరిశ్రమ మభివృద్ధిజేయుట ఖద్దరును వ్యాపింపజేయుటకంటె ఎక్కువ ఫలకారియు లాభకారియునని అభిప్రాయము వ్యాపించుచున్నది. దేశమునకు యంత్రపరిశ్రమవలన ఎక్కువ లాభము గలు

గునో, లేక రాటపరిశ్రమవలన నెక్కువలాభము గలుగునో తెలిసికొనుటకై పైయభిప్రాయమును పరిశీలింపవలసియున్నది. పరిశ్రమకు అవసరమయిననాలుగయిదు అంశములనుబట్టి పోల్చవలసియున్నది. మొదటిది కావలసినమూలధనము. రెండవది పట్టునట్టికాలము. మూడవది ఉత్పత్తికగుకర్చు. నాలుగవది జాతికిరాగలలాభము. అయిదవది ఈపరిశ్రమల అభివృద్ధివలన సంఘముపై రానున్న మార్పులు. ఈ అయిదింటిలో ఒక్కొక్కటి ప్రత్యేకముగను తక్కినవానితోటి సంబంధముగను విచారింపవలసియుండును.

౧. మొట్టమొదట యంత్రపరిశ్రమయును, రాటపరిశ్రమయును, వ్యాపించుటకు అవసరమయిన మూలధనము పట్టునట్టికాలమునుగూర్చి యోచింతము. యంత్రములయొక్క ప్రస్తుతమూలధనము షుమారు ౮౦ కోట్ల రూపాయలు. దీనితో ౧౦కోట్ల పౌనుల నూలు వడుకుచున్నారు. దీనివలన కదురుకు సంవత్సరమునకు ౧౦౦ పౌను లుత్పత్తియగునట్లు తేలుచున్నది. *ఇండియామిల్లులలో ఉత్పత్తియగు నూలుయొక్క నంబరు సరహాముమీద

* ఇండియాదేశపు మిల్లులలో కదురుకు సంవత్సరమునకు ౧౦౦ పౌనులకంటె ఎక్కువరాదు. కొన్ని సంవత్సరములు తక్కువనూడ వచ్చినది. ౧౨౮ పౌనుల నెప్పుడును మించలేదు.

తెలిసికొనవలసియుండును. ఉత్పత్తియగునూలు మొత్తములో ౧౦౦ కి ౧౩ వంతు ౧ మొదలు ౧౦ నంబర్లను ౫౬ వంతులు, ౧౧ మొ. ౨౦ వరకును ౨౮ వంతులు, ౨౧ మొ. ౩౦ వరకును మూడువంతులు, ౩౦కి పైగను తీయబడుచున్నది. ఈ అంకెలనుబట్టి సరహాముమీద ౧౫ మొదలు ౧౮ నంబర్ల వరకును ఉత్పత్తియగునట్లు తేలుచున్నది. చర్ఖామీద కదురుకు సంవత్సరమునకు ౧౫ వ నంబరునూలు షుమారు $\frac{1}{4}$ పౌను తీయవచ్చును. సంవత్సరమునకు ౮౦ పౌనులు తీయవచ్చును. * ౧౦ నంబర్లది ఒక్కొకరాటమునకు సంవత్సరమునకు ౧౨౦ మొదలు ౧౩౦ పౌనులు తీయవచ్చును. పోల్చుటకై పైనంబరు తీసికొనబడినది. ౭౦ కోట్ల పౌనులనూలు సులభముగా ౯౦ లక్షల రాటములు పూర్తిగా పనిజేసినచో తీయవచ్చును. రాటములు చేయుటకు అవసరమయిన ధనము యంత్రములకై ఖర్చుపెట్టినదానిలో పదవవంతుగూడ నుండదు. అదిగాక దేశములో లక్షలపాతరాటములే నిలువయున్నవి. వీటిమీద పనిజేయుటకు యంత్రములకై ఖర్చుపెట్టబడిన పెద్దమొత్తము లవసరము లేదు. యంత్రములు దిగుమతి చేసికొన నవసరము లేదు. రాటపరిశ్రమకు వలయు అంగనిర్మాణము అమర్చినయెడల, రైళ్లమీద

* చర్ఖామీద ౮ గంటలు పని జరుగునట్లు లెక్క వేయబడినది.

దూది తీసికొనిపోవుట భీమా మొదలయిన వృథాఖర్చులు లేకనే అవసరమయిన దూది నిలువజేసికొన వచ్చును. మనము కోరేపరిస్థితులలో రాటమువల్ల వచ్చేనూలుకు గ్రామసంతలోనో, లేక ఉత్పత్తిచేయువాని యింట్లోనో యావత్తునూలు ఖర్చుకాగలదు.

యుద్ధమునకు పూర్వము యంత్రములోని కదురు ఖరీదు రు ౯౦ లును మగ్గము రు ౯౦౦ లు అవును. ప్రస్తుతపుధరలు రు ౧౦౦ మొ. రు ౧౧౦౦ ల వరకును బోయినవి. అనగా యంత్రపుకదుళ్లు చక్రాయిచ్చినంత నూలునుమాత్రమే వడికినను ౨౫ రెట్లు ఖరీదవును. యంత్రపుకదురుయొక్క శక్తి వృద్ధికావచ్చును. సన్నపునూలు వడుకుటలో యంత్రపుకదురే మెరుగయినది. ౨౦ నంబరు నూలు యంత్రపుకదురుమీద ౭.౨౦ అవున్సులు అనగా రాటపుకదురునకు రెట్టింపుకూడ తీయవచ్చును. అయినను కొనుఖరీదు పోలికేలేదు. యంత్రములో ఒక్క కదురు చేయించినయెడల దేశములో ౨౦ మొ ౨౫ రాటములు వృద్ధిచేయవచ్చును. కదురువిషయమై చెప్పినది మగ్గమునకుకూడ వర్తించగలదు. యంత్రపుమగ్గము వలన సంవత్సరమునకు ౧౨,౦౦౦ గజములగుడ్డ ఉత్పత్తి యగుచున్నది. చేమగ్గము వలన సం॥నకు ౧,౨౦౦ గజములు నేయవచ్చును. ఖరీదునుబట్టి చూచినయెడల

శ్రీ జేమన (గ్రంథాలయము
తేలప్రోలు.

రెంటికిని పోలికే లేదు. మూలధనమునుబట్టి చూచిన యెడల చేతిపని యంత్రపుపనివల్ల తేలిన లెక్కలఫలితము లీక్రింద ఉదాహరింపబడినవి.

| సంవత్సరములో | యంత్రబలము | చేతిబలము |
|---|---|---|
| పనిచేయు కాలము | ౨౯౨౦ గంటలు | ౨౯౨౦ గంటలు |
| కదురుయొక్క పని | ౧౦౦ మొ. ౧౨౦పౌ. | ౯౦ పౌనులు |
| నంబరు | ౧౫ | ౧౫ |
| కదురు ఖరీదు | రు ౧౦౦ | రు ౩ మొదలు ౪ |
| ఖరీదునుబట్టి పని | రు ౧౦౦ | రు ౨౪౦౨ |
| మగ్గమువల్ల పని | ౧౨౦౦౦ గజములు | ౧౨౦౦ గజములు |
| మగ్గము ఖరీదు | రు ౯౦౦ | రు ౨౦ |
| ఖరీదునుబట్టి పని | రు ౧౦౦ | రు ౪౫౦ |

యంత్రపు కదురుయొక్కయు రాటపు కదురుయొక్కయు ఉత్పత్తిశక్తు లెట్లున్నను యంత్రపరిశ్రమ సులభముగా వ్యాపింపజేయవచ్చునని చెప్పవచ్చును. యంత్రపరిశ్రమ చాలసంవత్సరములనుండి వృద్ధియగుచున్నను ముందువృద్ధియగు సందర్భములు జాగ్రతగ పరిశీలించవలసి యున్నది. ఇటీవల యంత్రపరిశ్రమ తూర్పుదేశముల లోని మార్కెటులను బోగొట్టుకొన్నమాట వాస్తవము. ప్రయత్నముజేసిన యెడల ఇండియాలో అంగడులన్నియు స్వాధీనపరుచుకొనుటకు అవకాశముండుటచే విశేషముగ

వృద్ధిచేయుటకు వీలున్నది. దిగుమతులను లేకుండజేయుటకు వీలున్నమాట వాస్తవము. విదేశపు మిల్లుగుడ్డలకును స్వదేశిమిల్లుగుడ్డలకును గల ధరతేడాలు అభివృద్ధికి అడ్డమురావని అనుకొందము. ౧౪౦ కోట్ల గజముల విదేశిగుడ్డయును షుమారు ౬ (౪.౮) కోట్ల పౌనుల నూలుమాత్రమే దిగుమతి యగుచుండుటచే దిగుమతులు అమితముగా లేవని యనుకొందము. అయినను పై దిగుమతి మొత్తములను ఇండియాలో జేయుటకు ప్రస్తుతము పని జేయుచున్న కదుళ్లు చేయుపని ౧౨౦ మొదలు ౧౪౦ పౌనులవరకు వృద్ధియైనను ౩౦ లక్షలు మొదలు ౪౦ లక్షల కదుళ్లు క్రొత్తవిస్తరించవలసియుండును. అదేవిధముగ యంత్రములయు, మగ్గములయు సంఖ్యకూడ రెట్టింపు జేయవలసియుండును. కాని యిది త్వరలో సాధ్యపడేపనియా? కడచిన పది సంవత్సరముల అనుభవమునుబట్టి చూడ త్వరలో వృద్ధియగుట సాధ్యముకాదని తోచుచున్నది. ౧౯౧౩ వ సంవత్సరమునుండి గలిగిన యభివృద్ధిని పూర్వపు సంవత్సరములతో బోల్చిచూడనగును.

| సంవత్సరము | యంత్రముల సంఖ్య | కదుళ్ల సంఖ్య | మగ్గముల సంఖ్య |
|---|---|---|---|
| ౧౮౮౮-౮౯ | ౧౦౯ | ౨౪౬౩౬౪౨ | ౨౨౧౫౬ |
| ౧౮౯౮-౯౯ | ౧౭౪ | ౪౫౪౬౩౩౪౨ | ౩౭౨౨౮ |
| ౧౯౦౯-౧౦ | ౨౪౫ | ౬౧౪౨౫౫౧ | ౮౦౧౭౧ |
| ౧౯౧౩-౧౪ | ౨౬౪ | ౬౬౨౦౫౭౬ | ౯౬౬౮౮ |
| ౧౯౧౪-౧౫ | ౨౫౫ | ౬౫౯౮౧౦౮ | ౧౦౩౩౧౧ |
| ౧౯౧౫-౧౬ | ౨౬౭ | ౬౬౭౫౬౮౮ | ౧౦౮౪౧౭ |
| ౧౯౧౬-౧౭ | ౨౬౭ | ౬౬౭౦౧౬౨ | ౧౧౦౮౧౨ |
| ౧౯౧౭-౧౮ | ౨౬౯ | ౬౬౧౪౨౬౯ | ౧౧౪౮౦౫ |
| ౧౯౧౮-౧౯ | ౨౬౪ | ౬౫౯౦౯౧౮ | ౧౧౬౦౯౪ |
| ౧౯౧౯-౨౦ | ౨౬౩ | ౬౭౧౪౨౬౫ | ౧౧౭౫౫౮ |
| ౧౯౨౦-౨౧ | ౨౫౫ | ౬౭౫౨౪౭౪ | ౧౧౭౯౫౩ |
| ౧౯౨౧-౨౨ | ౨౭౧ | ౬౮౧౪౨౨౩ | ౧౨౮౩౧౪ |
| ౧౯౨౨-౨౩ | ౨౮౯ | ౭౨౪౫౧౧౯ | ౧౩౭౨౩౮ |

మొదటి దశాబ్దములలో అభివృద్ధి యెక్కువతీవ్రముగా గన్పడినది. ౧౯౧౩కు దరిమిలాను కదుళ్లయొక్కయు, రాటములయొక్కయు అభివృద్ధికి పూర్వపు అభివృద్ధితో పోలికయే గన్పట్టదు. ౧౯౧౭-౧౮ కి తరువాత కదుళ్ల సంఖ్య యథాప్రకారముగనుండి ౧౯౨౩-వ సంవత్సరములో మాత్రము ౪ లక్షలు పెరిగినది. యుద్ధకాలములో క్రొత్త యంత్రముల స్థాపించుట దుస్తర మగుటచే గావచ్చును. అయినను ఈ ప్రతిబంధకము ఇంకను నివర్తియైనట్లు కన్పట్టదు. యంత్రములయొ

క్కయు, కదుళ్లయొక్కయు, మగ్గములయొక్కయు ధర లింకను తగ్గలేదు. ఈచిక్కులకుదోషపు ప్రతికూలమయిన మారకపు పద్ధతియు, ఎక్కువడబ్బు వీటిపై వ్యయపెట్టిన యెడల నష్టము వచ్చుననుభయమును కారణములయినవి. ముందయినను పరిస్థితులు బాగుపడునను ఆశయు గన్పట్టదు. కడచిన రెండుమూడుసంవత్సరములును యంత్ర పరిశ్రమకు మిక్కిలి ప్రతికూలముగ నున్న వని చెప్పవచ్చును. పూర్వపు లాభకరమయిన కాలము మారిపోయి చెడుకాలము ప్రారంభించినదాయని తోచుచున్నది. ౧౯౨౧తో పోల్చినయెడల ౧౯౨౨లో లాభము సగము తగ్గిపోయినది. ౧౯౨౪ లో లాభము మఱి తగ్గి చాల మందికి నష్టముకూడ వచ్చినది. పరిశ్రమకు ఎన్నడును లేనిదెబ్బ తగిలినది. అది తప్పకొనుటకు చాలా సంవత్సరములు పట్టవచ్చును. ఇప్పటి పరిస్థితులలో క్రొత్తయంత్రము లమితప్రియమగుట, పెట్టుబడికి వెనుకాడుట, ప్రతికూలమయిన మారకపద్ధతి మున్నగువానివల్ల ౧౯౧౩–౨౩ వరకుండినదానికంటె అభివృద్ధి భిన్నముగా నుండునని తలంచుట కాధారములెవ్వియు గన్పట్టవు. ఆపదిసంవత్సరములలో మగ్గములు ౪౦ వేలును, కదుళ్లు ౭ లక్షలును మాత్రము పెంపొందినది. ఈ లెక్కప్రకారము మనకు కావలసిన ౩౦ లేక ౪౦ లక్షలకదుళ్లు చేకూరు

టికి ౩౦ లేక ౪౦ సంవత్సరములు పట్టవచ్చును. ఇప్పటి ఉత్పత్తినిబట్టి ఏటా ౫ కోట్లగజముల గుడ్డకంటె ఎక్కువ అభివృద్ధి యగుటలేదు. ప్రస్తుతము దిగుమతి యగుచున్న ౧౫౦ కోట్ల గజములగుడ్డ దేశములో ఉత్పత్తియగుటకు ౩౦ లేక ౪౦ సంవత్సరములు పట్టవచ్చును. *

ఈసమస్య దిగుమతులు మొత్తమునకు సరియగు మొత్తమునుఉత్పత్తిచేయుటత్రోతి లేటంతటిసులభమైనదిగాదు. అనేకమయిన ఆర్థికరాజకీయప్రతిబంధకముల నెదుర్కొనవలసి యుండును. విదేశపు యంత్రములు పనిముట్లు ఇంజనీర్లపై శాశ్వతముగ ఆధారపడవలసి యుండుటచే నది దాటుటకు దుస్సాధ్య మయిన ప్రతిబంధకముగా నెంచవచ్చును. సన్నపునూలు ఉత్పత్తిచేయవలయునంటే విదేశపుమాది దిగుమతి చేసికొనవలసివచ్చును. తగిన నిర్వాహకశక్తియు కొత్తరకపు యంత్రములును మన కున్న

---

* బొంబాయివాస్తవ్యులగు ...గారు ముఖ ౧౫ కోట్ల ద్రవ్యమును వినియోగించి యంత్రశాలల నిర్మించినయెడల దిగుమతులు రాకుండ జేయునంత తగిన సరుకులను ఉత్పత్తిచేయవచ్చునని వ్రాసియున్నాడు గాని ౧౫ కోట్లకు లెక్కలు వేసి చూపలేదు. ఇది చాలా తక్కువ మొత్తము. ఇప్పటిధరలనుబట్టి మనకు గావలసిన ౩ లేక ౪ లక్షలకదుళ్లను ౯౦ వేల మగ్గములను కొనుటకు ఆయనచెప్పినదానికి రెట్టింపు మొత్తమయినను పట్టక తప్పదు.

వనుకొన్నను విదేశపు దిగుమతులను లేకుండ జేయవలె యునను మన ఆదర్శము నెరవేరునంతగ మన యంత్రపరిశ్రమ పైకి రాగలదని తోచదు. వస్తుపరిశ్రమకు ముఖ్యమయిన తక్కిన రెండువిషయముల గూర్చి విచారించుటకు ప్రారంభింతము. ఉత్పత్తిఖర్చు, పరిశ్రమవలన దేశమున రాగల లాభములు అను రెండు విషయములును మన మిప్పుడు పరిశీలించి చూతము. విషయము ఆమూలాగ్రముగ గ్రహింపవలయునన్నచో ఇవి రెండును కలిపి విచారించుట మంచిది. రెండురకములపరిశ్రమల ఖర్చులనుగూర్చి విచారించుటకు పూర్వము ఒకటి రెండు సామాన్యవిషయములగూర్చి యోచింతము. కేంద్రీకృత పరిశ్రమలన్నిటిలోను ఖర్చులు తగ్గించి వేగముగ ఉత్పత్తి చేయుటయే ప్రధానోద్దేశము. ఎక్కువ మానవశ్రమ అవసరము లేని ఎక్కువరకపు యంత్రములను తెప్పించి ఆర్థికవ్యవహారముల నిర్వహించి ఉత్పత్తిఖర్చునుతగ్గించుటయే యీపరిశ్రమయొక్క ప్రయత్నము. చేతిపనులవిషయములో ఉద్దేశము ఖర్చులు తగ్గించుటకుగాక వీలయినచో లేకుండజేయుటయే. కొన్నిసందర్భములలో ఉత్పత్తికారుడే వ్యయకారుడు. అప్పుడు అనగా స్వోపయోగమునకుగాని, స్వకుటుంబోపయోగమునకుగాని నూలును వడుకునప్పుడు ఉత్పత్తిఖర్చు కొంత తగ్గిపోవును. వడుకు

ఖర్చు లేదు. దూదిఖరీదు నేతకూలిమాత్రమే గుడ్డఖరీదుగా భావింపబడును. అప్పుడు వారికి అన్నినంబర్ల గుడ్డలును ఖరీదులో తేడా విశేషముండదని మనము ఎరుగుదుము. ఈచౌకధనముతో పోటీకి ఇండియా యంత్రములు గాని, విదేశయంత్రములుగాని నిలువజాలవు. ఇది ఉత్పత్తిఖర్చు తగ్గించుపద్ధతిగాదు; తీసివేయుపద్ధతి. ఇంటి ఉపయోగమునకై శ్రమను వినియోగించుటయేకాని యంత్రసాధనములతో శ్రమను తగ్గించుట కాదు. ఇట్లు శ్రమను తీసివేయుటయందే రాటపు పరిశ్రమయొక్క ఉత్కృష్టత ఇమిడియున్నది. దేశములో అణగియున్న శక్తి సంతతిని వినియోగించుటయే దీని పర్యవసానము.

యంత్రములద్వారా ఉత్పత్తిని కేంద్రీకరించిన భాగములలో ఖాదీ ఉత్పత్తియగుప్రాంతములకంటె గుడ్డలు ఎక్కువఖరీదు గలిగియున్నవనుమాట వాస్తవమే. ఉత్తమ మయిన ఖాదీమండలములలో తెల్లతానులయొక్క గిట్టింపుఖరీదు ౩౬ అం. వెడల్పుగలవి గజము ౦-౬-౬ లును, ౪౫ అం. వెడల్పుగలవి ౦-౮-౯లును, ౫౦ అం. వెడల్పుగలవి ౦-౧౦-౦ లును, ౫౪ అం. వెడల్పు గలవి ౦-౧౦-౯ లును అయియున్నది. అదేనంబరు చిక్కదనముగల మిల్లుగుడ్డలు చాలాచౌకగ నున్నవి. గజమునకు ౦-౧-౦ మొదలు ౦-౧-౯ వరకుగూడ ధరతేడా కని

పెట్టవచ్చును. నూలు ఖరీదులో తేడాలు నిజస్థితిని వెల్లడించగలవు.

| నంబరు | చేతినూలుపౌనువెల | మిల్లునూలుపౌనువెల |
|---|---|---|
| ౧౦ మొ.౧౨ | ౧౩ మొ. ౧౪ అ. | ౮ మొ. ౧౦ అ. |
| ౨౦ | రు ౧-౮-౦ | రు ౧-౦-౦ లోపు |
| ౩౦ | రు ౧-౧౪-౦ | రు ౧-౨-౦ లోపు |

ఫక్తు వడుకుఖర్చులలో తేడాగూడా మనము గమనింపవచ్చును. హిందూదేశయంత్రములలో కేవలము వడుకు ఖర్చులు పౌను ౧ కి షుమారు ౦-౩-౦ అగుచున్నవి. యంత్రములలోనివడుకుఖర్చు లీక్రిందివిధముగ లెక్కింపవచ్చును.

| వడుకుశాఖ | పౌను ౧-కి ఖర్చు పైసలు |
|---|---|
| చిల్లరలు, ఇంజను బాయిలరు | ౩.౦౮ |
| ఊడ్చుట కలుపుట | ౧.౦౦ |
| ఏకుట | .౭౫ |
| అచ్చుగట్టుట | ౩.౨౫ |
| రింగుత్రోసులు ౧౮—౨౦ గుజ్జపుబలము | ౯.౦౦ |
| పంటిచుట్టుట | ౧.౦౦ |
| మూటగట్టి కట్టగట్టుట | .౨౫ |
| సామాను | ౬.౦౦ |

| | |
|---|---|
| బొగ్గు | ౪.౦౦ |
| సిబ్బంది | ౩.౦౦ |
| ఇతరఖర్చులు అనగా వడ్డీవగైరా | ౬.౦౦ |
| మొత్తము | ౩౭.౩౩ |

ఇక రాటమువిషయములో వడుకుకూలి మాత్రమే ౧౦ మొదలు ౧౨ నంబర్లకు సిబ్బందిఖర్చు కలుపకనే పౌనుకు ౦-౪-౦ మొదలు ౦-౪-౬ వరకు అవుచున్నది. నేతకు కూడ యంత్రపుమగ్గమునకంటె చేమగ్గమునకే యెక్కువ కూలి యియ్యవలసి వచ్చుచున్నది. యంత్రములలో నేత ఖర్చు లీవిధముగ నున్నవి:

| పని | పౌను ౧-కి ఖర్చు పైసలు |
|---|---|
| చుట్టుట, పడుగుపోయుట, పడుగుచేయుట | ౪.౫౦ |
| నేత | ౧౭.౦౦ |
| మడతవేయుట | ౧.౫౦ |
| సామాను | ౯.౫౦ |
| బొగ్గు | ౨.౭౫ |
| సిబ్బంది | ౨.౫౦ |
| ఇతర ఖర్చులు | ౮.౦౦ |
| మొత్తము | ౪౫.౭౫ |

పౌనుకు నేతకూలి రు ౦-౫-౦ అవుచున్నది. చేమగ్గమునకు పౌనుగుడ్డకు ౦-౬-౧ తక్కువ గాదు. ఖాదీఖర్చు లింతకంటె తగ్గించుటకు వీలులేదని కాదు. వడుకుకూలి, నేతకూలి స్థిరపడుట, దూదిని నేయువాడే నిలువజేసికొనుట, మగ్గము రాటముల రక్తమును పెంపొందించి యెక్కువ వేగముగ పనిచేయించుట, దేశము మొత్తం మీద ఉత్పత్తి యెక్కువచేయుటమూలమున ఖర్చులు చాలవరకు తగ్గి ఖాదీఖరీదు చాలా రాయితీకావచ్చును. కడచిన రెండుసంవత్సరములలోనే ఖాదీధరలలో చాలా తేడా కనబడినది. ౧౯౨౧ లో ౩౬ అం. వెడల్పు గలది గజము ౧౧ అణాలు గిట్టినది ఇప్పుడు ౭ అణాలును, ౪౫ అం. వె. గలది ౦-౧౨-౦ గిట్టినది ఇప్పుడు ౯ అణాలును, ౫౦ అం. వె. గలది ౦-౧౪-౦ గిట్టినది ౦-౧౦-౦ లును, ౫౪ అం. వె. గలది రు ౧ గిట్టినది ౦-౧౦-౦ లును గిట్టుచున్నవి. ఈమార్పు కొంతవరకు దూదిఖరీదు తగ్గుటవల్ల గావచ్చును. చాలచౌకగా ఉత్పత్తి చేయు ప్రాంతములలోగూడ ధరలు మునుపటికంటె తగ్గుచున్నవి. ఇదిగాక ధర గుడ్డ మనుటనుబట్టి గూడ ఉండును. ఖాదీ యెక్కువకాలము మనితీరునని చెప్పసాధ్యముగాకున్నను రాటముమీద వడికినసూలుచే మగ్గముమీద నేసినగుడ్డ ఎక్కువకాలము మనునని సాధారణముగ జెప్పవచ్చును.

ఇందూరు సంస్థానములోని యొక తంతు శాస్త్రజ్ఞుడు "చర్ఖానూలు" అనుపేరుతో ప్రకటించిన కరపత్ర మీ సందర్భమున విచారింపదగినది. అది మిక్కిలి సమర్థత తోను శాస్త్రబద్ధముగను వ్రాయబడి చేతిపనిలోను, యంత్రపుపనిలోను నూలుకు చేయబడు వివిధసంస్కార ములను పోల్చి వర్ణించి సర్వవిధముల చర్ఖానూలు మేల యిన దని తీర్మానించినది. పూర్వము విదేశవస్త్రముల కంటె ఖాదీ పడగెత్తి అన్నివిధముల శ్రేష్ఠమయినదనిపిం చుకొన్న సంగతి లోకప్రసిద్ధమే. దానియొక్క చౌకదన మునుగూర్చియు, మనుటనుగూర్చియు పలువురు ప్రశంసించి వ్రాసియున్నారు. వడసారము ౧౮౬౬ లోగూడ వాట్సను ఆయన స్వదేశినూలుతో నేసిన ఖాదీయొక్క మేలిగుణ ముల నంగీకరించియున్నాడు. ఈ పూర్వకాలపు యోగ్య తాపత్రములనుబట్టియే రాటపుపరిశ్రమ చక్కని పునా దులమీద నిలిపి పనిజేసినయెడల ఇకముందును పూర్వపు యోగ్యతను గణింపగలదని నమ్మవచ్చును. పూర్వపు సులక్షణము లప్పుడే కన్పడ ప్రారంభించుచున్నవి.

పైమోస్తరుగ ఖర్చులువేసి రెండు పరిశ్రమలను పోల్చి తేల్చినయెడల సరియైన సారాంశము తేలదు. దానితోపాటు దేశమునకు రాగల ఇతర ఉత్తమలాభము లనుగూడ లోతుకు దిగి విమర్శించుననే సరియైన తీర్మాన మునకు రాగలము. యంత్రపరిశ్రమవలన ఒకమార్గమున

వచ్చినలాభము నూరు ఇతరదారులను నష్టము గలిగింప వచ్చును. కనుక యంత్రపరిశ్రమవలన కుల్లుకు తేలగల ప్రయోజనము మొదట పైకిగనుపడినంత లేకపోవచ్చును. విధిలేక యంత్ర పుగుడ్డల గొనుకోట్లాదిజనులందరు కోట్ల ధనమును విదేశీయులకు సమర్పించుకొనుచున్నారు. ఇది యే చేతిపని మైనయెడల ఈనష్ట మంతయు తగ్గిపోవచ్చును. యంత్రపరిశ్రమలో ప్రతి సంవత్సరమును పరుల కిచ్చుధనమంతయు నష్టముక్రింద నే లెక్కగదా. పరులకు బోవుచున్నధన మీక్రింద లెక్కింపబడినది.

| పద్దు | ఖర్చు మొత్తము | చేతిపనులవల్ల తగ్గునది |
|---|---|---|
| ౧. నూలుగుడ్డ కొనిపోవుటకు రైల్వేఖర్చు, భీమా, వర్తకఖర్చు | ౩౹ కోట్లు | ౧౦౦కి ౫౦ వంతున తగ్గును. |
| ౨. ౨౦ లక్షల దూదిబస్తాలను యంత్రములకు తీసికొనిపోవుటకును, భీమా వర్తక ఖర్చులు | ౪౹ కోట్లు | ౧౦౦కి ౫౦ వంతున తగ్గిపోవును. |
| 3. యంత్రములు, ఇతర సామానుల ఖరీదు. | గడచిన నాలుగుసంవత్సరములలో ౫౦లక్షలు | అంతయుతగ్గిపోవును. |
| ౪. సర్కారుపన్ను (ఇప్పుడులేదు) | ౨౧౦ లక్షలు | ఏమియు లేదు. |
| ౫. ఆదాపన్ను. | ౫౦ లక్షలు | ఏమియు లేదు. |
| ౬. మునిసిపల్ పన్నులు. | ౧౨ లక్షలు | ముక్కాలువంతు లేదు. |
| ౭. నీటి పన్ను. | ౧౫ లక్షలు | ఏమియు లేదు. |
| ౮. యంత్రములు చెరిగిపోయిన ఖరీదు. | సంవత్సరమునకు ౭౦ లక్షలు | ఏమియు లేదు. |

౧, ౨, ౩, ౪, ౫ పద్దులు గొప్పనష్టమును సూచించునవే. కడచిన నాలుగుసంవత్సరములలో దిగుమతియైన నూలుయంత్రముల లెక్కలు మనకు కండ్లు తెరపక మానవు.

| ౧౯౧౯-౨౦ | ౧౯౨౦-౨౧ | ౧౯౨౧-౨౨ | ౧౯౨౨-౨౩ |
|---|---|---|---|
| ౨౦౫౪౩౨౬౦ | ౬౮౪౦౪౫౧౦ | ౧౨౦౬౩౩౦౪౬ | ౬౭౦౫౦౩౦ |

విదేశపు సామానుమీదను, విదేశపుశిల్పజ్ఞానము మీదను ఆధారపడియుండుటచే విశేషధనవ్యయము చేసి సామానులు తెప్పించుచుండవలసి వచ్చును. తెచ్చిన యంత్రములు కుదుర్చుటకుగాను ఇంగ్లండులో కంటె నిండియాలో రెట్టింపుఖర్చులగును. ఇంతేకాక యంత్రములను ముందు వృద్ధిచేసికొనవలయునంటే విదేశసహాయమెల్లప్పుడు కోరవలసివచ్చును. ప్రభుత్వమువారికిని ఇతరులకును ఇచ్చుపన్నులే మూడుకోట్లకు మిగులుచున్నవి. సుంకములు తీసివేసినను ఇంకను ఒకకోటి రూపాయలు మిగులును. దారిఖర్చులు, మోతఖర్చులు రాటపరిశ్రమకు అవసరమే లేదు. యంత్రపరిశ్రమలో నీయొక్కపద్దే ౭ లేక ౫ కోట్లకు దాకొనుచున్నది. ప్రకటనలు మొదలగువాని కెంతయో యంత్రపరిశ్రమవారు ఖర్చు పెట్టుచుందురు. మరియొకదృష్టిని జూచినయెడల అనుబంధలాభములెన్నియో కన్పట్టుచున్నవి. యంత్రములలోని ఉత్పత్తి

ఖర్చులను పద్దులవారీగా విడదీసిచూచినయెడల రాటము నకును, చేమగ్గమునకును లేనిఖర్చుల మొత్తము తెలిసి కొనవచ్చును. అహమ్మదాబాదునగరములోని అయిదు యంత్రశాలలలోని ఉత్పత్తిఖర్చులను విడదీసి తఖ్సీలు చూపించుచున్నాము.

| పద్దులు | గుజరాతు స్పిన్నింగ్ మిల్లు | భరతపూరు కాటను మిల్లు | అహమ్మదాబాదు మనిపందు | అహమ్మదాబాదు న్యూ కాటన్ మిల్లు | రాజనగర్ మిల్లు | ఆవరేజి |
|---|---|---|---|---|---|---|
| ౧. కూలి | ౧౫.౯ | ౧౭.౬ | ౧౬.౫ | ౧౪.౮ | ౨౧.౨ | ౧౭°/o |
| ౨. స్టోర్సు | ౧౮.౩ | ౮.౮ | ౯.౭ | ౧౧.౪ | ౧౧.౨ | ౧౨°/o |
| ౩. వంటచెరుకు | ౩.౬ | ౪.౧ | ౩.౪ | ౩.౧ | ౩.౬ | ౩.౫°/o |
| ౪. వడ్డి | ౧.౨ | ౨.౯ | ౨.౬ | ౩.౪ | ... | ౨.౫°/o |
| ౫. కమిషను | ౧.౩ | ౨.౯ | ౪ ౩ | ౪.౦ | ... | ౨.౫°/o |
| ౬. పన్నులు | ౯.౯ | ౫.౯ | ౭.౧ | ౩.౧ | ౨౪ | ౨.౫°/o |
| ౭. దూది | ౪౪.౨ | ౫౦.౧ | ౪౮.౧ | ౫౩.౫ | ౬.౪౦ | ౫౩ °/o |
| ౮. అరుగుడు | ౫.౧ | ౨.౯ | ౨ ౩ | ౨.౮ | ... | .౩ °/o |

వంటచెరుకు, భీమా, కమిషను, పన్నులు, అరుగుడు మొదలగువానిక్రింద ౧౦౦ కి ౧½ వంతున ఖర్చగు చున్నది. వడుకునకును, మగ్గమునకును, పనిజేయువారి సంఖ్య చాలామెక్కువై కూలి చాలా యియ్యవలసి వచ్చినను యంత్రపరిశ్రమలోని వృథాఖర్చు లన్నియు లేకుండబోయి మిక్కుటముగ ఆర్థికలాభముగలుగగలదు.

ఇట్లు యోచించినయెడల రాటమునకును, మగ్గమునకును మొత్తముమీద మిల్లులకంటె తక్కువఖర్చు పట్టునని ఎంచవలసి యుండును.

ఈ రెండు పరిశ్రమలయొక్క ఆర్థికవిషయముల పరిశోధన ముగిసిన వెనుక వీనివలన సాంఘికముగ రాదగిన లాభనష్టములు యోచించవలసి యున్నది. జనులకు ఉద్యోగము గల్పించువిషయమున యంత్రములిచ్చుఉద్యోగము ఈమహాజాతిలో ఏమూలకును రాదు. యంత్రములలో ప్రస్తుతము పనిజేయు కూలీలసంఖ్య ౪ లక్షలు. వీరిసంఖ్యకు ఈపరిశ్రమపై ఆధారపడు దళారులు, చిల్లరవర్తకులు, పెద్దవర్తకులు మొదలగువారి నందరిని చేర్చినచో మొత్తము ౧౦ లక్షలకు మించదు. నూలు వడుకువారిని వదలినను ఒక్క చేమగ్గములమీద పని జేయువారిసంఖ్య దీని కెన్నో రెట్లగును. యంత్రముల సంఖ్య రెట్టింపయినను దేశములో వీనివలన పని దొరకు బీదలసంఖ్య విశేషముగ ఎన్నదగినదిగాదు. పరిశ్రమ ఇంకను పెంపొంది పని తగ్గించుసాధనములు కనిపెట్టిన కొద్దీ అనుద్యోగసమస్య తీవ్రమగుటకే కారణమగును. దేశధనము నంతయు ఏ స్వల్పసంఖ్యాకులచేతులలోనో పోగుపడు కేంద్రీకరణపద్ధతిని గోరరాదు. అందరును న్యాయ

ముగ ధనమును పంచి కుడుచుటయే క్రమమయినపద్ధతి. దేశములోని నిరుద్యోగసమస్య త్వరలో ఎదుర్కొనవలసి యున్నది. దేశములోని బీదసేద్యగాండ్రకు వారిసాంఘిక పరిసరములకు దగిన ఉపవృత్తియొకటి చూపవలసియున్నది. యంత్రము లీపనిని నెరవేర్పజాలవు. వానివలన ఎంత త్వరగా పనిజరిగినను దేశధనమును పలువురికి న్యాయముగ పంచిపెట్టుటకు తోడ్పడజాలవు. పని విస్తరింపజేసి బీదలకందరికిని పని చూపి జీవనాధారమేర్పరచుటకు బదులుగా యంత్రములు సంకుచితము జేయును. దేశములో జనులు పనిలేక సోమరులై దరిద్రములో మునిగి బాధపడుచున్న సమయములో కోట్లకొలది జనులకు వృత్తి గల్పించి పూర్వార్జితమై ప్రస్తుతము మరచిపోవుచున్న పనితనమునకు తిరిగి తావొసగగలది రాటపరిశ్రమయే. అందువలన కోట్లకొలదిజనులకు ఆర్థికనైతికభంగము లేని పని దొరకగలదు. మనగ్రామములలోని పాంచాణవృత్తుల వారెన్నడును ఎఱుంగని ఘోరకష్టములను యంత్రశాలలు తెచ్చిపెట్టగలవు. మనదేశములోని దిగువజాతుల యొక్క ఆరోగ్యమును, నీతియు నెన్నడును చెడలేదు. యంత్రశాలలోని శ్రమ, దాస్యము, అనారోగ్యముల వల్ల కూలీలు త్వరలో క్షీణించిపోవుదురు. యంత్రముల యొక్క దౌష్ట్యము, గోల, అల్లరి అనుభవింపక తీరవు.

ఉండుటకు కింద్లులేక చీకటికోనలలో మగ్గి బాధపడుచు,పిల్చు టకు చక్కనిగాలి యెరుగక, తిరుగుడు, త్రాగుడులలో మునిగి తేలుచుండు యంత్రశాల కూలీలయొక్క బాధను తొలగించుటకు మన మెంతయు నోర్పుతో కృషిసల్పవలసి యున్నది. మన మెంతకష్టపడి యెన్నివిధములు తోడ్పడి నను యంత్రశాల లోనపనివానిని పూర్తిగ నివర్తి జేయ జాలము. పల్లెటూరిపనివాడు తన తోడియంత్రశాలపని వానికంటె నెన్నియో రెట్లు ఆరోగ్యముగను, సుఖముగను జీవించగలడు. పల్లెటూరి వానికి కూలి తక్కువవచ్చినను తనకుటీరపరిసరములలో నెక్కువ సంతృప్తియు, ఆనందమును గలిగియుండును. దేశముయొక్క భావ్యభివృద్ధి యంతయు పల్లెటూరి పని వానిపై నాధారపడియుండును. అతడు తన కుటీరము నుండి అనుద్యోగతను బోనడిచి పదార్థసృష్టిని జేయ వలసియున్నాడు. చేమగ్గపునేతగాడు తన అద్భుతచాతు ర్యమును నెరపి వివిధరకముల పనితనమును ఉపయో గించి క్రొత్త అనెలు వేసి తన వ్యక్తిత్వమును విస్తరింప జేయవలసియున్నాడు. ఇట్టికాలము రాగలదని యాస పొడముచున్నది. ముందు రాబోవు పనివాడు చక్కని పదార్థమును సేకరించి దానిపై తన పనితనమును జూపి తాను సృష్టించిన వస్తువు లని చెప్పుకొని గర్వింపవలసి

౨౪౦A



౭. సన్న నిమాలువడుకుట



౮. సన్నని నూలు వడుకుట

యున్నాడు. ఉత్పత్తియందు స్వాతంత్ర్యము గలిగియుండు టచే జాతియొక్క రుచిని నశింపనీయక పెంపొందింపవలసి యున్నాడు. చేతినిండ పనిగలిగియుండుటచే తన ఉపజ్ఞను సంపూర్ణముగ నుపయోగించుకొనగలడు. దేహమును, మానసమును వికాసము నొందియుండుటచే నతడు నాగరకులైన జాతియొక్క పౌరుషమును నిర్మాణము చేయగలడు. అర్థవంతమును విజ్ఞానవంతమును నగు క్రొత్తపరిశ్రమ పెంపొందినప్పుడే దేశమునందు సౌందర్యము విస్తరించి "అచ్చుపొడిచిన మనస్సులు, అచ్చుపొడిచిన పదార్థములు" అను రోగద్వయమునుండి విముక్తి కాగలదు.

---

# రాష్ట్రము - మార్గము

## ४

### విదేశవస్త్రబహిష్కారము

బహిష్కార మను మాటకు నిజమయిన అర్థము సక్రమనిరోధము. ఒకవ్యక్తికిగాని, సంఘమునకుగాని హాని కరమయినదానిని నిరాకరించి త్రోసివేయుట స్వాభావిక ధర్మము. దాస్యములో నిర్బంధింపబడినజాతులు ప్రబోధితులై స్వచ్ఛందజీవితముయొక్క మూలధర్మములను, స్వత్వములను గుర్తెరిగి ఆత్మరక్షణమునకై ఉపయోగించు ప్రాచీనగౌరవమార్గ మిదియైయున్నది. బహిష్కారము కేవలము నిషేధించుటయే కాదు; నిర్మాణముగూడాను. జాతులు విజాతీయవస్తువులను నిరాకరించి స్వశక్తిపై నాధారపడియుండ గోరినపుడు, ఆనిరాకరణబలముచేతనే తమ నిర్మాణశక్తిని పెంపొందించుకొని అక్రమపోటీదారులను వెడలనడుచుదురు. ఇంగ్లండు తన ఆర్థికపరిస్థితుల కవసరమయినప్పుడు ఈబహిష్కారమార్గమునే తత్క్షణము అవలంబించినది. లెకీ యను ఆంగ్లేయచరిత్రకారుడు

ఆంగ్ల పారిశ్రామికచరిత్రను వ్రాయుచు ఇంగ్లండులో ప్రతి
పరిశ్రమయును విదేశవస్తువులను నిర్బంధములకు లోబర
చియు, స్వదేశపరిశ్రమలకు విరాళములిచ్చియునే పోషించి
పెంపుచేయబడినది. విప్లవమునకు తరువాత జనుల నావే
శించిన సంకుచితస్వార్థపరత్వమే స్వపరిశ్రమల బెంపొం
దించుటకుగాను అమెరికాను విడనాడుకొన్నది. ఐర్లండు
యొక్క పెంపొందుచున్న పరిశ్రమల నాశన మొనర్చినది.
ఇండియాయొక్క కాలికోపరిశ్రమను విధ్వంస మొనర్చినది.
దేశములోని ప్రతివాడును పరిశ్రమల గుత్తకు బుచ్చు
కొన్నవారు కోరినధరల నిచ్చి కొనునట్లు చేసినది. స్వాతం
త్ర్యమహాయుద్ధములో అమెరికాయును ఈమార్గమునే
అనలంబించినది. లెకీ అమెరికా అవలంబించినమార్గము
లను వయినములను వర్ణించియున్నాడు. "ప్రధాననగర
ములోని వర్తకులు స్టాంపుఆక్టు రద్దుఅగువరకును ఇంగ్లండు
నుండి వస్తువుల దిగుమతిచేయమనియు, అదివరకు
చేసిన ఒడంబడికలు రద్దు చేసికొందుమనియు, పూర్వ
పు బాకీలు తీర్మానించుటకు డబ్బుపంపమనియు ఒడం
బడికలు వ్రాసియిచ్చిరి. అమెరికా సంసరాజ్యము
ఇంగ్లండుయొక్క సహాయముతో పనిలేకుండ చేసికొను
టకుగాను దేశీయపరిశ్రమల వృద్ధిపొందించుటకు గొప్ప
ప్రయత్నములు చేయబడెను. ధనవంతులు ఖాదీవస్త్రము

లను ప్రాతగుడ్డలను ధరించి మార్గదర్శకులైరి. ఉన్నిని వృద్ధిచేయుటకుగాను గొర్రెపిల్లల భక్షించుట మాను కొనిరి. దేశమున కగత్యమని తోచినప్పుడు బహిష్కార సాధనము నుపయోగించిన అమెరికా వలసరాజ్యము లును, ఇంగ్లండు దేశమును స్వతంత్ర రాజ్యములుగ నుండు టచే ప్రభుత్వమువారు సకాలములో అవసరమయిన చర్యల దీసికొనుచుండిరి. కాని ఇప్పుడిండియా అట్టిస్థితి లో లేదు. ఇండియాకు స్వాతంత్ర్య ముండినచో ప్రభు త్వమువారు దేశీయపరిశ్రమల నభివృద్ధిచేసియుందురు. ప్రభుత్వమువారు చేయనుంకించని పనిని దేశీయులే చేయ వలెను. ఇంతవరకును దేశము తెలివిలేమిచే నాటుపని వాండ్లను, నడుకువాండ్లను, వారి సమర్థతను, భావనా శక్తిని, పనితనమును, ఆదర్శములను మనము బహిష్క రించితిమి. తిరిగి అానివృత్తిని వృద్ధిచేసికొనుట కవకాశ మియ్యదలచినచో, విదేశీయవస్త్రముల నన్నిటిని బహి ష్కరింపవలయును. దైనికజీవితమునకు ముఖ్యాధారవస్తు వులకై పరులపై నాధారపడినంసియున్నయెడల మనము ఏవిషయమునను అభివృద్ధిపొందుటకు మార్గము గనిపిం చదు. అన్నిటికంటె ముందు మనము యావచ్ఛక్తి నుప యోగించి విదేశవస్తుబహిష్కారము చేయవలసిన దని జనులకు చెప్పవలసినది. ఇండియాదేశములో పారిశ్రామిక

పునరుద్ధారణ యనగా నైతికవైజ్ఞానిక పునరుద్ధారణమే యనియు, వట్టి ఆర్థికవిషయము గాదనియు ఒకరు చెప్పినది వాస్తవము. దానియొక్క ఆద్యంతములు ప్రతి పురుషుని యొక్కయు, స్త్రీయొక్కయు, పిల్లలయొక్కయు మనస్సులకు సంబంధించియున్నవి గాని పనిముట్లకు, యంత్రములకు సంబంధించి లేవు. విదేశీయులపరిపాలనముపై నాధారపడకుండుటయు, దేశీయవృత్తులను పునరుద్ధరించుటయు మన ఆందోళనయొక్క ప్రధానాంశములుగా బెట్టుకొనవలయును.

కనుక ఇండియాలో బహిష్కారమునందు విదేశవస్తు నిరాకరణమును, స్వదేశవస్తుస్వీకరణమును ఇమిడియున్నవి. దేశములో ప్రచారమును, తనయొక్క అవసరములను మితపరచుకొనుటయు బహిష్కారోద్యమమునకు తోడ్పడును. విదేశమునుండివచ్చు దిగుమతులకు సమానమొత్తపుసరకులను ఉత్పత్తిచేయుటయు, చేసినవానిని దేశములో ఖర్చుపెట్టుటకు మార్గములరయుటయు మన గమ్యస్థానము జేరు సాధనములై యున్నవి. విదేశవస్తువును తరిమివేసి దానిస్థానమును స్వదేశవస్తు వాక్రమించవలయును. దీనికి రెండే సాధనములు. యంత్రశక్తిచేనడచు కదురు మగ్గమా, లేక రాటము చేమగ్గమా? మన గమ్యస్థానమును ఏది త్వరగా చేర్చగలదు? మనపని కేది తగియున్నది? ఈ

రెండువిధములయిన పరిశ్రమలలో నేది త్వరగా గమ్యస్థానమును చేర్చగలదో యోచించవలయును. విదేశవస్తువులస్థానము నాక్రమించుకొనుటకు సాధనముల యోచించక పూర్వము దిగుమతులయొక్క ప్రస్తుతస్థితిగతులను గమనించుటమంచిది. నూలువిషయములో ఇండియాలో ప్రస్తుతము ఖర్చగుచున్న నూలుమొత్తములో ౧౦౦కి ౮ వంతులే విదేశమునుండి దిగుమతియగుచున్నవి. ౧౯౧౨-౧౩ మొ. ౨౨-౨౩ వరకు గల పదిసంవత్సరముల లెక్కలను పరిశీలించినయెడల విషయము బోధపడగలదు.

| | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] |
|---|---|---|---|---|---|---|---|
| | సరహాము | | సరహాము | | సరహాము | | సరహాము |
| ఇండియాలో ఖర్చయిన నూలు (కోట్ల పౌనులు) | ౫౪.౧ | | ౫౦.౪ | ౫౭.౦ | | ౬౬.[illegible] | ౭౧.౪ |
| దిగుమతియయిన నూలు (కోట్ల పౌనులు) | ౪.౫ | | ౨.౭ | ౩.౨ | | ౫.౪ | ౫.౭ |
| ౧, ౨, పద్దులు పరస్పరము | ౭% | | ౫% | ౫.౫% | | ౭% | ౭% |

నూలుదిగుమతులు యుద్ధమునకు పూర్వమున్నట్లే యున్నవి. దేశములో నూలుఖర్చు ఎక్కువయినను. దిగుమతు లెక్కువ గాలేదు. నూలువిషయము విడిచి గుడ్డల దిగుమతి యోచింతము.

| | [illegible] సరిహాము | [illegible] సంహాము | [illegible] సరహాము | [illegible] | [illegible] |
|---|---|---|---|---|---|
| దిగుమతులు (కోట్ల గజాలు) | ౨౯౫.౫ | ౧౯౪.౪ | ౧౨౧.౬ | ౧౦౯.౧ | ౧౫౮.౮ |
| ఇండియాలో ఖర్చయిన గుడ్డ (కోట్ల గజములు) | ౪౦౧.౮ | ౩౦౯.౪ | ౩౨౬.౫ | ౩౫౩.౧ | ౪౧౯.౦ |
| ౧, ౨, పద్దులు పరస్పరం | ౫౮½% | ౪౬% | ౩౮½% | ౩౦% | ౩౮% |
| దిగుమతుల విలువ (కోట్ల రూపాయలు) | ౫౦ | ౪౧ | ౫౬ | ౨౧.౮ | ౫౧.౩ |

ప్రస్తుతము దిగుమతులు చాలవరకుతగ్గి ఖర్చయిన మొత్తము ౩౮% అయినను వాటికి ఖరీదు మొత్తమేమాత్రమును తగ్గలేదు. దిగుమతిబిల్లు యథాప్రకారముగనే యున్నది. దిగుమతులు తగ్గుటకు కారణములు మన మూహించవచ్చును; వైనముగా జెప్ప నవసరము లేదు గాని చెప్పబోవునవి కారణములలోనివే యగును. ౧. కడచిన సంవత్సరములలో బహిష్కారోద్యమ ప్రచారము వలని ప్రబోధము. ౨. అందు ఖాదీమీదను, నాటువస్త్రములమీదను గలిగిన అభిమానము. ౩. వస్త్రములఖర్చు తగ్గుట. ౪. మారకపుమార్పులు. ౫. దిగుమతులఖరీదులు హెచ్చుటయు ముఖ్యకారణమే. ఈకారణము లన్నియు తోడ్పడి దిగుమతులను తగ్గించినవి. దేశములో జరిగిన బహిష్కారోద్యమభావముచేత దిగుమతులు యుద్ధపు

పూర్వస్థితి కెన్నడును రావనుట నిశ్చయము. కాని వాటిని పూర్తిగ రాకుండ జేయుటకు ప్రస్తుత మమటులో నున్న సాధనములను పెంపొందించుటయో, లేక క్రొత్తసాధనము లను సృష్టించుటయో జరిపి దిగుమతి యగుచున్న ౧౬౦ కోట్ల గజములగుడ్డను ౫ కోట్ల పౌనులనూలును ఉత్పత్తి చేయవలయును.

క్రొత్తగా సృష్టింపనున్న సాధనముయొక్క స్వభా వమును, అది చేయుచున్న పనియును చర్చించకపూర్వము బహిష్కారపద్ధతి కూడదని చెప్పి యాక్షేపణలను విమ ర్శింపదగును. బహిష్కారమునకు ఇంగ్లాండు జంకదని యు,స్వదేశవస్తువుల ఉత్పత్తి పెంపొందజాలదనియు,అందు చేత దీనివలన మనకే నష్టమనియు మొదటియాక్షేపణ. ౮౦౦ కోట్లపౌనులు అప్పుచేసి యుద్ధమొనర్చిన దేశము ౪ కోట్ల పౌనుల సంవత్సర నష్టమును సులభముగ భరించగలదని కేటుగా రన్నారు. కాని యీవాదములో బలములేదు. బహిష్కారోద్యమమువలని రాజకీయలాభ ములటుండనిచ్చి సంపూర్ణముగ విదేశవస్త్రములరాకుండ జేయగలిగినయెడల ఆర్థికనష్టముయొక్క దెబ్బ ఇంగ్లండు తిప్పుకోలేదు. ఇంగ్లాండుయొక్క ప్రధానపరిశ్రమ వెనుకడు గు వేయ మొదలిడిన చో దాని పారిశ్రామిక ప్రతిష్ఠాపనకంతకు

ను, వస్త్రవ్యాపారమునకును పరపతిసౌకర్యములకును, ఓడ
ప్రయాణమునకును గేవ్రులవర్తకమునకును నష్టము రాక
తప్పదు. పొట్లంపు ప్రభుత్వంవారు ఇండియాలోని
బహిష్కారోద్యమమువలన ఇంగ్లండుకు సంవత్సరమునకు
౮ కోట్లపౌనులు నష్టమువచ్చునని వ్రాసియున్నారు. కాని
ఈనష్ట మొకగొప్పదిగాదు. ఇంగ్లాండుయొక్క పెద్దగుడ్డల
యంగడి పడిపోవును. దాని కింగ్లండు సులభముగ అంగీ
కరించునా? బహిష్కారోద్యమమువలన స్వదేశవస్తువుల
ఉత్పత్తికి ప్రోత్సాహ ముండ దనుమాట సత్యముగాదు.
నిరాకరణోద్యమముయొక్క బలముచేత నే దేశములోని
ఉత్పత్తిసాధనములకు ఉత్తేజము గలిగి పెంపొందగలవు.
అది సాధ్యమే కాదనుట ఒకవిధమగు వాదము. కూప్రో
అను ఆయన దిగుమతిగుడ్డలలో ౧౦౦ కి ౭౫ వంతులు
పోటీవస్తువులుగావనియు, కనుక బహిష్కారము ప్రయో
జనకారి కాదనియు వాదించియున్నారు. * కాని దీనికి

---

* లాభము లేకపోగా దేశములోని యంత్రపరిశ్రమలు అక్రమ
లాభమును పొందుననియు కూప్రో గారు వ్రాసియున్నారు. యంత్రాధి
కారులు ధనాశాపీడితులై బహిష్కారోద్యమమునకు తోడ్పడరనుట
కల్ల. వారికిని దేశక్షేమము కావలసియేయున్నది. వారిపరిశ్రమకు
తోడ్పడునట్టి ఉద్యమము వారును ఉపయోగించుకొని గుడ్డలఅంగడు
లను స్వాధీనపరచుకొనుటకు ప్రయత్నింతురుగాని కేవలంలాభమునే
చూచుకొనుచు అవకాశమును పోగొట్టుకొనరు. రాటపరిశ్రమగూడ
వ్యాపించును గనుక వారు ధరల హెచ్చింపజాలరు.

జవాబిచ్చుట సులభమే. బహిష్కారోద్యమము వ్యాపిం చినకొలదిని సన్నగుడ్డలపై రుచి మారి వ్యామోహము తగ్గిపోవును గనుక ఈప్రతిబంధకము విశేషముబాధకర మయినదిగాదు. దేశీయులొకమాటు మనోనిశ్చయముజేసి కొనినయెడల పోటీవస్తువులలో చేరనివిగూడ ఆరకము లోనికే వచ్చితీరును. లంకాషైరునుండివచ్చు దిగుమతుల కును, ఇండియాలో యంత్రములును చేమగ్గములును ఉత్పత్తిజేయు గుడ్డలకును పోలికలేదు గనుక దిగుమతుల వంటి సన్నని గుడ్డలు తయారు కానిది బహిష్క రింప వీలులేదనువాదము నిలుచునది గాదు. ఆ వాదమే సత్యమయినచో, ఇండియాలోని యంత్రములును, చేమగ్గ ములును తోడ్పడి పనిజేసినను బహిష్కారము నెరవేర జాలదు. పదవ నంబరును తక్కువఖాదీ మిక్కిలి సన్ననై చిక్కనినేత గల విదేశిగుడ్డను నిరాకరింపజేయ గలిగినయెడల ముతకగుడ్డలు సన్నపుగుడ్డతో పోటీకి నిలిచినట్లే. బహిష్కారముయొక్క ఫలితము పోటీలేని గుడ్డలఖరీదు తగ్గి ఎక్కువవ్యాపించుటే యని కూప్రో గారు వాదించిరి గాని పోటీలేని సన్నగుడ్డలుగూడ బహి ష్కరింపబడునని వారెరుంగరు. బహిష్కారము అన్ని రకములగుడ్డకును వర్తించునుగాని సన్నగుడ్డలను మినహా

యించదు. దాని ఉద్దేశము స్వదేశివస్తువులను ప్రోత్సహించుటయే.

జయప్రదముగ బహిష్కారమును జరుపుటకు సాధనము యంత్రపరిశ్రమను విస్తరింపజేయుటయే యని సాధారణముగ సూచింపవచ్చును. విదేశవస్త్రముల బహిష్కారము విజయము గాంచుటకు దేశములోని యంత్రములయొక్క ఉత్పాదనశక్తిని వృద్ధిపరచుటయే మార్గమని పలుమార్లు వాదించబడినది. యంత్రముల నెంతవరకు విస్తరింపజేయవచ్చునో యిదివరకే చర్చించియున్నాము. చర్వితచర్వణము గావించుటకంటె పది సంవత్సరములలో నయినను దిగుమతియగు సరకుల మొత్తమును ఉత్పత్తి చేయునట్లుగ యంత్రముల విస్తరింపజేయుట సాధ్యము గాదని సర్వావసానమున చెప్పిన జాలును. ఈవిషయమున యంత్రములయొక్క సహాయము మనకు కావలసియే యున్నది. అది మనకు వచ్చుటయును నిశ్చయమే. వాటి యుత్పత్తి ౧౯౧౩ లోని ౧౧౦ కోట్ల గజములనుండి ౧౯౨౬ లో ౧౭౯ కోట్ల గజములవరకు వృద్ధియయినది. ౧౩ సంవత్సరములలో ౧౦౦ కి ౬౦ వంతున పెరిగినవి. అవి యింకను ఎక్కువ ఉత్పత్తి చేయవచ్చును. లేక యథాప్రకారముగ నయినను ఉండవచ్చును. ఇంతియే కాక యంత్రములు బహిష్కారదినములలో ధరలను హెచ్చిం

పక మనకు తోడ్పడవచ్చును. అవి ధరలను హెచ్చింపక వీలయినంతవరకు తగ్గించి కేవల స్వలాభమునే చూచుకొనక దేశక్షేమమును గమనించినయెడల దేశమునకవి తమధర్మమును నెరవేర్చినట్లే. యంత్రములవల్లనే విదేశవస్తుబహిష్కారము నెరవేరనియెడల వానికి తోడుగ మఱియొకసాధనమునుగూడ మనము పెంపొందింపవలయును. అప్పుడే మన మాశించునట్టి సంపూర్ణ విదేశవస్తుబహిష్కారమును గావింప శక్తుల మగుదుము. చర్ఖా చేమగ్గమునే యీనూతనసాధనములు. * రాటముయొక్క సామర్థ్యమునుగూర్చి యిదివరకే కొంతవరకు జెప్పియుంటిమి. కాని విదేశవస్తుబహిష్కారమును నిర్వహించుటకు చర్ఖాను మనజాతీయపారిశ్రామికజీవితములో భాగముగ నుండుట కెట్టిస్థితికి తేవలయునో వివరముగ పరిశీలింపవలసియున్నది.

---

* చేమగ్గము లిదివరకే దేశమునకు వలయువస్త్రముల నుత్పత్తి చేయుటకు ప్రారంభించినవి. కాని యవి విశేషము విదేశినూలునే ఉపయోగించుచున్నవి. ౧౯౧౫ వ సంవత్సరమునుండి చేమగ్గముల ఉత్పత్తి ఎక్కువయినది.

చేమగ్గములుచేయు గుడ్డ మొత్తము

| ౧౯౧౫–౧౬ మొ ౧౭–౧౮ | ౧౯౧౮–౧౯ మొ ౨౦–౨౧ | ౧౯౨౧–౨౨ | ౧౯౨౩–౨౪ |
|---|---|---|---|
| ౬౨.౩ కోట్లగజములు | ౬౨.౩ కోట్లగజములు | ౯౪.౪ కోట్లగజములు | ౧౧౦.౩ కోట్లగజములు |

ప్రస్తుతము మనము ౧౫౦ కోట్లగజములగుడ్డయును ౬ కోట్లపౌనులనూలును దిగుమతిచేసికొనుచున్నాము. ఈనూలు వడికినయెడల (పౌనుకు ౫ గజముల వంతున) ౩౦ కోట్లగజములగుడ్డ యగును. ఈ ౧౮౦ కోట్ల గజములగుడ్డను తయారుచేయుటకు సంవత్సరమునకుమగ్గమునకు ౧౨౦౦ గజముల చొప్పున ౧౫ లక్షలమగ్గములు కావలసివచ్చును. మనకు కావలసినసూలును ౧ కోటిరాటములు వడికి యియ్యగలవు. * ప్రస్తుత మున్న చర్ఖాలు మగ్గములే చాలపని జరుగునని యాస పుట్టించుచున్నవి. కాని మనము కోరిన మొత్తము ఉత్పత్తిచేయుటకు ఏమిచేయవలయును? జాతియొక్క ఉత్పాదనశక్తిని సంపూర్ణముగ నుపయోగించుటకు విధానము నేర్పరచి యమలులో బెట్టవలెను. బహిష్కారదినములలోజాతీయోద్దేశమును నెరవేర్చుటకై కేవలము అవసరమయినమట్టుకే ధరించవలయునను నిర్బంధ మేర్పరచుకొనుట మిక్కిలి సహాయకారి

* రాటమునకు (రోజుకు ౮ గంటలపని) సంవత్సరమునకు ౧౦౦ పౌనుల నూలుచొప్పున ౫౦ లక్షలరాటములు ౫౦ కోట్లపౌనుల నూలు నియ్యగలవు. ఇది ౨౫౦ కోట్లగజములగుడ్డ నేయుటకు సరిపోవును. లేక చర్ఖాలు ౮ గంటలుపని జేయక సగముకాలమే పనిజేసిన యెడల ఒకకోటిరాటములు కావలసి వచ్చును. ఇది ౩౦ మంది జనుల కొకచర్ఖా పడుచున్నది. అప్పుడు విదేశవస్తువులను పూర్ణముగ బహిష్కరింపవచ్చును.

యగును. విలువగలదుస్తుల ధరింపగలవాడు అభిమాన పూర్వకనిర్బంధము నేర్పరచుకొని వానిని నిరాకరించిన యెడల బహిష్కారోద్యమము మిక్కిలి తేలిక యగును. ధనికులలో నిదివరకే వ్యాపించి మధ్యరకములో శీఘ్రముగ వ్యాపించుచున్న విజాతీయత శీఘ్రముగ ఆపివేయ వచ్చును. ఖాదీ ప్రవేశించిన వెనుక అతివ్యయము తగ్గి ఔచిత్య మేర్పడుచున్నది. స్వల్పవ్యయముతో జీవించుచు సౌఖ్యము యొక్క దురాదర్శములను విడిచినప్పుడు ఖాదీ యెక్కువసులభముగ వ్యాపించును. జనబాహుళ్య మంతయు ఇతరదేశీయవస్త్రములను సహితము విడిచి ఖాదీనే ధరించునట్లు ప్రబోధింపవలయును. వారు విదేశవస్త్రములను సంపూర్ణముగ త్యజించునట్లు చేయవలయును. జాతి యీ యుద్దేశమును నిర్వహించుటకై ఎడతెగక తీవ్రమైన ఆందోళనమును పట్టుదలతో జరుపవలయును. ఈ విధముగ తగిన ఏర్పాటులతో గట్టిప్రయత్నముచేసినయెడల గొప్ప ఫలితములు వెంటనే కన్పింపగలవు. ఖాదీనిధరించు వారందరును కొంతకాలము ఖాదీప్రచారమునకు బూనుకొనవలయును. జాతికి వారందరియొక్క సేవయు అవసరమై యున్నది. రుచులలో విప్లవము గలిగించుట మనము మొదట చేయవలసినపని. సన్నని నేతకును, చౌక ధరకును మోహపడిపోయిన మార్కెట్టు లన్నియు జనుల

దారిద్ర్యమును తొలగించుటకై తిరిగి సంపాదింపవలసి యున్నది. ఈచర్యలో జాతియొక్క పూర్వపు అభిరుచులు జాతీయావసరముల కనుగుణముగ మార్చవలసియున్నది. చర్ఖాపని యెక్కడ తగ్గలేదు. ఖాదీఅమ్మకమునకై ప్రచారము జరిగినచోట్ల దాని కెక్కువప్రోత్సాహమును గలిగినది. మనము జాగ్రతపడి అవసరమగుదానికంటె నెక్కువఖాదీని ఉత్పత్తిచేయగూడదని హెచ్చరించిరిగాని ఎక్కువ ఉత్పత్తి కావడమంటూ లేనేలేదు. ఖాదీయొక్క అవసరము దేశమందంతటను వ్యాపించియే యున్నది. ఈకోర్కెను వినియోగించి దానినింకను హెచ్చుజేసినయెడల ఎక్కువ ఉత్పత్తివలన చిక్కేర్పడదు. ప్రస్తుతము మన మార్కెటు మధ్యతరగతులకును, పై త ర గ తు ల కు ను గూడ వ్యాపించియున్నది. ఈ అవసరపై శాల్యమంతకును ఖాదీనంద జేయుటకై ప్రయత్నింపవలయును. అట్టిపిల్లె లేని గ్రామములలో పెద్దపట్టణములయందును, చిన్నపట్టణముల యందును దేశాభిమానులకందరికిని వారు కోరెడి ఖాదీని అందజేయుటకు డిపోలు స్థాపించి ప్రోత్సాహము గలిగింపవలయును. పట్టణములలో పరపతిసంఘములద్వారా ఖద్దరు చీట్లపద్ధతి వ్యాపింప జేయవలయును. ఇరువది ముప్పదిమంది ఖద్దరుఅభిమానులు సంఘముగా జేరి నెలకు

కే లేక ౨ రూపాయిలచొప్పున ఖద్దరుచీటి కిచ్చుచున్న యెడల ప్రతినెలయును ముగ్గురు నలుగురు తమకు సంవత్సరమునకు గావలసిన ఖాదీయంతయు కొనుటకును, సంవత్సరముమీద నెలతక్కిసములుగా డబ్బు చెల్లించుటకును అవకాశము గలుగును. సంవత్సరమునకు కావలసినఖాదీ యంతయు ఒక్కపర్యాయము కొని నెలవాయిదాల ప్రకారము చెల్లించువీలు బీదలకును,మధ్యరకమువారికిని విద్యార్థులకును చాల అనుకూలముగా నుండును. సంఘములీవిధముగా టోకుగా కొనునప్పుడు ధర కొంత రాయితీ కూడ చేయవచ్చును. నెలజీతములు సంపాదించు పట్టణవాసులకుమాత్రమే యీపద్ధతి యుపయోగించును. కాని పల్లెటూళ్లలో ఆయాఋతువుల ప్రకారము ఆదా వచ్చుచుండును. వ్యయములును ఆవిధముగనేయుండును. పల్లెటూళ్లలో శాశ్వతపు అంగళ్లు పెట్టుట కిప్పుడువీలు లేదు. అయినను కమిషనో,విరాళములోయిచ్చి తిరిగి అమ్మేవారి ద్వారా వారికి అందజేయవలయును. ఋతుసంతలును, సంచారదుకాణములును పెట్టి పెద్దయాత్రాస్థలములలోను, ఉత్సవదినములలోను అమ్మించినయెడల ఖాదీ అమితముగా అమ్ముడుపోవును. ఖాదీప్రచారమునకై క్రొత్తవిపణుల స్వాధీనపరచుకొను ధర్మము పట్టణవాసులకే కాక వడుకువారికిని, నేయువారికిని గూడ ఉన్నది. ఎంత బీద

వారయినను తాముకూడ ఖాదీని ధరించి ప్రోత్సహించు టకై వారుకూడ ప్రయత్నింపవలయును.

ఖర్చుమొత్తము తెలిసినయెడల ఖాదీ యెక్కువ సులభముగా వ్యాపింపగలదు. ప్రభుత్వమువారి కిష్టమే ఉన్నయెడల తమకు కావలసిన గుడ్డలన్నియు ఖాదీయే కొందుమని నిశ్చయించుకొన్నచో మనము ఉత్పత్తిచేయు దానిలో కొంతభాగమయినను ఖర్చవునని నిశ్చయ ముం డును. వీరుగాక మునిసిపల్ తాలూకాజిల్లాబోర్డులు తమ ఆసుపత్రులలోను, పాఠశాలలలోను, ఇతర ప్రతిష్ఠాపనల లోను ఖాదీని ప్రవేశపెట్టి మన ముత్పత్తిచేయునది చాల వరకు కొనివేయవచ్చును. * ఇది వట్టికొనడమే కాక ఖర్చులేకయే పెద్దఖాదీప్రచారము జరిపినట్లగును.

ఖాదీఉత్పత్తి విభజనపద్ధతిమీద వ్యాపించియున్న భాగములలో కేంద్రీకరణపద్ధతి చొప్పింప వలయును. వడుకువారు సంతలకు దెచ్చి నూలును అమ్మునప్పుడు వారికి ఎడతెగక పనిదొరకుటకు సదుపాయముల గావింప వలయును. నూలుసంతలు స్థాపించుటయే నూలు ఉత్పత్తి

* మునిసిపల్ తాలూకాబోర్డులు కొన్ని పాఠశాలలలో చర్ఖాను తక్లీని ప్రవేశపెట్టినవి. మఱికొన్ని తమ నౌకరులచే ఖాదీ కొనిపించి నవి. అట్టిసంఘములజాబితా భారత చరఖాసంఘమువారి రిపోర్టులలో ప్రకటింపబడినది.

హెచ్చుచేయుమార్గము. వడుకువారు దూది నిలువజేసి కొనలేనంత బీదలుగ నున్నప్పుడు ఋతువులో దూదికొని వారికి సమీపముగ నిలువజేయుచు క్రమముగ వారే నిలువజేసికొనునట్లు ప్రోత్సహింపవలయును. తిండిగింజల పైరుకు గలస్థానము ప్రత్తిపైరుకు గూడ రక్షించుటయే యీయుద్యమముయొక్క ఉద్దేశము. వడుకువాడుదూదిని పొదుపుగా నుపయోగించుకొని దానివలన సంపూర్ణ లాభమును పొందజేయ వలయును. అందువల్లనే ఖాదీ ప్రచారకు లందరును రాటమును, దానిభాగములను చేయుటకును, బాగుచేయుటకును, ఏకుటకును, నేయుట కునుగూడ సమర్థులై యుండవలయును. అట్టి నేర్పరులైన ప్రచారకులు లభించినప్పుడే ఖాదీపరిశ్రమకు మంచి పునాదులు వేయవచ్చును. టోకు ఉత్పత్తితో పాటు స్వంతవడుకుగూడ ప్రతిచోటను ప్రోత్సహింపవలయును. అయిదుగురు గల ఒక కుటుంబములో రోజుకు కొన్ని గంటలచొప్పున చర్ఖాతిరుగుచుండినచో కుటుంబమునకు గావలసిన వస్త్రములన్నియు ఉత్పత్తిచేసికొనవచ్చు నని చాలమంది యెరుగరు. ఈక్రిందిసంగతులు తెలిసికొనదగి నవి. (అ) ౫ గురు గల కుటుంబమునకు సంవత్సరమునకు ౮౦ గజములగుడ్డపట్టును. ఇది నెలకు ౬౹ గజములవును. (ఆ) ౬౹ గజములగుడ్డకు ఒకటిముక్కాలుపౌనునూలు

కావలసియుండును. (ఇ) ఒకచర్ఖా రోజుకు రెండుగంటల వంతున పనిచేసినచో ఈగుడ్డనేయుట కవసరమయిన ౧౫ వనంబరు ఒకటిముక్కాలుపౌనునూలును వడుకవచ్చును. వారికాబుద్ధియేపుట్టవలెనుగాని కుటుంబములును, వ్యక్తులును తమస్వంతపరిశ్రమతోనే కావలసినవస్త్రముల నుత్పత్తి చేసికొనవచ్చును. చేమగ్గములను ప్రోత్సహింప గోరినచో వ్యక్తులు వడుకుటకు ప్రారంభింపవలయును. వ్యక్తులవడుకునకు వర్తించుధర్మములే సంఘములకుగూడ వర్తించును. పట్టణములలో రాటపుక్లబ్బు లేర్పరచి నూలు ఉత్పత్తి నీరూపకముగ ప్రోత్సహింపవలయును. ఆవిధముగ రాటపరిశ్రమను ప్రోత్సహింపనిచో ఉత్పత్తికారుడే వ్యయకారుడుగ నున్నట్టియు, నేత పరిశ్రమకై ధనికుడు గాని, నడుమ లాభము దినువర్తకుడుగాని, అవసరము లేనట్టియు సనాతనమగు నేతపద్ధతి అమలులోనికిరాదు. ఇంట నూలు వడుకుపద్ధతియొక్క లాభ మొకపర్యాయము రుచిగన్నచో జనులు దానిని సంపూర్ణముగ నవలంబించి విడువకుందురు. పూర్వము మనము సోమరులమై వడుకువిద్యను బోగొట్టుకొంటిమి. కాని ఇకమీదనయినను ఇంటిపరిశ్రమయొక్క లాభములను గుర్తించి తీరవలయును.

మూలధనము వసూలుచేసియు, అరువులిచ్చియు, ఇతరవిధముల సకాలమున సహాయము చేసియు, లెక్క

లనుచేర్చి దేశములో పరిస్థితు లెరిగిన ప్రచారకులద్వారా శాస్త్రజ్ఞానము వ్యాపింపజేసియు రాటపుపరిశ్రమ తోడ్పడుటకై పైయధికారమును చలాయించు అంగనిర్మాణము ను గావింపవలయును. మొదటిరోజులలో కేంద్రీకరించి పనిజేసినను పరిశ్రమ క్రమముగ విస్తరించినతరువాత అధికారములను ఒకటితరువాత నొకటి విడదీసి అంగ నిర్మాణము నంతరింప జేయవచ్చును. ఆదర్శపరిస్థితులబ్బి నపుడు ఖాదీ ఎక్కడి కవసరమయిన నక్కడ నిర్మింప బడుచుండును. అయినను వడుకువాండ్రును, నేతగాండ్రును, రయితులును, దూదివర్తకులును మధ్యవర్తులతో నవసరము లేక ఒండొరులతో గలసి సమీపపుమార్కెటులయొక్క అవసరములనుబట్టి అరుదైనరకములను ఎగుమతి జేయు చుందురు గనుక ఖాదీ కేవలప్రాంతికమైనది గాక సర్వ సాధారణమైనదనియు జెప్పవచ్చును. ఈపరిస్థితు లింతలో సాధ్య మగునవి గావు. కాని వీనిని మనగమ్యస్థానముగ నుంచుకొనవలయును. వడుకుపరిశ్రమకు దాని యద్భుత నిరాడంబరత్వమును సమకూర్చున దిదియె. ఆపరిస్థితులు కలిగినప్పుడే బీదలు బాధలు తొలగి చేతినిండ పని గలిగి యుండుటయే కాక దేశసౌభాగ్యము నభివృద్ధిపరచుటకు తోడ్పడుదురు. బహుకాలమునుండి నిద్రాణమయియున్న దేశముయొక్క ఉత్పాదనశక్తికి సంపూర్ణమయిన పని

గలుగును. నూలు వడుకునట్టి కర్షకుడు ప్రత్తిని ఆహార పదార్థముతో సమానావసర మయినదిగ భావించి కేవలము అమ్మి లాభముసంపాదించుకొనుటకే కాక తన కవసరమయిన చొకబట్టలను నిర్మించుకొనుటకై కూడ యేర్చి సేకరించియుంచుకొనును. అప్పుడు హిందూదేశము ఆంగ్లేయులయొక్కయు, ఇతరవిదేశీయులయొక్కయు ప్రత్తిచేనుగా నుండక కళలును, పరిశ్రమలును పెంపొందించి ఘనస్థానమును వహించియుండును. తీవ్రమయిన బహిష్కారోద్యమమువలన జనుల అభిరుచులు మార్పు జెంది దేశములో ప్రతిగృహమును తమ సోమరితనము నువిడిచి దేశవిముక్తికి ఉచితరీతిని తోడ్పడి హిందూదేశము ఇంగ్లాండుయొక్క వస్తువులుగొను పెద్దబేరగాడుగ నుండక ఆత్మసంతుష్టిగలిగి స్వశక్తిచే వివిధవస్తువుల సృష్టించు పరిశ్రమలకాకరమై రాజ్యతృష్ణయును, ధనతృష్ణయును లేక అధికార ధనగౌరవములకై లోభింపక ధైర్యమునకును, పట్టుదలకును ఆదర్శమై గమ్యస్థానమును చేరగలదు.

---




ఆంధ్రపత్రికా ముద్రాలయము ముద్రాసు.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA122B145 |
| పుస్తకం పేరు | రాటము మగ్గము |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | n/o |
| వెనుక అట్ట | n/o |
| మొత్తం పేజీలు | 281 |
| పెద్ద సైజు పేజీలు | n/o |
| ఖాళీ పేజీలు | 8, [illegible] ,II,5 |
| లేని పేజీలు | n/o |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |